# ఆంధ్రగ్రంథమాల పుస్తకముల పట్టిక

---

ఆంధ్రవిజ్ఞానసర్వస్వము (౭ సంపుటములు) సంపు. 1 కి రు. 10-0-0

శ్రీ మహాఋషినిఘంటిత యోగశాస్త్రము—కా. సూర్య
నారాయణయోగిని ... 5-0-0

భగవద్గీత (సంస్కృ.)—జె. రామారావుగారి వ్యాఖ్యాన
ముతో 1, 2, 3 సంపుటములు మాత్రమేఉన్నవి. సంపు. 1 కి ... 1-8-0

శతకకవులచరిత్ర—వం. సుబ్బారావుగారు ... 1-8-0

పారిభాషికపదకోశము (ఇంగ్లీషులోని శాస్త్రీయపద
ముల తెలుగుపదముల నిఘంటువు) ... 1-4-0

ఆంధ్రవాఙ్మయసూచిక (ముద్రితాముద్రితగ్రంథములపట్టిక) 1-0-0

శ్యామసుందరము—ఓం. సత్యనాథముగారు ... 1-0-0

జీవనప్రభాతము (న.)—కె. యన్. వెంకటరమణిగారు ... 1 0-0

భీష్ముడు (నాటకము)—పా. పిచ్చిరెడ్డిగారు ... 1-0 0

అవిమారకము (నాటకము)—మానపల్లి రామకృష్ణకవిగారు 0-10-0

కృషీవలవిజయము ... 0-8-0

వివాహతత్వము—బం. మల్లయ్యశాస్త్రిగారు ... 0-8 0

నిరుద్ధభారతము—మం. వెంకటశర్మగారు ... 0-8-0

శ్రీరామవిజయము (నాటకము) ... 0-8-0

ఆరోగ్యసాధనము— గాంధీమహాత్ముడు ... 0-8 0

గీతాబోధ— ... 0-4-0

ప్రార్థనగీతావళి ... 0-4-0

హాలికోద్ధారము—(ప్ర) శేషాద్రిశర్మగారు ... రు. 0-4-0

మానవస్వత్వములు—థామస్ పెయిన్ ... 0-4-0

హిందీతెలుగు బాలశిక్ష—పం. ఆ. శాస్త్రిగారు ... 0-6-0

,, మొదటివాచకం ... 0 6-0

---

మేనేజరు, ఆంధ్రగ్రంథమాల,

7, తంబుశెట్టివీధి - - - జి. టి., మద్రాసు,



# విషయానుక్రమ

## ఆగస్టు, 1945



## చిత్రములు

సహోధ (మూడురంగుల చిత్రము): శ్రీ ఎ. పైడిరాజు.

ఇతర చిత్రములు, వ్యంగ్యచిత్రములును.



# ఎ ఢా స్థ ల లో

ఇసుకతోటి, రాళ్లతోటి నిండిన బాటల వెంట ఊగుతూ, మందంగా విని పిస్తూన్న వాని గంటల గణగణతో పోతూండే ఒంటెలబారు, దండెత్తి పోతూన్న సైనికదళంకంటె ఎక్కువ దుమ్ము రేగ గొట్టుతాయి. నేలపైన చాల ఎత్తుగా ఒంటెమీద స్వారి చేయువానికికూడ దాహంతో నిమి షాలలో గొంతుక ఆర్చుకు పోతుంది.

అతిదూర ప్రదేశాల మధ్యా, ముఖ్యంగా నీరు లేని స్థలాలలో ఈ ఏడారి యోడలు ప్రయాణం చేస్తవి. ఏదైనా సెలయేరు కాని, వాననీటి చెరువుకాని, ఎక్కడ వున్నా, అక్కడ స్వచ్ఛమైన తేనీరు (టీ) చేయడానికి ఏర్పాట్లు ఉన్నాయి. బలూచి, రాజపుత్రస్థానాల ఎడారుల మధ్యా, సరిహద్దు రాష్ట్రంలోని ఉన్నత శిలా ప్రదేశములలోనూ పరిశుభ్రమైన బ్రూక్ బాండ్ టీ సంవత్సరం పొడుగుగా అందచేయ బడుతోంది.



ఆసేతుహిమాచలం

అందరికి కమ్మటి తేనీరు.

# బ్రూక్ బాండ్

## రెండు ఆకులు - ఒక మొగ.




సంపుటము 22 | ఆగస్టు, 1945 | సంచిక 8
పార్థివ శ్రావణము

# పురోగమనము

•

= శ్రీ దివాకర్ల వేంకటావధాని =

(భర్తృవియోగభీరువులై సహగమనమును, బశ్చాద్గమనము నొనర్చిన సాధ్వీమతల్లు లుండిరిగాని పురోగమన మొనర్చినవార లరుదు. హర్షుని తల్లియగు యశోవతి భర్త మరణశయ్యపై నుండఁగా నావార్త చెవినిబడుట కిష్టములేక చితి పేర్పించికొని స్వశరీరము నగ్ని కాహుతిసేయనుండెను. హర్షుఁ డీవార్త నాలకించి యామెకాళ్లపైఁ బడి "యమ్మా! నీవుగూడ మమ్ము నిర్భాగ్యులఁ జేసిపోవకు" మని యవరోధమొనర్ప నాతని కామె యొసఁగిన సమాధానము.)

అప్రియుండవు కావు నీ కవగుణములు-లేవు, త్యాగార్హుఁడ వొకింత నీవు కావు
తనయ! నాయంకమునఁ బాలు ద్రావునాఁడె-యూహరించితి వయ్య! హృదంతరమును.

అరయఁగ నాప్రభువర్యుని-గురుతరమగు సుప్రసాదగుణమున దానం
తరితంబగు నాదృష్టికిఁ-దిరోహితుఁడ వైతి వీ విదే నిజమోయీ!

మఱియు నఖండరాజ్యసుషమావిషయాధికసక్తిఁ బూరుషాం
తరనిరతానురాగము నెదన్ వహియించి కృపావిహీనలో
సిరియును భూమిగాను గద! శీలవతిన్ జరితార్థ నైతి ను
ర్వర ఘనధర్మకీర్తి ధవళంబగు వంశమునన్ జనించితిన్.

మఱచితివేమొ ? నేఁటి కసమానపరాక్రమ బాహువీర్య భా
స్వరుఁడయి పెక్కుయుద్ధముల వైరుల నుక్కడఁగింపనేర్చె నే
పురుషవరేణ్యుఁ డాతనికిఁ బుణ్యవశంబున భార్యనైతిఁ గే
సరి కెనయైన కేసరిణి సర్వవిధంబులఁ బోలి నాయనా !

వీరునకున్ బుట్టితి నిల-వీరునకుఁ గళత్రమైతి వీరులఁ గంటిన్
బౌరుషవిక్రీతను నే-కోరుట కింకేమి కలవు కోర్కెలు చెపుమా ?

భరతభగీరథ ప్రముఖపార్థివులన్ బురుడించు రాజశే
ఖరుఁ డయినట్టి నీజనకుఁ గల్పనిభున్ గయివట్టికొంటిఁ జె
చ్చెర లభియించెఁ బట్టమహిషీబహుదుర్లభపట్టబంధ మా
దరమున ఫాలభాగమునఁ దాల్చు నదృష్టము నాకుఁ బుత్రకా !

పంతము దాల్చి సేవకయి పర్విడి వచ్చిన తత్సమస్తసా
మంతనరేంద్రకామినులు మంజులనూతనహేమకుంభసం
క్రాంతనదీపునీతసలిలమ్ములతో నభిషేకసత్క్రియన్
వింతగ నిర్వహింపఁగఁ బవిత్రితమయ్యె మదీయమౌళియున్.

అవనతిసేయవచ్చిన ధరాధిపసర్వకుటుంబినీకిరీ
టవిశదరత్నదీధితుల డంబగు పాదసరోజయుగ్మమున్
సవతుల మౌళి బెట్టితిని సర్వవిధంబుల నాశరీరమం
దవయవముల్ సమస్తము కృతార్థములై వెలుగొందెఁ బుత్రకా !

నేఁటికిఁ బుణ్యపుంగరిమ నీరసమై నశియించుచుండె నా
కేటికి రిత్తకోరిక లహీనమతిన్ ధ్వజియింతు మేనుమ
మ్మాటికిఁ బ్రీతిమై నుదుటిమధ్యను గుంకుమబొట్టు పూర్వపున్
శాటలవర్ణయుక్తమయి భాసిలుచుండఁగనే కుమారకా !

అత్యధికగౌరవంబున కాస్పదమగు-నాత్మవిభు మేను దగ్ధమైనట్టి వెనుక
ఁ తివిధంబున నేను వ్యర్థప్రలాప శతసహస్రము లాడ నశక్తురాల.

నను గనుచున్ బురస్కృతి నొసర్చి బహూకరింప నీ
జనకుని పాదధూళిగతిఁ జయ్యన ముందుగఁ బారిపోయి నా
వెనుకనె వచ్చుచుండెఁ బృథివీపతి శూరశిరోవతంసమం
చు నెదురుచూచుచున్న సురసుందరులన్ గని విన్నవించెదన్.

ఇప్పు డాపాదమస్తము నేకరీతి-దగులఁబెట్టుచున్న దుస్తరవియోగ
నామకహుతాశనునికంటె నను నిజమగు-శిఖిశిఖాతతు లింకేమి చేయఁగలవు ?
మరణముకంటెను జీవిత-పరమావధి వేచియుంట బహుకష్టము దు
స్తరముంగద ! తనయా నా-కొరకై నీవేటి కిట్లు కుందెదవోయీ ?

అక్షయస్నేహ మింధనమై వెలుంగు-భర్తృశోకాగ్నికంటెను బావకుండు
చల్లగా నుండు నాతనివల్ల నాకు-శ్రమ ఘటింపఁగఁబోదు నిచ్చలు కుమార !

భర్త కైలాసనిభుఁ డిట్లు పరమపదము-జేరుచుండఁగ నాకేటి జీవితాశ !
యింక నీమేను వాడిపోయిన తృణమ్ము-కంటె మిక్కిలి తేలికగాదె ! తనయ !

ఇంచుక తీపి గల్గి యెటులేనియుఁ గష్టముతోడ నేను జీ
వించిన పుత్రరాజ్యసుఖ మించుకయున్ రుచియింపఁబోదు సే
వించిన భర్త దుఃఖము సహించెడు పాతకురాండ్ర నెంతయున్
వంచనసేయు సంపదలు వత్స ! ప్రయోజన మేమి ? తెల్పుమా !

నిను బ్రతిమాలెదన్ జగతి నిల్వఁగఁదగ్గది కీర్తియే సుమీ
తనయ ! శరీర మెప్పటికో తప్పక నాశన మందితీరు నె
మ్మనమున నున్న నిశ్చయము మాన్పఁ బ్రయత్నము సేయఁబోకు పా
వనమతి యిమ్ము ధైర్యముగ నయ్యనలంబున మేను వాసెదన్.



# పరిదేవనము



=శ్రీ బెల్లంకొండ చంద్రమౌళిశాస్త్రి=

నీలిమబ్బుల చాటుగా వాలిచూచు
లలితసౌదామనీతనూలతసొబంగు
జూడ గన్నులు జాలని పాడుజీవ
నమున చీకటికోణాల నడువగలన !

గుండె బండయి, లోకనిగూఢభావ
మర్మముల మూల మెరుగక, మసలి-దసిలి
ఏడ్వదోచక — లేశమే నేడ్వ రాక
నేడ్చుచుందును — ఏడువనివ్వరేమొ ! !

కట్టివేయుడు ఇంకను; — గళితశృంఖ
లామదస్విన్న సామజ రాజమట్లు
కేళిసల్పుదు స్వచ్ఛందగీర్వనముల —
తేలియాడుదు ప్రేమంపు దివ్యతటుల !

ఇంక నే నాగలేనును ఈనికృష్ట
కష్టదాస్యోల్బణానికి! - కలగి - తొలగి -
అంధతమససంఘమ్ములు అవియవలెను !
కోకిలలు కంచుఘంటలు కొట్టవలెను ! !

గుండియను జీల్చి - గొంతుకకొన విదిల్చి —
భూనభమ్ములు మ్రోగింతు బూని తాళ
ములుగ!; వేదన నింకను మోయలేను -
పొంగు పరిదేవనమ్మును మ్రింగలేను! —

# తెలుఁగుకవితలోని సంస్కృతి



= శ్రీ మధునాపంతుల సత్యనారాయణ శాస్త్రి

నాకు భాషలో, భావములో, కవితలో, వ్రాఁతలో, చివరకు కట్టులో, బొట్టులో సంస్కృతి కావలయును. కావలయు నని పదిమందిలో బల్లగ్రుద్ది చెప్పను. కాని నాకుఁ గావలయును. ఒకప్పుడు ఒక సంఘములో నన్ను సంస్కారి యనుకొనుట విని తల వాల్చుకొందును. ఒక సందర్భమున, ఒక పరిషత్తులో "వీరికి సంస్కృతి యేమో తెలియ" దనుకొనుట విని నాలో నేను దుఃఖింతును. అక్కడ, ఇక్కడ నాకు నేను సంస్కారి నని నిర్భయముగాఁ జెప్పుకోలేను. ఇది నాస్వభావము. నా ఆడిన మాట, నా వ్రాసిన వ్రాఁత, నా కట్టిన కట్టు శుద్ధ - సంస్కారదూరముగా నుండవలె నని చాలవఱకుఁ బైకి తంటాలుపడుదును. ఆ తంటాలుపడుటయు నొక్కొక్క సందర్భముననే సుఁడీ! యువకబృందము కూడి, ఉడుకునెత్తు రోడి పాఱుచున్న సమయములో నేను మాటాడు మాట లిరువదవ శతాబ్ది దాఁటి పరుగులెత్తును. ఏతావతా, ఈ సంస్కార-అసంస్కార భావములకు సంఘమును బట్టి నాలో నుండుట, లేకుండుట తటస్థించుచున్న దని ఫలితార్థము. ఉద్యోగము చేయుచున్న నాళ్లలో "నేను సంస్కారి" ననుకొనుటయుఁ జచ్చినచా వయ్యెడిది. అది లేనినాళ్లలో సంస్కారవాదమునకుఁ బతాక నెత్తుద మని ప్రయత్నించితిని. అక్కడ కదియు నయినది. లోలో నా సంస్కారాభిరతి పుటపాకప్రతీకాశమై యుడికి ఉండిపోయినది.

సంస్కారకుసుమపు కంపు నేను అణఁచిపెట్టిన నణఁగియుండునదియా? నేను మాఱిపోవుచున్నాను. నాతో నా భాష, నా భావము, నాకవిత, నా వేషము మాఱిపోవుచున్నది. "అయినది - వీఁడు మాఱిపోయినాఁడురా" అని నన్నుగూర్చి నవీనులు నవ్వులాట కారంభించిరి. "నే నేమి మాఱలేదే?— గ్రాంథికభాష, ఛందోబద్ధమైన కవిత్వము నేను విడిచిపెట్టలేదే? ఇంక మాఱిపోవుట యేమి, వీరి మొగము" అని సమాధానపఱచుకొంటిని. ఏదో సమాధానము చెప్పికొన్నాను గాని, నిజము చెప్పవలసినచో నేను సగమునకు సగము సంస్కారి నయితిని. నన్ను కప్పి నాలోఁ బెద్దమార్పు వచ్చిపడినది. నాగ్రాంథికము పూర్వగ్రాంథికము గాదు. నాకవిత పూర్వకవిత గాదు. నావేషము సరేసరి.

ఇది బహుచిత్రము! సంస్కృతిశబ్దము భయంకరమై మన మెఱుఁగకుండఁగనే మన ప్రత్యణువునను దావు నేర్పఱచుకొని యుండును. నవ్యులు నన్ను గూర్చి సంస్కారి యనుకొనవలయును. ప్రాచీనులలో నాకు అసంస్కారిబిరుదము రావలయును. ఇది నా యూహ. దీని భావము—నేను పట్టిభయస్థుఁడ నని, లోకవంచకుఁడ నని తేలినది. వలదన్నను విడిచిపెట్టని యీసంస్కృతినిగూర్చి యీ పైపైధిక్కారము నా కెందులకో నాకే తెలియదు. పోనీ, నేను సంస్కారి నని గుండెపై చేయి వైచికొని చెప్పవచ్చునా? — అబ్బె! ధైర్యములేదు. నేను ప్రయత్నముచేయుచున్న సుయోగము కాదేమో యని, మా కులవృద్ధులు చీవాట్లు పెట్టుదు రని సనాతనసంఘములో నా సభ్యత్వపదవి యూడిపోవు నని—ఏదేదో భయము. ఈ భయముతోఁ జచ్చినట్లు పడియుందునా? భాషను గూర్చి, కవితనుగూర్చి సంస్కార మత్యవసర మని

పత్త్రికలకు మాఱుపేరులతో వ్యాసములు పంపుచుందును. పత్త్రికాసంపాదకులు ఆ వ్యాసముల కిచ్చిన బహుమానములు మరల నావే. మొత్తముమీఁద సంస్కారవాదులలోను, అసంస్కారవాదులలోను నాకు మాటరాకుండఁ గాలక్షేపము చేసికొనివచ్చుచుంటిని. ఈ వంచకత యింకముందు సాఁగునో, సాఁగదో ?

కొంచెము రూపభేదముతప్ప సంస్కారము, సంస్కృతియు నొక్కటే. సంస్కృతి యన సరిపఱుచుట యనికదా యర్థము! పూర్వవిషయము సరిగా లేదని మనకుఁ దోఁచినది సరిపఱుచుట సంస్కార మని తేల్చుకొంటిమి. పూర్వజన్మసంస్కారము, పూర్వజన్మసంస్కారము అని వేదాంతు లనుచుండు మాటలోని సంస్కారశబ్దమునకు, మన సంస్కారశబ్దమునకుఁ గొంచెము భేద మున్నది. దానికి అనుభూతార్థస్మృతి యని, దీనికి సరిపఱుచుట యని అర్థము. ఉపనయనాదిసంస్కార మన్న చోటి సంస్కారశబ్దమునకుఁగూడ సరిపఱుచుటయే యర్థము. వ్యర్థముగా సంస్కారమన్నంతనే కన్ను లెఱ్ఱజేయువా రున్నారు మనవారిలో. సంస్కారము అనఁగా ఇంచుమించుగా పరిణామము. అది తప్పనిసరిగ దినదినము ప్రజలలో విజృంభించుచునే యుండును. దానిని మన మాఁగ లేము. మతములో, మఱొకదానిలో సంస్కృతిని గూర్చి మనకేల! మన తెలుఁగుకవితలోని సంస్కృతిని గూర్చి ప్రకృత మనుకోవలయును.

నన్నయాదులను సంస్కారు లనినచోఁ జాల మందికిఁ గిట్టదు. 'సంస్కారి' యనిన నొక పెద్దపులి యని వారి యాశయము. నన్నయవంటి కులబ్రాహ్మణునకు—జపహోమతత్పరునకు సంస్కారిబిరుదము తగిలింపవచ్చునా ? తప్పు-తప్పు-అని యందురు. తిక్కన శ్రీనాథాదులపట్లఁగూడ నీ తగవులాట తప్పదు.

కాదు. నన్నయ సంస్కారి. తనవెనుకఁ గల లక్షణేతరభాషను నన్నయ సంస్కరించెను. ఈ విషయమున భిన్నభావము లుండుఁగాక! మొత్తముమీఁద నిది సంస్కారమనక యేమందురు? భాషావిషయక సంస్కార మొక డొంక. దీనిని కదపరా దిప్పుడు. కవితాసంస్కార మొక్కటే ప్రస్తుతాభాష్యము. కాలమునుబట్టి, కవితనుబట్టి కవి సంస్కారి కాక తప్పదు. కవిత సంస్కృతి నందుచున్నఁగాని రమణీయతరము గాదు. సంస్కృతినందిన కవితయు, సంస్కారియగు కవియు శాశ్వతులు.

ఆ లెక్కకు వచ్చిన, నన్నయ యొకఁడేల! తిక్కన సంస్కారి. శ్రీనాథుఁడు సంస్కారి. పింగళి సూరన సంస్కారి. ఆధునికశకమున శ్రీ వీరేశలింగము సంస్కారి. శ్రీ వేంకటశాస్త్రి, శ్రీ సత్యనారాయణ వీరందఱును సంస్కారులే. ఇంకను దిగినచో నిట్టివారు పెక్కురు. ఈ వేంకటశాస్త్రి ప్రభృతులైన యాధునికులను "సంస్కారులు వీరు" అని విసరివేసినచో, నన్నయ తిక్కనాదులగు ప్రాక్తనకవులను ప్రక్కవారేమందురో యోజింపుఁడు!

నేఁటికాలమున, ఆలంకారికవిఖ్యాతమైన 'భావకవిత్వము' అనుదానినిగూర్చి కొందఱలో నెట్టి యపఖ్యాతి వచ్చినదో, యటులె యీ సంస్కారిశబ్దమునకుఁగూడ వచ్చినది. నన్నయది భావకవిత యనుటకు, నన్నయ భావకవి యనుటకుఁ గొందఱు మీఁదఁబడుదురు. సంస్కారి యనుటకుఁగూడ నట్లే. అది యటుండె.

నన్నయ ప్రాథమికసంస్కారి. ప్రాథమికసంస్కారి యనఁగనే నన్నయకుఁబూర్వము తెలుఁగునఁ గవిత వెలసినటులు సువ్యక్తము. అసలు, లేని దానికి సంస్కృతియే యుండదు. ఉన్నదానికి వన్నెలుచిన్నెలుపెట్టి మెఱుఁగు కల్పించుటయే సంస్కృతి. ఏ బెజవాడశిలాశాసనాదులలోనో ఆంధ్రకవిత అతివిరళముగ నుండియున్నది. దానిని నన్నయ పైకిఁదీసి సంస్కరించి విస్తరింపఁజేసినాఁడు. కాన నన్నయ సంస్కారి. ఇందు విప్రతిపత్తి యుండఁగూడదు. నన్నయకవిప్రభుని కవితాసంస్కృతి యిట్టిదని శృంగగ్రాహికయా చెప్పఁజూచుట నగుఁబాటునకుఁ గారణము. అతని భారతభాగము పద్యపద్యము

నను, గద్యగద్యమునను అతఁడు గావించిన సంస్కారౌచిత్యము వెల్లివిరిసినది. చివరకు అక్షరరమ్యతయుఁ దన కవితలోఁ జొనిపి, యందును సంస్కృతి చూపినాఁడు. వచనములు రచించుటలో నన్నయది పెద నేర్పు. కందగీతములు, వచనములు తఱుచుగ వ్రాయుచు నడుమనడుమ నన్నయ శార్దూలాదివృత్తములు చేర్చును. ఆ విషయమున నతఁడు గావించిన యత్యద్భుతసంస్కృతి యన్యదుర్లభము. ఆదిపర్వమున ఉదంకుఁడు ఉరగలోకమున కరిగి నాగపతులను "బహువనపాదపాబ్ధి" ఇత్యాదిపద్యములు నాల్గింటిచేత స్తుతించును. అవి నాలుగును వృత్తములు. అక్కడ ఆ వృత్తములే చేర్చుట నన్నయకుఁ గల మహోమహాచితీసంస్కృతులకుఁ దార్కాణ.

"వ. ద్రోణుండు నర్జునుచేసిన పరాక్రమంబునకుఁ బరమహృష్టహృదయుండై ద్రుపదుం జూచి నగుచు నిట్లనియె—

క. వీ రెవ్వరయ్య ద్రుపదమ
హారాజులె యిట్లు కృపణులయి పట్టువడన్,
వీరికి వలసెనె యహహా! మ
హారాజ్యమదాంధకార మది వాసెనొకో?

గీ. ఇంకనైన మమ్ము నెఱుఁగంగనగునొక్కొ?
యనుచు నుల్లసంబులాడి ద్రుపదు
విడిచిపుచ్చె గురుఁడు విప్రుల యలుకయుఁ
దృణహుతాశనంబు దీర్ఘమగునె?"

ఈ యక్షరపంక్తులలోని యంద మేమి చెప్పఁగలము. పద్యము నెత్తుగడలో, పద్యములు వ్రాసివ్రాసి వచనములు చొనుపుటలో, సీసపద్యము డిగువ ఎత్తుగీతములు కూర్చునేర్పులో నన్నయసంస్కృతీగరిమ మిన్నుముట్టినది. తొలుతఁ దెలుఁగుకవిత కాప్రభువు గావించిన యపూర్వసంస్కార మమూల్యాలంకారము.

తిక్కన నన్నయతరువాత పేరుగనిన సంస్కారి. ఆంధ్రావళిమోదముం బొరయునటులు ఈతఁడు సంస్కృతినొనర్చి తెలుఁగుకవితను వెలయింపఁజేసినాఁడు. "వివిధార్థగతిస్ఫురణమ్ము" కలిగి దక్షతతో నన్నయ తెలిఁగించినతరువాత భారతము పదునేనుపర్వములు తాను సాధారణజన సంప్రార్థ్యము, బుధసంతోషప్రదము నయిన రీతిని రచియించి కొంత సంస్కృతి చేసినటు తోఁచును. కేవలము నన్నయనే యనుకరించి స్వాతంత్ర్యము వెలువరింపనివాఁడు కాఁడు తిక్కన. నన్నయమీఁదఁ దిక్కనకు బ్రహ్మాండమంత గౌరవమున్నది. ఆ గౌరవము నన్నయగారి ఆంధ్రకవిత్వవిశారదత్వము, విద్యాదయితత్వము, మహితాత్మత, దక్షత పురస్కరించుకొని వచ్చినది. ఆ గౌరవము అటులుండుఁగాక. నన్నయతిక్కనలకు నడుమ రెండు శతాబ్దు లెడమున్నది. అనఁగా, నన్నయవెనుక నించుమించు రెండువందల యేండ్లకు బయలుదేఱిన తిక్కనలోఁ గొంత సంస్కృతి వ్యాపించి, విరాటాది పర్వములను విలక్షణముగా వ్రాయించి తీఱినది. విలక్షణత యన మఱేమియు లేదు. నన్నయలోఁ దత్సమశబ్దముల పాలెక్కువ యని విమర్శకులు లెక్కలు చూపి వ్రాసియుంచిరి. తిక్కనలో తెలుఁగుపాలధికమని మనకు సుస్పష్టముగ గోచరించుచునే యుండును. భాషావిషయకముగఁ గూడ దిక్కన సంస్కారము గావించెను. దానిని బట్టి నన్నయను సంస్కరింపవలెనని తిక్కనకు దురుద్దేశము లేదు. కాలపరిణామమును బట్టి తిక్కనలోఁ గొంత సంస్కారభావన తనంతదాను వచ్చిపడినది. లాక్షణికముగ నన్నయ పెట్టుకొనిన కఠినబంధములు కొన్ని, మఱి యేకారణముననో తిక్కన సడలించుకొనెను. ఈ సడలింపు సమర్థత లేక యనుటకు జంకుపుట్టును. సంస్కార మనుటకు నేను సంశయముపడను.

నన్నయతిక్కనలతరువాత సంస్కారి ననిపించుకొనినవాఁడు శ్రీనాథుఁడు. స్కాందములోని కాశీఖండము నితఁడు తెనిఁగించినాఁడు. ఆ పరివర్తనము పురాణముగాఁ గాదు, ప్రబంధఫక్కిని. ఈతని యితరకృతులన్నియు నూతనమైన కావ్యమార్గమున నడచినవి. పద్యముల నడకలో, సమాసముల కూర్పులో, తెలుఁగుపలుకుబడినేర్పులో, అమూలకమగు క్రొత్తభావముల చేర్పులో, శ్రీనాథుఁడు కావించిన

వెల్ల చక్కని సంస్కృతి. మొత్తముమీఁద నీ కవి సార్వభౌముని జీవికయే విలక్షణ మైనది. తనకుఁ బూర్వమం దున్న కవులవలె ఏమహారాజునో యాశ్రయించి వ్రాసికొనుచు నుండు నలవా టితనిలో లేదు. ఒకఁడు కా దని యొకనితోఁ జెలిమిచేసి దేశ దేశముల లోని రాజాధిరాజులఁ జూచినాఁడు. అపూర్వములైన కనకాభిషేకాది గౌరవములు చెందినాఁడు. గౌడడిండిమ భట్టు మొదలైనవారితో శాస్త్రార్థములు చేసినాఁడు. శ్రీనాథుని నూతనసంస్కార పరిమళము తెలుఁగులో నెల్ల వెల్లివిరిసినది. నన్నయతిక్కనల త్రోవనే మనము కూడఁ బోవుద మనుకొనక, తన స్వతంత్రతాముద్ర కవితాధనరాశిమీఁద వేసికొని వెడలిన విద్యాధికారి శ్రీనాథుఁడు. ఈ కవిరాజుకవితాసంస్కృతి క్రీడాభిరామములోఁ బతాక నెత్తినది. కాశీఖండమందలి యీ పద్య ముదాహరణముగా నిచ్చుచున్నాను:

ఉ. "ఎట్టు పురాణము ల్పదియు
    నెన్మిదిఁ జెప్పితి? వెట్టు వేదముల్
గట్టితి వేర్పఱించి? నుడి
    కారపు సొం పెసలార భారతం
బెట్టు రచించి? తీవు ఋషి
    వెట్టయి? తొక్కదినంబుమాత్రలోఁ
బొట్టకులేక తిట్టెదవు
    పుణ్యగుణంబుల రాశిఁ గాశికన్."

వీరందఱను దాఁటిపోయిన సంస్కారిని చెప్పవలసివచ్చినపుడు పింగళిసూరన్న. ప్రభావతీప్రద్యుమ్న, కళాపూర్ణోదయములలో నితని కవిత్వసంస్కృతి కరడుకట్టినది. కళాపూర్ణోదయము వాఙ్మయప్రపంచమున నొక పార్వణచంద్రోదయము. కథలోఁ గాదు, కల్పనలోఁ గాదు, కవిత్వములోఁ గాదు, పాత్రౌచితిలోఁ గాదు సూరనకవి యీకావ్యమున నుత్తమజాతిసంస్కృతి వెలయించినాఁడు. నారదాదులచే 'బళిరా సత్కవి వాఁడు'వని ప్రశంసితుఁడైన కవివరుఁడు సూరనార్యుఁడు. సుగాత్రీశాలీనుల కథాచిత్రణములో నాతఁడు చూపిన సంస్కారనైపుణ్యము మన భావముల కందనిది. ఆకథలో నననేల, మొత్తముమీఁద కళాపూర్ణ మొక యెత్తు; ఆధునికకావ్యవాఙ్మయమెల్ల నొక యెత్తు. ఆవిధమైన కావ్యమంతకుమున్ను తెలుఁగులో లేదు. కళాపూర్ణోదయమే ఆధునికకావ్యములకు సంస్కృతియననేమో యొరవడిపెట్టినది. ఈతని కావ్యములలోని సంస్కృతి యిట్టి దని పద్యములు కొన్ని యుదాహరణ మిడుట యీకాగితపు కఱవుకాలములోఁ గూడదు.

ఈవిధముగా నన్నయనాఁటినుండి సూరననాఁటిదాఁక కవిత సక్రమసంస్కృతి నందుచు బహుజనులచే నారాధింపఁబడుచున్నది. సూరననాఁటి నుండి యీనాఁటిదనుక నిట్టికవిత చక్కఁగఁ బరిణతి నందివచ్చుచుంటయు విస్పష్టము.

ఇప్పటివారిలో వీరేశలింగముగారు భాషను, కవితను, ఇంకను జూచినచో మతమునుగూడ సంస్కరించినారు. చెళ్లపిళ్ల వేంకటశాస్త్రిగారు (తిరుపతి వేంకటకవులు) బహుముఖములుగాఁ గవితాసంస్కారము గావించినారు.

క్రియకు నేను చెప్పఁబోవునది, యొకమాట. ఆనాఁడుమొదలు ఈవేళదాఁక చూచుకొనివచ్చినచో, సక్రమముగ, కావలసినవిధముగా, అనింద్యముగా మన తెలుఁగుకవిత సంస్కృతిమార్గమున నున్నది. సంస్కార మన్నంతనే గర్హ్య మనుకొనరాదు. అది సరియగుత్రోవలో నున్నచో శిరసావహింపఁదగినదియే. నవ్యసాహిత్యప్రవర్తకులలోఁ గొందఱు కవిభావకులు కావించు సంస్కృతి యేరి చూచుకొని నమస్కరింపుఁడు. సత్సంస్కృతికి లోఁగనిచోఁ దిరస్కరింపుఁడు.

"సహృదయాః ప్రమాణమ్"

# పాలకురికి సోమనాథుని కాలము

## — శ్రీ బండారు తమ్మయ్య

వయిశ్రీకతో భారతి ౧౯౪౫ ఫిబ్రవరిసంచికలో శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మగారు ప్రకటించిన వ్యాసము చరిత్రజిజ్ఞాసువులు విమర్శకదృష్టితో లెస్సగా గమనింపఁదగియున్నది. సోమనాథుని ద్విపదబసవ పురాణమున కాతని శిష్యప్రశిష్యుఁడు పిడుపర్తి సోమనాథకవి వెలయించిన పద్యబసవపురాణముయొక్క యవతారికనుబట్టి పాలకురికి సోమనాథుఁడు కాకతీయ చక్రవర్తి రెండవప్రతాపరుద్రుని (క్రీ. శ. ౧౨౯౦-౧౩౨౬) కాలమువాఁడని స్థూలదృష్టికి గోచరించు పూర్వాభిప్రాయమునే నీలగంగవరశాసనసాహాయ్యముతో సమర్థించుచు శ్రీ శర్మగారీవ్యాసమును వెలువరించినారు. శాసనాధారములఁబట్టి సోమనాథుని కాలమును నిర్ణయమొనరించుటకయి శర్మగారొనర్చిన యీ యుద్యమము ప్రశంసనీయము. కాని పిడుపర్తి సోమనాథుని పద్యబసవపురాణావతారికయందలి విషయములఁబట్టి పాలకురికి సోమనాథుఁడు రెండవ ప్రతాపరుద్రుని కాలమువాఁడగునని శ్రీ వీరేశలింగముపంతులుగారు ఆంధ్రకవిచరిత్ర మొదటి ముద్రణమునందును, శ్రీ చిలుకూరి వీరభద్రరావుపంతులుగారు ఆంధ్రుల చరిత్ర రెండవభాగమునందును ప్రకటించిన యీ పూర్వాభిప్రాయమును మార్చికొని యాంధ్రకవుల చరిత్ర మొదటిభాగము పునర్ముద్రణమునందును, గాకతీయయుగాంధ్రచరిత్రనూత్నముద్రణమునందును బూర్వోదాహృతులయిన యీ చరిత్రకారులును, ఇతరత్ర మఱికొందఱు విమర్శకులును సోమనాథుఁడు మొదటి ప్రతాపరుద్రుని కాలముననే క్రీ. శ. ౧౧౯౫ ప్రాంతమున బసవపురాణమును, దరువాతఁ గ్రీ. శ. ౧౨౩౦ ప్రాంతమునఁ బండితారాధ్యచరిత్రమును రచించియుండు నను నూతనాభిప్రాయము నేకారణములను బట్టి నిర్ణయించిరో యా యుపపత్తులు వేనిని శ్రీ శర్మగారు తమ వ్యాసమునఁ జేర్కొని వాని నొకింతయుకయినఁ బరామర్శింపక యున్నకుండుట శోచనీయము.

కర్ణాటకవిచరిత్ర మొదటి భాగమును బ్రకటించినప్పుడు దత్కర్తలు శ్రీ ఆర్. నరసింహాచార్యులుంగారు కన్నడమున శృంగారసార మను నామాంతరము గల యుద్భటచరిత్రమును శా. శ. ౧౧౪౪ (క్రీ. శ. ౧౨౨౨) లో రచించినట్లు చెప్పికొనిన సోమరాజు తన గ్రంథమునఁ బూర్వకవిస్తుతిలోఁ బాల్కురికి సోమనాథునిఁ బ్రశంసించుటచే సోమనాథుఁడు క్రీ. శ. ౧౧౯౫ ప్రాంతమువాఁడగునని నిర్ణయించియున్నారు. దీనినిబట్టియే శ్రీ వీరేశలింగము పంతులుగారు ఆంధ్రకవుల చరిత్ర ప్రథమభాగ పునర్ముద్రణమున సోమనాథుని కాలమును గూర్చిన పూర్వాభిప్రాయమును మార్చికొని కర్ణాటకవి చరిత్రకారుల నిర్ణయమును దాముగూడ ననుగమించిరి. ఈ విషయమున శ్రీ నరసింహాచార్యులుగారు సోమరాజు గ్రంథమునుండి యుదాహరించిన పద్యము లివి:

మ. "ప్రమథానీక కథార్ణవేందుహరిదే
వాచార్యనం ధైర్యనం
విమలజ్ఞాన సుదీపికాస్ఫురితచే
తస్సద్మనం పద్మనం
సముదంచ ద్వృషభ స్తవామరమహీ
జారామనం సోమనం
క్రమదిందం బలగొండు పేళ్వెనొసెదా
నీకావ్యమం సేవ్యమం"

మ. “జనవ ద్ధోత్తమ సోమరాజసుసిద్ధ
కావ్యంవలం శాలివా
హనశాకాబ్దము దిద్దె సాసిరదనూ
ఱింసింద నాల్వత్తునా
ల్కనెయా రంజిత చిత్రభానువవరా
శ్వీజోత్సితైకాదశీ
వనజాతారితనూజవాసరదొళా
దత్తల్ల మంగర్పితం.”

కన్నడమునఁగాని, తెలుఁగునఁగాని బసవస్తవములను విరివిగా నొనర్చిన సోముఁడు. పాల్కురికి సోముఁడుగాక మఱియొకఁ డెవఁడును గానరానందున సోమరాజు నుతించిన సోమన పాల్కురికి సోమనాథుఁడే కాఁదగునని శ్రీ నరసింహాచార్యులుగారును, శ్రీ వీరేశలింగము పంతులుగారునుగాక తదితరులుగూడ నంగీకరించిరి. ఇఁక సోమరాజు రెండవ పద్యమున నగ్గడించిన దత్కావ్యరచనా కాలమునుగూర్చి కొన్ని విమర్శనములు కన్నడమున వెలువడినవి. వానిలో ముఖ్యమయినవి.

(౧) సోమరాజు ఉద్భట కావ్యముయొక్క వ్రాఁతప్రతులు పెక్కింటిలో “సాసిరద నూఱింసింద నాల్వత్తు నాల్కనె” యనుటకు మాఱు “సాసిరదనానూర్సంద నాల్వత్తునాల్కనె” యను పాఠము కానవచ్చుటచే దానినిబట్టి గ్రంథరచనా కాలము శా. శ. ౧౪౪౪ (క్రీ. శ. ౧౫౨౨) అని యేర్పడునేగాని శా. శ. ౧౧౪౪ (క్రీ. శ. ౧౨౨౨) కాఁజాలదు. “సాసిరద నానూర్సంద” అను పాఠము వ్యాకరణదుష్టమగుటచే శ్రీ నరసింహాచార్యులుగారే దానిని “సాసిరద నూఱింసంద” అని మార్చియుందురు.

(౨) శా. శ. ౧౧౪౪ చిత్రభాను సంవత్సరములో ఆశ్వయుజ శుద్ధైకాదశి గణన ప్రకారము ఆదివార మగునుగాని పద్యములోఁ జెప్పినట్లు బుధవారము కాదు. శా. శ. ౧౪౪౪ లో నది బుధవారమే యగును. కావున “సాసిరద నానూర్సంద” అనునదియే కవిపాఠమయియుండవలెను.

ఈ విమర్శనములకు శ్రీ నరసింహాచారి గారు ౧౯౨౯ లోఁ బ్రకటించిన కర్ణాటకకవిచరిత్ర మూఁడవ భాగమునవతారికలో సమాధానముల నొసఁగి, సోమరాజుకాలమునుగూర్చి తమ పూర్వాభిప్రాయమునే సమర్థించుకొనియున్నారు. వ్రాఁతప్రతులలోని పాఠమును దమకుఁ బూర్వాభిప్రాయ మొకటి లేనప్పుడకారణముగ మార్పఁగలసిన యవసరము లేదనియు, “సాసిరదనూఱింసంద” అను పాఠము దమ కప్పుడు లభించిన వ్రాఁతప్రతులలోఁ గానవచ్చుటచేతనే గ్రహించితిమిగాని “సాసిరదనానూర్సంద” అను వ్యాకరణదుష్టపాఠము వ్రాఁతప్రతులలో నుండఁగా దానిని “సాసిరద నూఱింసంద” అని తాము మార్చియుండలేదనియుఁ గ్రొత్త వాదమును దెచ్చిపెట్టఁదలఁచినవారికే తమ వాదానుగుణముగఁ గవిపాఠమును మార్పవలసిన యవసరమేర్పడు నేమోగాని, కర్ణాటకవిచరిత్రము మొట్టమొదట వ్రాయునప్పు డట్టి కృత్యముతోడి నిమిత్తము తమకుఁ గలుగనేరదనియు, సోమరాజు తన కావ్యమునఁ బూర్వకవిస్తుతిలో హరీశ్వరుఁడు, పద్మరసు, సోమనాథుఁడు అను వీరశైవకవులు మువ్వురనుదప్ప నితరు లెవరిని బ్రశంసింపలేదనియు, నీ మువ్వురుగూడ నించుమించుగ సమీపకాలమువా రనియు, నందు మొదటి యిరువురు నేకకాలమున క్రీ. శ. ౧౧౬౫ ప్రాంతమున నుండిరనుటకుఁ బ్రబలాధారము లున్నవనియు, సోమరాజు క్రీ. శ. ౧౫౨౨ ప్రాంతమువాఁడే యయినచోఁ బాల్కురికి సోమనాథుని తెలుఁగు బసవపురాణమును క్రీ. శ. ౧౩౬౯ లోఁ గన్నడించిన సుప్రసిద్ధవీరశైవకవియగు భీమకవినయినఁ బేర్కొనకుండఁడనియు, మఱియుఁ గ్రీ. శ. ౧౫౫౯ ప్రాంతమువఱకుఁ గొంకణతౌళవదేశములఁ బరిపాలించిన సాళ్వదేవభూపాలుని యాశ్రితుఁడయి క్రీ. శ. ౧౫౫౦ ప్రాంతమున “రసరత్నాకర” మను నలంకారగ్రంథమును రచించిన సాళ్వకవి తన గ్రంథమున సోమరాజుకావ్యమునుండి లక్ష్యముల నుదాహరించియుండుటచే సోమరా జప్పటికిఁ జాలపూర్వుఁడయియుండవలెననియు శ్రీ నరసింహాచారిగారు తమ సమాధానములో వ్రాసియున్నారు.

మఱియు క్రీ. శ. ౧౨౨౨ చిత్రభానుసంవత్సరములోఁ గాకున్నను నంతకుమున్ను గడచిన క్రీ. శ. ౧౨౨౧ వృష సంవత్సరములో ఆశ్వియుజ శుద్ధైకాదశి బుధ వారమే యగుననియు, శాసనములలోఁగూడ నిట్టి స్వల్పవ్యత్యయములు కొన్నియెడల గూనఁ తిథి వారము లలో నేదియే నొకచోటఁ గానవచ్చుననియు, నందుచే నంతమాత్రమున శాసనకాలమునే మార్చుటకుఁ జరిత్ర కారు లెవరు నంగీకరింపఁ జాలరనియు వారు సమా ధాన మొసఁగినారు.

ప్రాఁతప్రతు లన్నిటిలో "సాసిరచనా నూర్నంద" అను పాఠమే యున్నచో నందువలన ౩౦౦ సంవత్సరముల కాలవిభేద మేర్పడుచున్నప్పుడా పాఠము వ్యాకరణ దుష్ట మయినంతమాత్రమున శ్రీ నర సింహాచారిగారివంటి ప్రామాణిక చరిత్రకారుఁడు స్వయముగ దానిని "సాసిరద నూతింసంద" అని మార్చివేసి సోమరాజును మూఁడువందల సంవత్సర ములు ముందుకుఁ దెచ్చుటకుఁ బ్రయత్నింప సాహ సించునని సహృదయులు తలంపఁజాలరు. ప్రాఁత ప్రతులు కొన్నిటిలోనయిన "సాసిరదనూతింసంద" అను పాఠ మున్ననేగాని వారు దానిని గయికొని యుండరు. కొన్ని ప్రతులలో వ్యాకరణ దుష్టమగు మఱొక పాఠ మున్నచో దానినే కవిపాఠమని, నిర్దుష్ట పాఠము వేఱొండు కానవచ్చునప్పుడు విజ్ఞులు గ్రహింపఁజాలరు. కావున శ్రీ నరసింహాచారిగా రొసఁగిన సమాధానములఁబట్టి సోమరాజుకాలము క్రీ. శ. ౧౨౨౨ అనియే తలఁచుట సమంజసము.

ఇంతకు నేది యెట్లున్నను నితరమార్గము లనే కము లున్నప్పుడు కేవలము సోమరాజుపద్యమును బట్టియే మనము సోమనాథుని కాలమును నిర్ణయింప నవసరము లేదు. సోమనాథుని గ్రంథములందలి కొంతి యంతస్సాక్ష్యమునుబట్టియు, మఱికొన్ని యితర ప్రమాణములఁ బట్టియుఁగూడ నాతఁడు మొదటి ప్రతాపరుద్రుని కాలముననే ప్రసిద్ధికి వచ్చి యటు తరు వాత మఱికొంతకాలము జీవించియుండునని నిర్ణయిం పఁదగును. అందుకు వలయు ముఖ్యాధారము లీక్రింద నుదాహరించుచున్నాను.

(౧) కొండవీటి దండకవిలెలో శకసంవత్సరము లేని మొదటి ప్రతాపరుద్రుని శాసన మొకటి యుదాహ రింపఁబడినది. అందులోని కొంతభాగమును శ్రీ శ్రీ మద్దులపల్లి గురుబ్రహ్మశర్మగారు "కొండవీటి సామ్రాజ్యము" అను గ్రంథమున నుద్ధరించియున్నారు. అది యిది:

"దదౌ శరణికోటాఖ్యం బ్రహ్మప్రీత్యా పురం ముదా
చంద్రార్ధమకుటప్రీత్యా చంద్రవాదిపురం దదౌ
కేశవార్పణబుధ్యావై దదా విక్రుపురం భువి
సోమనారాధ్యగురవే పిడుపర్తిపురం దదౌ
ఆదౌ ప్రతాపరుద్రాఖ్యో భూపాలో ధర్మపూర్వకం
సప్తర్షిసంఖ్యయా గ్రామాన్ దదౌ సప్తద్విజాయతే
ఏవం ప్రతాపరుద్రాఖ్యః కృతవాన్ రుద్రసంఖ్యయా,,

మొదటి ప్రతాపరుద్రుని కాలమునఁగాని, రెండవ ప్రతాపరుద్రుని కాలమునఁగాని సోమనారాధ్య గురుఁడు మఱొకఁ డెవఁడును గానరాఁడు. కావున నీశాసనోదాహృతుఁడయిన సోమనారాధ్యుఁడు మన పాలకురికి సోమనాథుఁడే కాఁదగును. ప్రతాపరుద్రుఁ డొసఁగిన పిడుపర్తి నాతఁడు శివరాత్రి కొప్పయ్య మున్నగు శిష్యుల కొసఁగియుండును. ఆ గ్రామమును బట్టియే తరువాత నీ వంశమువారికి "పిడుపర్తి" యను గృహనామ మేర్పడియుండెను. గుంటూరుమండలమున తెనాలితాలూకాలో నిప్పుడొక "పిడుపఱ్ఱు" ఉన్నది. పద్యబసవపురాణకర్త పిడుపర్తి సోమనాథ కవివంశ్యులగు శ్రీ పిడుపర్తి రామలింగ గా రీ గ్రామము తమ పూర్వుల కగ్రహారముగా నీయఁబడి నదే యని నా కొకమాఱు తెలియఁబఱిచిరి.

కాకతీయచక్రవర్తులలో మొదటి ప్రతాపరుద్రు నకు రుద్రదేవుఁ డనియేగాని ప్రతాపరుద్రుఁ డను వ్యవ హారము లేదని కొందఱు వాదించెదరు. శాసనములలో నీతఁడు తఱచుగా రుద్రదేవుఁ డని యుదాహరింపఁబడి నను బ్రతాపరుద్రుఁ డను వ్యవహారముకూ

లేకపోలేదు. ఈతనికి విద్యాభూషణుఁ డను బిరుదము గూడఁ గలదు. నీతిసార మను గ్రంథ మొకటి యాతఁడు సంస్కృతాంధ్రముల రెంటనుగూడ రచించినాఁడు. రెండవ ప్రతాపరుద్రునికంటెఁ బూర్వుఁడును, నాతని మాతామహి రుద్రమదేవికి సామంతుఁడును నగు బద్దెన (భద్రభూపాలుఁడు) తన నీతిశాస్త్ర ముక్తావళి లోఁ బూర్వోక్తమయిన నీతిసారమును పేర్కొనుచు నందుఁ బ్రతాపరుద్రుఁ డనియే వ్యవహరించినాఁడు.

చ. "పరువడి నాంధ్రభాషఁ గల
    బద్దెన నీతియు సంస్కృతంబులోఁ
బరఁగఁ బ్రతాపరుద్రనర
    పాలునిచే రచియింపఁబడ్డ యా
వరవరు నీతిసారము వి
    నంజదువం గడు మంచిదంచుఁ జె
ప్పరఁ గవి నీతిపద్ధతులు
    చేసె వినోదము బాలబోధకుణ్."

ఇట్టి వ్యవహారము ననుసరించియే రుద్రదేవునకుఁ గూడ బ్రతాప విశేషణము కొన్ని శాసనములలోఁ గూడ నెడనెడఁ బ్రయుక్తమయి యున్నది. అందుకుఁ బూర్వోదాహృత శాసనముగూడ నిదర్శనము కాఁ గలదు.

(౨) విశ్వారాధ్యుఁ డను కర్ణాటదేశ పండితుఁడు మహిమ్నము, మల్హణము, మలయరాజీయము, అనామయము, హాలాయుధము నను శివపంచస్తవములకు సంస్కృతభాషలో వ్యాఖ్యానమును రచించినాఁడు. అందు గ్రంథాది నాతఁ డీక్రింది విధమునఁ జెప్పికొని చివరను "ఇతి శ్రీమచ్ఛివాద్వైత సిద్ధాంత పారావార పారీణ విశ్వారాధ్య విరచిత శివపంచస్తవ వ్యాఖ్యానే" అని వ్రాసికొన్నాఁడు.

"సాక్షా దీశ్వరలోకగామిమహిమ శ్శ్రీమత్తటాకాబ్జరా
జారాధ్యాన్వయదుగ్ధసింధువిలసచ్చంద్రోవరాకారవాణ్
సద్వృత్తః పదవాక్యతర్కభరతాలంకారసంగీతవి
ద్విశ్వారాధ్యవిభు శ్శివాగమముఖవ్యాఖ్యానకృ
    ద్భాసతే"

"ఇత్యాది సంస్తుతో లింగణార్యముఖ్యవిచక్షణైః
శివపంచస్తవానాంతు వ్యాఖ్యానం నకృతం పురా
వ్యాఖ్యా హీత్యాదరాధిక్యా దాఖ్యాతోఽహం
    మనీషిభిః
వ్యాఖ్యామి తేషాంతోషాయ ప్రఖ్యాతం స్తవపంచకం"

దీనిలో విశ్వారాధ్యుఁడు తాను తటాకాబ్జరాజారాధ్యుని యన్వయ మను పాలసముద్రమునకుఁ జంద్రుఁడనని చెప్పికొన్నాఁడు. "తటాకాబ్జరా" జనునది "కెరెయపద్మరసు" అను పదమున కొతఁ డొనర్చిన సంస్కృతీకరణము. కెరె యనఁగాఁ గన్నడమునఁ జెఱు వని యర్థము. కర్ణాటదేశమందలి బేలూరు గ్రామమునఁ బద్మరసు తన యద్భుత మహిమముచే నొక తటాకమును గల్పింపఁగా నాతనికిఁ గెరెయ పద్మర సను వ్యవహార మేర్పడెను. ఈ పద్మరసు కన్నడమున వీరశైవ దీక్షాబోధ మన్నగు గ్రంథములు రచించిన కవివతంసుఁడు. ఆతఁడు ద్వారసముద్రమున క్రీ. శ. ౧౧౫౦, ౧౧౬౦ ప్రాంతమునఁ బరిపాలన మొనరించిన నరసింహబళ్ళాలుని యాస్థానమున దండనాథుఁడుగా నుండి పరమతీయ పండితులఁ బలువుర నిర్జించి పేరెన్నిక గన్నవాఁడు. అతఁ డించుమించుగఁ గల్యాణ బసవేశ్వరునకు సమకాలీనుఁడు. ఈతని చరితమును పద్మరాజపురాణ మను పేరితో క్రీ. శ. ౧౩౮౫ ప్రాంతమున నాతని వంశ్యుఁడు పద్మణాంక కవి రచించి యందుఁ దన వంశానుక్రమణికను వివరించుచు మల్లరసు, సకలేశమాదరసు, మాయదేవ, కెరెయ పద్మరసు, కుమారపద్మరసు, విశ్వారాధ్య, దేవారాధ్య, గౌరారాధ్య, దేవార్య, వీరణార్య, పద్మణ, పద్మణాంక (గ్రంథకర్త) అనువారిని గ్రమముగా నొకరికొకరు పుత్త్రులుగాఁ బేర్కొని విశ్వారాధ్యునీ క్రిందివిధమున విశేషముగ వర్ణించినాఁడు.

"ఆ కెరెయపద్మణార్యోదరార్ణవనవసుధాకరం
సుకుమారపద్మరసాద్యరీకృతియనోపుగనిశం
నిరుపమకుమారపద్మరసార్యరాత్మజం
పరమతధ్వాంతప్రచండభాస్కరనీళ

శరణచరణాబ్జచంచచ్చంచరీకం నమస్కృత సమస్త
కరదలింగదౌశైసద్యః ప్రసన్న తేవ జైను [లోకం
నిరతిశయసంవిత్సుఖమనైద్దుదార్య ప్ర
సరచక్రవర్తి విశ్వారాధ్య శ్రీ హ్యుగ్రనొక్కైల్లై సతతం"

ఇట్టి పాండిత్యమహిమములకుఁ దావలమయిన విశ్వారాధ్యుఁడు శివపంచస్తవవ్యాఖ్యాతయే యనుట సంగతముగా నున్నందున, శివధర్మగ్రంథమాలికలోఁ బ్రకటితమయిన శివపంచస్తవి యవతారికలో శ్రీ చిదిరె మఠము వీరభద్రశర్మగారాతఁడు కెరెయపద్మరసు మనుమఁ డనియే నిర్ణయించినారు. కెరెయపద్మరసు క్రీ. శ. ౧౧౬౦ ప్రాంతమువాఁ డగుటచే నాతని మనుమఁడు విశ్వారాధ్యుఁడు క్రీ. శ. ౧౨౪౦ ప్రాంతము వాఁడయి పాల్కురికి సోమనాథున కించుమించుగ సమకాలీనుఁ డగును. ఈతఁడు తన గ్రంథములో మల్హణస్తవమున ౩౯ శ్లోకముల నిచ్చి వ్యాఖ్యా నించుచు వ్యాఖ్యావసానమునఁ బండితారాధ్యచరిత్ర ములోఁ బురాతనప్రకరణమున మల్హణుని కథలోఁ బాల్కురికి సోమనాథుఁడు—

"తనరు సద్భక్తిఁ 'గాంతాకచప్రచయ'
యనుచు నుద్యుక్తుఁడై హరు మనం బలరఁ
బ్రస్తుతాలంకారబంధురమధుర
విస్తారమతిమల్హణస్తోత్ర మనఁగ
నప్పుడు ముప్పదియాఱు శ్లోకములు
సెప్పినంతట మెచ్చి శివుఁడు మల్హణుని."

అని వ్రాసిన వాక్యములఁ బురస్కరించుకొని యీ క్రిందివిధమున వ్రాసినాఁడు:

"యద్యపి కాంతాకచేత్యాదిషట్త్రింశద్వృత్తైః స్తోత్ర మిదం మల్హణేనాభాణీతి పాల్కురికి సోమేశ్వరేణ భణితం, తథా ప్యుపరితనం వృత్తత్రయం బహుపుస్తకస్థితత్వా ద్బహుపాఠసమ్మతత్వా ద్వ్యాఖ్యాతం వస్తుతస్తు యుక్తిమద్భిః ప్రతిక్షిప్తం శ్రీమత్సోమేశ్వర వచనప్రామాణ్యా దితి సర్వం శివం."

కావున దీనినిబట్టికూడ సోమనాథుఁడు మొదటి ప్రతాపరుద్రుని కాలమువాఁ డనుటయే సంగతముగా నుండును.

(౩) పండితారాధ్య చరిత్రావతారికలో సోమనాథుఁడు తాను "పేరెన్నఁబడిన శ్రీ బెలిదేవి వేమ - నారాధ్యులను పరమారాధ్యదేవు-మనుమని శిష్యుండ" నని చెప్పికొనినాఁడు. ఈ బెలిదేవి వేమనారాధ్యుఁడు బసవేశ్వర మల్లికార్జున పండితారాధ్యులకు సమకాలికుఁ డనియు, నాతఁడు సూరసానమ్మ మొదలగు భక్తులు మల్లికార్జునపండితునియొద్ద కేఁగి బసవేశ్వరుని మహిమముల నాతని కుగ్గడించి రనియుఁ బండితారాధ్య చరిత్రలోని దీక్షాప్రకరణమునుబట్టి తెలియ నగును.

"శాంతగుణకదంబ కాంత సూరాంబ
పేరెన్నఁబడిన శ్రీ బెద్దేవి వేమ
నారాధ్యు లాదిగా నలరు జంగములు
దవిలి పండితవిభు దర్శించు వేడ్క

సమ్మతలీల మజ్జన మాచరించు
సమయంబునను సూరసానమ్మ జంగ
మము బెలిదేవ వేమనపండితులును
జనుదేర..................."

ఈ బెలిదేవి వేమన చరితము పండితారాధ్య చరిత్ర పురాతన ప్రకరణములోఁగూడ వర్ణింపఁబడినది. దానినిబట్టికూడ నాతఁడు బసవేశ్వరునకు సమకాలీనుఁ డయి యాతనియెడ విశేషభక్తి కలవాఁడని తెల్లమగును. బసవేశ్వరుఁడు క్రీ. శ. ౧౧౬౭ ప్రాంతమునను, మల్లికార్జునపండితుఁ డటుతరువాత సమీప కాలములో క్రీ. శ. ౧౧౭౦ ప్రాంతమునను లింగైక్యమయియుండురని చరిత్రజ్ఞులు పలువు రంగీకరించిన విషయమే. కావున బెలిదేవి వేమనారాధ్యుఁడుకూడ నాకాలమువాఁడే యగును. దానినిబట్టి సోమనాథుని విద్యాగురులలో నొకఁడగు నాతని మనుమఁడు క్రీ. శ. ౧౨౦౦ ప్రాంతమువాఁ డగును. ఇందుచేఁగూడ సోమనాథుఁడు రెండవ ప్రతాపరుద్రుని రాజ్యకాలమున నుండెననుట పొసఁగనేరదు.

(౪) శ్రీశైలక్షేత్రమున జరగిన యోద్దోలగమున సోమనాథునకు బసవపురాణ కథాసూత్రముల నెత్తి

గించిన పెద్దలలోఁ గరస్థలీ సోమనాథయ్య యొకఁడని బసవపురాణావతారికవలన వ్యక్తమగును.

"జంగమ రత్నంబు శరణసమ్మోదుఁడు
లింగైక్యవర్తి గతాంగవికారి
పండితారాధ్య కృపాసముద్ధతుఁడు
మండిత సద్భక్తి మార్గప్రచారి
విలసితపరమ సంవిత్సుఖాంభోధి
నలిఁ గరస్థలి సోమనాథయ్యగారు"

దీనినిబట్టి యీకరస్థలిసోమనాథుఁ డాకాలమునఁ బ్రసిద్ధుఁడగు మల్లికార్జున పండితారాధ్యునివలన దీక్ష నొందిన శిష్యుఁడని కానవగును. ఆతఁడు బసవపురాణ రచనాకాలమునాఁటికి వృద్ధుఁడయియుండును. దీనిని బట్టి కరస్థలి సోమనాథయ్య జీవించియున్న క్రీ. శ. ౧౧౯౫ ప్రాంతముననే బసవపురాణము రచింపఁబడె. నని తలఁచుట సమంజసముగా నుండును.

(౫) పండితారాధ్యచరిత్రావసానమున సోమనాథుఁ డా గ్రంథరచనాకాలమునాఁటికి మల్లికార్జున పండితుని గురుపట్టమును స్వీకరించి నిర్వహించుచున్న యాతని మనుమలు, మనుమపండితుఁడు మున్నగు నలువురిని, మల్లికార్జునపండితుని పుత్త్రుఁడు కేదారయ్యకు శిష్యుఁడయిన ఇవటూరి సోమనాథుని కుమారులు సూరీశ్వరుఁడు మొదలగు మువ్వురను పేర్కొని వారు తనయ తనయపరంపరోత్తరపరంపరలుగా వర్ధిల్లి తేజరిల్లుఁ గావుతమని యాశీర్వదించి గ్రంథసమాప్తి గావించినాఁడు. ఆ పట్టును సావధానముగఁ బఠించువారికిఁ బండితారాధ్యచరిత్రను సోమనాథుఁడు రచించునప్పటికిఁ బూర్వోదాహృతులయిన మల్లికార్జునపండితుని పౌత్రులు, నాతని శిష్యసంతానమునకుఁ జెందిన ఇవటూరి సోమనాథయ్యపుత్త్రులు సజీవులయి యున్నట్లు వ్యక్తమగును. ఇందువలనఁగూడ సోమనాథుని పండితారాధ్యరచనాకాలమును క్రీ. శ. ౧౨౩౦ ప్రాంతముకంటెఁ గ్రిందికిఁ దెచ్చుట కవకాశ ముండఁ జాలదు.

(౬) సర్వేశ్వరశతకమును రచించిన యథావాక్కుల అన్నమయ్య తన గ్రంథరచనాకాలము శా. శ. ౧౧౬౪ (క్రీ. శ. ౧౨౪౨) అని స్పష్టముగఁ బేర్కొనినాఁడు. ఆ శతకమును సావధానముగఁ జదివినవారి కాతఁడు సోమనాథుని యనుభవసారమును, బండితారాధ్యచరిత్రమును బాగుగాఁ బరీక్షించి యందలి భావములను, బదజాలమును బలుతావుల ననువదించిన తెఱంగు విశదము కాఁగలదు. అట్టి సంవాదములు కొన్ని భారతి సం. ౨౧ సం. ౧౧; సం. ౨౨. సం. ౩లలో శ్రీ నిడుదవోలు వేంకటరావుగారు ప్రకటించిన "శివకవి యథావాక్కుల అన్నమయ్య" అను వ్యాసమునఁ జూడఁదగును. ఇదికూడ సోమనాథుఁడు మొదటి ప్రతాపరుద్రుని కాలమువాఁ డను నిర్ణయమునకే తోడ్పడఁజాలును.

సోమనాథుని బసవపురాణమునుబట్టి క్రీ. శ. ౧౩౬౯ నాఁటికే భీమకవి తన కన్నడబసవపురాణమును రచించినాఁడు. సోముని పండితారాధ్యచరిత్రమును శ్రీనాథుఁడు క్రీ. శ. ౧౩౯౫ ప్రాంతము నాఁటికే పద్యకావ్యముగ ననువదించినాఁడు. సోమనాథుని యీ కృతులు రెండవ ప్రతాపరుద్రుని కాలము నవే క్రీ. శ. ౧౨౯౦, ౧౩౨౦ మధ్య రచింపఁబడె నన్నచో నవి విశేషవ్యాప్తి నంది యంత సమీపకాలములోఁ బయిని జెప్పిన కవులచే ననువదింపఁబడుటకుఁ దగిన యవకాశ ముండనేరదు. మఱియు సోమనాథుని కాలమునాఁటికి నూటికిఁ దొంబదివంతులు తేట తెనుఁగుపదములతోఁ గూర్పఁబడిన తిక్కనభారతము వెల్వడి వ్యాప్తియందున్నచో

"ఉరుతరగద్యపద్యోక్తులకంటె
సరసమై పరఁగిన జాను తెనుంగు
చర్చింపఁగా సర్వసామాన్యమగుటఁ
గూర్చెద ద్విపదలు కోర్కెదైవార"
"ఆరూఢగద్యపద్యాదిప్రబంధ
పూరితసంస్కృతభూయిష్ఠరచన
మానుగా సర్వసామాన్యంబుగామి
జాను తెనుఁగు విశేషము ప్రసన్నతకు"

అని యాంధ్రకృతిరచనములో జాను తెనుఁగును గూర్చు నావశ్యకతను గుఱించి సోమనాథుఁడు తన గ్రంథావతారికలో నంతగాఁ బలవరింపవలసిన యవసరము కానరాదు.

ఇట్టి బలవత్కారణములనుబట్టియే పిడుపర్తి సోమనాథుఁడు పాలకురికి సోమనాథుని యనంతరము ౩౦౦ సంవత్సరములకు వెలసిన యాతని శిష్యప్రశిష్య కోటిలోనివాఁ డవుటచేఁ దన వినికిలినిబట్టి యాతఁడు వ్రాసిన విషయములలోను, నాతఁడు చెప్పికొన్న వంశానుక్రమణికలోను గొన్ని వ్యత్యయములు దొరలి యుండు నని తలఁచి, పాల్కురికి సోమనాథుఁడు రెండవ ప్రతాపరుద్రుని కాలమువాఁ డను తొలిటి యభిప్రాయమును బోవిడిచి యస్మదాదు లాతని కాలము క్రీ. శ. ౧౧౬౦–౧౨౪౦ గా నిర్ణయించుటకుఁ గారణమయినది. ఆంధ్రపత్రిక దుందుభిసంవత్సరాది సంచికయందు నేను మొదట సూచించిన యీ నిర్ణయమును శ్రీ ప్రభాకరశాస్త్రిగారుకూడ బసవపురాణపీఠికలో ననుగమించిరి. తరువాతఁ గాకతీయ సంచికలోఁ బ్రకటించిన "పాలకురికి సోమనాథకవి" యను వ్యాసమునఁ గూడ నీనిర్ణయమునే నే నవలంబించియుంటిని. చరిత్రచతురాననులు శ్రీ వీరభద్రరావు పంతులుగారుకూడ దీని నామోదించిరి. ఇట్టి పరిస్థితులలో శ్రీ సోమశేఖర శర్మగారు తమ వ్యాసమున నీయుపపత్తులను వేనిని బరామర్శింపక యాదాసీన్యము వహించుటకుఁ గారణము కానరాదు.

సోమనాథుని కర్ణాటదేశ నిష్క్రమణ విషయమున నాంధ్రదేశము త్వరలోఁ దురుష్కాక్రాంతము కానున్నదని దివ్యదృష్టిచే నెఱిఁగి తన యాచార నియమముల కచ్చట నవకాశ ముండదని శిష్యులతోఁ జెప్పి యాతఁడు కన్నడభూమి కరిగెనని పిడుపర్తి సోమనాథుఁడు పద్యబసవపురాణావతారికలోఁ జెప్పిన సంగతులు సరియైనవి కావు. క్రీ. శ. ౧౩౦౦ లోపున మహమ్మదీయు లాంధ్రరాజధానియగు నోరుగంటిపై దండయాత్రలు సాగించినట్లు కానరాదు. మఱియు సోమనాథునివంటి మహిమాన్వితుఁడు మహమ్మదీయుల దాడులకు వెఱచి జన్మభూమిని విడిచి పోయె ననుట సత్యసమ్మతము కాఁజాలదు. ఇంతకు దక్షిణాపథమునందలి కన్నడదేశముమాత్ర మానాఁడు మహమ్మదీయ దండయాత్రలకు గుఱిగాక భద్రముగ నుండెనా? పిడుపర్తి సోమనాథున కించుకపూర్వుఁడో, సమకాలీనుఁడో యగు తోంటద సిద్ధలింగకవి కన్నడమున సోమేశ్వరపురాణ మను పేరితోఁ బాల్కురికి సోమనాథుని చరిత్రమును రచించియున్నాఁడు. దానిలో నిట్టి గొడవ లేమియు నాతఁడు తడవలేదు. కర్ణాటదేశమునఁ గలుద్గిరి దక్షిణభాగమున విలసిల్లు తారకాచలమునఁ గల్లెయ మనుపురమం దగణిత శీలసంపన్నులగు శివభక్తు లనేకులు వసించుచుండి రనియు, వారిలోఁ జెన్నమ్మ యను మహాభక్తురాలు చతుష్షష్టి శీలనిర్వహణమునందు "నభూతో నభవిష్యతి" అను విఖ్యాతితో వెలయుచుండె ననియు, నీ వార్త విని సోమనాథుఁ డామెను సందర్శించు వేడ్కతోఁ దన పుత్త్రుఁడు చతుర్ముఖబసవేశ్వరుని, మిత్రుఁడు పాలకురికి సూరనామాత్యుని ... ఁడు చక్రపాణిరంగనాథుని వెంటఁగొని పాలకురికినుండి ప్రయాణమయి యాకళ్యక్షేత్రమునకుఁ జని యటఁ జెన్నమ్మ యొనర్చిన పూజల నంగీకరించి, యామెయాదరానురోధాది కారణములవలన తన చరమదశ నచ్చటఁగడపి, కుమారుఁడు చతుర్ముఖబసవేశ్వరునకు గురుపట్టము కట్టి, తానొక సమాధి నేర్పఱచికొని యందు శివైక్య మయ్యె నని తోంటదార్యుఁడు వివరించినాఁడు. ఈ కళ్యక్షేత్రము బెంగుళూరుజిల్లా మాగడితాలూకాలో బెంగుళూరునకు నలుబదిమైళ్లు దూరములో నున్నది. అచ్చట సోమనాథుని సమాధి యిప్పటికిఁగూడ భద్రపఱుపఁబడి యున్నది. కావున సోమనాథుఁడు తన యంతిమదశలోఁ గన్నడభూమి కేఁగి యచ్చట శివైక్యమయిన విషయమున మనము తోంటదార్యుని వ్రాఁతలకే విశేష ప్రామాణ్య మీయఁదగును.

ఇఁక శ్రీ సోమశేఖరశర్మగా రుదాహరించిన నీలగంగవరముశాసనము సోమనాథుఁడు రెండవ ప్రతాప

రుద్రుని కొలఁదుపాఁ డని నిర్బాధకముగ, నిస్సంశయముగ నిరూపించుటకుఁ జాలియున్నచో మనము పూర్వోక్తవిషయముల నెట్లయినఁ బూర్వపక్షముచేయుటకుఁ బ్రయత్నింపవచ్చును. కాని యీశాసన మందుకు సమర్థముగా లేదనియే నామనవి. ఈశాసనము గుంటూరుజిల్లా వినుకొండతాలూకానీలగంగవరము గ్రామములో నొక పొలములో నున్న శిలాఖండముపయి రెండు ప్రక్కలను జెక్కఁబడియున్నది. దానిలో మొత్తము ౬౬ పంక్తు లున్నవి. అందులోఁ గొన్ని భాగములు శిథిలములై శిలాఖండముకూడఁ బయిభాగమున రెండు చెక్కలయియున్నది. రెండవ ప్రతాపరుద్రునకు, నాతని మాతామహి రుద్రాంబకు సామంతుఁడుగా నుండిన అంబయదేవుఁడు శా. శ. ౧౨౧౨ (క్రీ. శ. ౧౨౯౦) సంవత్సరమునఁ ద్రిపురాంతకక్షేత్ర వాస్తవ్యుఁడగు రెంట్రదేవుల మల్లినాథయ్య యను మాహేశ్వరునకు మొల్లకల్లూరుగ్రామమును దానమొసఁగిన విషయము నిది వివరించును. దీనిని మొట్టమొదట ౧౯౪౦-వ సం.లో శ్రీ ఆర్. యస్. పంచముఖి,యం. ఏ.గారు ఎపిగ్రాఫియా ఇండికా (సం. ౨౦-భా. ౬) లోఁ బ్రకటించియున్నారు. దీనిలో మొదటి ౩౦ పంక్తులలోను అంబయదేవుని వంశము, పరాక్రమము మున్నగునవి వర్ణింపఁబడినతరువాత ౩౧-౩౫ పంక్తులలో దానప్రస్తావమును దెలుపు "శాకే భాన్వర్కసంఖ్యావిలసితవికృతే......"*అను శ్లోకము,నటుతర్వాత ౩౬-౫౧ పంక్తులలో శాసనములందుఁ దఱచుగఁ గానవచ్చు ఫలశ్రుతిశ్లోకములును, దదనంతరము శాసనరచయితనామోల్లేఖనము గల శ్లోకము చెక్కఁబడి యంతటితో శాసనమందలి సంస్కృతశ్లోకభాగము సమాప్తము గావింపఁబడినది. అటుతరువాత ౫౨-౬౦ పంక్తులలో దానప్రస్తావనము మరలఁ దెలుఁగువచనములో లిఖింపఁబడినది. ఆపిమ్మట సందర్భరహితముగ ౬౧-౬౬ పంక్తులలో మరల నొక సంస్కృతశ్లోక మీక్రిందివిధముగఁ జెక్కఁబడినది :

"(దే)వీ యస్య(స్వకీయం) త్రిపురవిజయి(నే)
చక్షు(రు)త్పాట్యపూజా(ం)
(కృ)త్వా రేజే తతోపి(ధ)తరమమలం
దోచయా(ఖ్యా)ప్రసి(ద్ధా),
పూర్వద్వారే కుమారక్షితిభృదుపరిత
స్తత్పురారేః పురస్తాత్
రమ్యం సోపానమార్గం(సుఖకర)మమలం
ద్యుః ప్రతిజ్ఞాం విధాయ."

ఇది యర్థము కొంతవఱకయిన సరిపడుటకయి శ్రీ పంచముఖిగారును, దదుపరి శ్రీ సోమశేఖరశర్మగారును ఈశ్లోకమున కొసఁగిన పరిష్కృతపాఠము. కుండలీకరణములందలి యక్షరములు వారి పూరణములను, బరిష్కరణములను సూచించును. శాసనమంతయుఁ బూర్తియైన తరువాత నీశ్లోక మసంగతముగ నీ శిలపయి నెప్పు డెవరిచేఁ జెక్కఁబడినదో నిదమిత్థముగ నిర్ణయింపరాదు. ఇందుఁగూర్చి శ్రీ పంచముఖిగారుకూడ నిట్లు వ్రాసియున్నారు:

**" Lines 61–66 also contain a verse in corrupt Sanskrit the sense of which is not quite clear ''**

బసవపురాణావతారికలో సోమనాథుఁడు తన కాగ్రంథరచనమునకయి శ్రీశైలక్షేత్రమున నొడ్డోలగమున నుద్బోధనము గలిగించిన భక్తవరులఁ గొందఱఁ బేర్కొనుటలో నేను బయిని నుదాహరించిన పండితారాధ్యకృపాసముద్గతుఁడు కరస్థలి సోమనాథయ్యతోపాటు, కుమారాద్రికిఁ దూర్పుదెసను సోపానములు కట్టించిన రెంటాల మల్లినాథుని, శివునకు నిత్యము నయిదు కరవీరపుష్పముల నర్పించు వ్రతము గలిగి

*" శాకే భాన్వర్క సంఖ్యావిలసితవికృతే
వత్స(రే) భాద్రమాసే
దర్శే సౌమస్యవారేసుకృతిని సమయే
ద్వాదశార్ధోపరాగే
ప్రాదాదంబక్షితీంద్రః ప్రథితశివపురం
మొల్లకల్లూరినామ
గ్రామంమాహేశ్వరాయ ప్రకటితమ.

యొకనాఁడం దొకటి తక్కువకాఁగా నిజనేత్ర మర్పించి శివానుగ్రహమున నసదృశాంబకము వడసి కీర్తిగొన్న దోచమాంబను వర్ణించియున్నాఁడు.

"ఆదివేదాంత సిద్ధాంతపురాణ
వేదశాస్త్రాగమ విహితమార్గములఁ
దనుమనోధనని వేదన సమగ్రతను
బనుగొని జంగమార్చనలుసేయుచును
శీలంబుదనరు సీమోల్లంఘన ప్ర
తాలంకృతిని బేర్చి యాచారలీల
నసలారఁగాఁగుమారాద్రికిఁదూర్పు
దెసను సోపానముల్ చ్చి పొల్పార
మహితసద్భక్తి సమంచితవృత్తి
మహిఁజనురెంటాల మల్లినాథుఁడును
నిరతిశయప్రీతి నిత్యంబునైదు
కరవీరపుష్పముల్ హరునకర్పింప
నొక్కనాఁడొకఁడందుఁ దక్కువయైనఁ
గక్కనఁ దననేత్ర కమలమర్పించి
భవునిచే నసదృశాంబకముప్పడసి
ధ్రువకీర్తిఁ బేర్కొన్న దోచమాంబయును"

పూర్వోక్తమయిన నీలగంగవరముశాసనమున మొల్లకల్లూరునామకగ్రామమును శివపురముగా దానమందిన రెంద్రేవుల మల్లినాథుఁడే సోమనాథుఁడు పేర్కొనిన రెంటాల మల్లినాథుఁడనియుఁ, గడపటి శ్లోకములో నుదాహరింపఁబడిన దోచయాఖ్యాదేవియే సోమనాథుఁ డుగ్గడించిన దోచమాంబ యనియు శ్రీ సోమశేఖరశర్మగారి యభిప్రాయము. "రెంద్రేవుల" యను రూపమే క్రమముగ రెంద్రేల, రెండేల, రెండాల, రెంటాల అను పరిణామములఁ జెందియుండునని వారి తలంపు. ఈసమర్థనము కేవల మసంగతమని చెప్పనక్కఱలేదు. రెంటాల యనునది గ్రామనామము. ఆ గ్రామ మాపేరితో గుంటూరుజిల్లా పల్నాడు తాలూకాలో నిప్పటికిఁగూడ నున్నది. ఇంతకు ఛందోబద్ధమయిన సోమనాథుని బసవపురాణములోనే మల్లినాథుని యింటిపేరు స్పష్టముగ "రెంటాల" అని చెప్పఁబడియుండఁగా నిట్టి వాదమున కవకాశమే లేదు. తోంటదార్యుని సోమేశ్వర పురాణములోఁగూడ రెంటాలమల్లినాథుఁ డాపేరితోడనే యుదాహృతుఁడయినాఁడు. కావున శాసనమందలి దానప్రతి రెంద్రేవుల మల్లినాథుఁడు, సోమనాథుని మిత్రుఁడు రెంటాల మల్లినాథుఁడు నేకవ్యక్తియే యనుట సంగతము గాదు. ఇంతకు మల్లినాథునిఁగూర్చి సోమనాథుఁ డుగ్గడించిన ప్రశస్తి కుమారాచలద్వార సోపాన నిర్మాణము మున్నగునవి రెంద్రేవుల మల్లినాథుని విషయమున శాసనమున నేమియుఁ జెప్పఁబడియుండలేదు. మొదటఁ జెప్పిన సంస్కృతశ్లోకములో నాతనిపేరైనను గానరాదు. ఇది స్రగ్ధరావృత్తము. నాల్గవ పాదములోఁ జివరను శిథిలములయినవి తొమ్మిది యక్షరములు మాత్రమే. "గ్రామం మాహేశ్వరాయ ప్రకటితమ (హనే మల్లినాథాహ్వయాయ)" అని యాపాదమునకుఁ గవిపాఠ మయియుండును. ఇందుఁ బ్రతిగృహీత గృహనామమును బేర్కొనుటకుఁగూడ నవకాశము కవికి లేకపోయినది. అందుచేతనే కాఁబోలు మరల దానప్రసావనము తెలుఁగున ప్రతిగృహీత యింటిపేరితోఁగూడఁ జివరను గూర్పఁబడినది. ఇందుఁగూడ నాతఁడు త్రిపురాంతక వాడని చెప్పటమాత్రమే గాని యాతని ప్రశస్తి యేమియు వివరింపఁబడలేదు. శర్మగారు సోమనాథుఁడు మల్లినాథునిఁగూర్చి చెప్పిన సోపాననిర్మాణము శాసనమునఁగూడ నాతనియెడఁ బేర్కొనఁబడిన దని తమ వ్యాసములో వ్రాసియున్నారు. కాని యిది పొరబాటని నా యాశయము. శాసనస్థ శ్లోకమును, తెలుఁగువచనమును వారు మరలఁ జిత్తగింతురుగాక! కడపట దోచయదేవిని గుఱించిన శ్లోకములోనే యామెనయనార్పణ పునరాదానమహిమతోపాటు కుమారాద్రిపయిని త్రిపురాంతకదేవుని యెదుట నామె నిర్మింపఁజేసిన సోపానప్రశంసగూడఁ బేర్కొనఁబడినది. దీనికిని, మల్లినాథుని విషయమున సోమనాథుఁడు చెప్పిన కుమారాచలప్రాగ్దిశాసోపాన నిర్మాణమునకును నెట్టి సంబంధము లేదు. దోచయాఖ్యాదేవి నేత్రకమలసమర్పణవిషయమునఁగూడ శాసన

శ్లోకమందలి సంగతులకు, బసవపురాణమునఁ జెప్పిన సంగతులకు సంపూర్ణైక్యము గానరాదు. దోచమాంబ [illegible]రాం [illegible]త్రవాసి యనికాని, యామె కన్ను నర్పించి మరలఁ బడసినది త్రిపురాంతకదేవునివలన నని కాని సోమనాథుఁడు చెప్పలేదు. శివునకు నిత్యమయిదు కరవీరముల నర్పించు వ్రతము గల యామెకు వ్రతపరీక్షణమున జరిగిన విషయమే యాతఁడు పేర్కొనినాఁడు. నిత్యకరవీరపుష్పపంచకార్చన ప్రశంస శ్లోకమున లేనేలేదు. కావున సోమనాథుఁడు పేర్కొనిన దోచమాంబయు, శాసనమునఁ బేర్కొనఁబడిన దోచయదేవియు నేకవ్యక్తియే యని చెప్పుటకుఁ గూడ నవకాశములు లేవు. ఇంతకు నీదోచయ యెవరో శర్మగారు నిరూపింపఁ బ్రయత్నించలేదు. "దేవీ కృతాభిషేకాయా"మ్మను నైఘంటికప్రమాణమునుబట్టి దేవీశబ్దము సాధారణముగా రాజభార్యల విషయము ననే ప్రయుక్తమగును. ఈమె దాతయగు అంబయ దేవుని భార్యయే యైనచో నంతటి మహిమాన్వితురాలి ప్రశంస శాసనమున నంత యుదాసీనముగ, నసంగతముగ, ననన్వయముగ శాసనాంతమున నుదాహరింపఁ బడనేల? అంబయదేవుని వర్ణనసందర్భమున నే యామె విషయముగూడ వర్ణింపఁబడుట సాజముగదా! అట్లు జరగకుండుటకుఁ గారణమేమి? "దేవీ యస్య"అని యచ్ఛబ్దముప్రయుక్తమయినప్పు డందుకు సంబంధించిన తచ్ఛబ్దవాచ్యుఁ డెవఁడో స్పష్టముగఁ జెప్పఁబడ వలెనుగదా! "శాకే ఖాన్వర్క సంఖ్యా..."అను శ్లోకమునకుముందే యీ శ్లోకము చేరవలసి పొరపాటున శాసనముచివరఁ జెక్కఁబడిన దని తలఁచినను నప్పుడు గూడ రెండు శ్లోకములకు సమన్వయ మంతగాఁ గుదురకున్నది. అంబయదేవుని శాసనములలో నిది యొక్కటియేగాక యింకను ననేకములు లభ్యములయి యున్నవి. వానిలో నీలగంగవరము శాసనము వేసిన శా. శ. ౧౨౧౨ సం. నందే యాతఁడు వెలయించిన త్రిపురాంతక శాసనము ముఖ్యము, విపులము నయి యున్నది. అందులో నాతని విజయవివరములు, పుత్రికావివాహసమయమున నల్లున కొసఁగిన యరణము మున్నగు సంగతు లనేకములు విపులముగ వర్ణింపఁబడినవని శ్రీ పంచముఖిగారు వ్రాసియున్నారు. అట్టియెడ విశేషమహిమాన్వితయగు దోచయాంబ యాతని భార్యయే యైనచో నామెప్రశంస యా త్రిపురాంతక శాసనమునఁ జేయకుండుటకుఁ గారణము కానరాదు. ఉపలబ్ధములయిన యంబయదేవుని శాసనములలో నెచ్చటను నాతని భార్యపేరు దోచయ యని చెప్పఁబడినట్లు లేదు. చెప్పియేయున్నచో శ్రీ పంచముఖిగారు "దేవీ యస్య" యను శ్లోకమున కర్థము సంగతముగా లేదని వ్రాసియేయుండరు. ఈ శ్లోకమున దోచయ త్రిపురాంతక దేవునకు నేత్ర మర్పించి మరలఁ బడసెనని చెప్పుటచే నామె యా స్వామిని సేవించు త్రిపురాంతకక్షేత్రవాసిని యని యూహింపఁదగును. అంబయదేవునకుఁ ద్రిపురాంతకము రాజధాని గాదు. అతఁడు కడపజిల్లా వల్లూరు, గండికోటపట్టణములు రాజధానులుగాఁ బరిపాలించినట్లు కానవగును.

మఱియు నీ శ్లోకమునఁ గ్రియాపదములు సరిగా లేవు. రెండవ పాదమునఁ జెప్పఁబడిన "రేజే" (ప్రకాశించెను) అనునది భూతకాలిక క్రియ. "భూతానద్యతనపరోక్షేలిట్" అను సూత్రముచొప్పున గడచినట్టియు, నేఁటిది కానట్టియు, వక్తస్వయముగా నెఱుఁగనట్టియు వృత్తాంతవిషయముననే లిట్రూప ముపయోగింతురు. "రేజే" అనుటకన్న "భేజే" యనిగాని, "తేభే" యనిగాని యున్నచో నర్థము బాగుగాఁ గుదురును. వీనిలో నేది కవిపాఠమయియున్నను నిందుఁ బ్రయుక్తమయినది భూతకాలికరూపమే యనుట స్పష్టము. సోపాననిర్మాణ విషయమున నాల్గవ పాదమునఁ గ్రియాపదము లోపించినది. " ద్యుః ప్రతిజ్ఞాం విధాయ"అనుచో నర్థము కుదురుటలేదు. ఇచ్చట "ద్యుః" అనునది "ద్యోః" అనుటకు మాఱుగా నేర్పడిన లేఖకదోషమేమో యని తోఁచుచున్నది. అట్లయినచో ద్యోః=స్వర్గమునకు, ప్రతిజ్ఞాం విధాయ = ప్రతినచేసి, అనఁగా స్వర్గమధిరోహించుటకయి కట్టిన మెట్టులో యనఁ ద్రిపురాంతకేశ్వరునెదుటఁ గుమారాద్రిపయి సోపానములు నిర్మించెనని యర్థ మేర్పడును. ఎట్లు

చూచినను శ్లోకమునఁ బేర్కొనఁబడిన దోచయామాత్యాదేవి భూతకాలిక వ్యక్తియేగాని శాసనరచనా కాలమునకు జీవించియున్న వ్యక్తిగాఁ గానరాదు.

ఆమె యంబయదేవుని వంశమునకుఁగాక దానప్రతిగృహీతయగు రెంద్రేవుల మల్లినాథయ్యగారి వంశమునకుఁ జెందినదని తలఁచినను, "రెంద్రేవుల" యనునది శాసనమును జెక్కుటలోనే "రెంటాల" యనుటకు మాఱుగాఁ దప్పుగాఁ జెక్కిన రూపమని యెంచినను నీశాసనమందలి మల్లినాథుఁడు సోమనాథుని బసవపురాణమునఁ బేర్కొనఁబడిన మల్లినాథుఁడుగాక యాతని వంశమునకుఁ జెందిన యాపేరు గల యాతని మనుమఁడో, మఱొకఁడో యైయుండుననియు, దోచయాంబ యాతని పితామహియో, మఱియొకతెయో యైయుండుననియుఁ దలంపనగునేమో!

తోంటదార్యుఁడు సోమేశ్వర పురాణమున సోమనాథుని మిత్రుఁడు పాలకురికి సూరనామాత్యుని దృగర్పిత పునరాదాన మహిమను వర్ణించు సందర్భములోనే తాదృశవీరభక్తి నెఱపిన భక్తుల మఱికొందఱను బేర్కొనుచు సోమనాథుఁడు బసవపురాణమున దోచమాంబనుగూర్చి చెప్పిన విషయములను దార్మాఱు చేసి వానిని రెంటాలమల్లినాథుని పరముగా నిట్లు చెప్పియున్నాఁడు:

"సల్లలిత కరవీరపుష్ప నైదంపూజి
పల్లియొందల రల్లదిరెనోడి రెంటాల
మల్లినాథం తన్న నేత్రమం కిత్తర్చిసిదను నిజనిష్ఠయిందె"

ఇట్లు సోమనాథుని బసవపురాణమును జూచి యందలి విషయములు లెస్సగా గుర్తింపక తార్మాఱు చేసి రెంటాల మల్లినాథునియెడఁ జెప్పఁబడిన సోపాననిర్మాణము కొన్ని వ్యత్యాసములతో నీలగంగవరము శాసనమున దోచయాంబనుగూర్చిన శ్లోకములో నామె పరముగాఁ జెప్పఁబడెనేమో యనికూడ నూహింప నవకాశము కలుగుచున్నది.

బసవపురాణావతారికలో సోమనాథుఁడు రెంటాల మల్లినాథునకు, నాతని వెనువెంటనే పేర్కొనిన దోచమాంబకుఁ గల సంబంధ మేదియుఁ జెప్పలేదు. దోచమాంబ రాజభార్య యనియైన నాతఁడు చెప్పలేదు. వాస్తవముగ నట్టి దేమయిన నున్నచో నాతఁ డుదాహరింపకుండునా? కావున నెట్లు చూచినను సోమనాథుఁడు మొదటి ప్రతాపరుద్రుని కాలమునఁగాక రెండవ ప్రతాప రుద్రుని కాలముననే యుండెనని నిర్ణయించుటకుఁగాని, యందుకనుగుణముగా బసవపురాణము రెండవ ప్రతాపరుద్రుని రాజ్యారంభమున క్రీ. శ. ౧౨౯౦ ప్రాంతమునను, పండితారాధ్యచరిత్ర క్రీ. శ. ౧౩౨౦ ప్రాంతమునను రచింపఁబడెనని శ్రీ సోమశేఖరశర్మగారు తలంచినట్లు నిర్ణయించుటకుఁగాని నీలగంగవరశాసనమందలి విషయములు తగిన ప్రమాణములు కాఁజాలవని మనవిచేయుచున్నాను. కావున శ్రీశర్మగారును, దదితరపరిశోధకులును బయివిషయముల నెల్ల బాగుగఁ బర్యాలోచించి యింకను సమ్యక్పరిశోధనముగావించి సోమనాథుని కాలమును నిర్బాధకముగ నిదమిత్థమని నిర్ణయింపఁ బ్రార్థించుచున్నాను.




మందుమాత్ర మ్రింగుట

రిడ్జివెల్ గారి చిత్తరువున కనువాదము.

# చందమామ

## శ్రీ జనమంచి రామదాసు

హృదయాంతరాళమ్ము పొంగిపొరలే వేళ
తీయతీయని గీతి విస్తరిల్లే వేళ
కోకిలమ్మల స్వనము ప్రజ్వరిల్లే వేళ
నీమోము చూపవా చందురూడా,
సితకాంతి నివ్వవా చందురూడా.

అద్దాల మిద్దెలో నందగాడవటోయి
నీ చూపు నీ గుండె నవనీతమంటోయి
ఆననం బంతయు అమృతంబంటోయి
దారిచూపగదోయి చందమామా,
దరిచేర్ప రావోయి చందమామా.

నీ సొగసు నీకాంతి నిత్యమ్మంటారు
మానసం బంతను మందాకి నంటారు
అందచందమ్ములకు నాటపట్టంటారు
ఆశదీర్పగరావ చందురూడా,
అమృతమ్ము ఒలికించు చందురూడ

మనసులోనీ మచ్చ మాయమౌతుందంట
పద్మినీవనితకూ పరమమిత్రుడవంట
కాలచక్రము కీవు కౌగిలింతావంట
రాసిక్యతనుచూసి చందమామా,
రమ్మురమ్మంటారు చందమామా.

# బాపట్లలో కొత్తగా ప్రారంభింపబడిన వ్యవసాయ కళాశాల భవనములు





# చిన్నమదేవి విజయము

[ఏకాంక]

= శ్రీ వేదము వేంకటరాయశాస్త్రి =

స్థలము ౧. విజయనగరము. రాచనగరు చెంత నొక వీథి

(నేపథ్యమున పంచమహావాద్యములు. కొందరు జనులు వడివడిగా నడచుచు ప్రవేశించుచుందురు.)

ఒక బ్రాహ్మణుడు—(వెనుకకు తిరిగిచూచి) త్వరగా రావయ్యా, మాధవయ్యా. సభ మొదలుపెట్టిన ట్లున్నారు. మనకు ఆలస్యమైనది.

(నేపథ్యమునుండి "జయీభవ; దిగ్విజయీభవ; ప్రబలరాజాధిరాజ, రాజప్రతాప, రాజపరమేశ్వర, అరిరాయభయంకర, మూరురాయరగండ, దుష్టశార్దూలమర్దన, వీరనారాయణ, జగదేకవిభాళ, జయ; కుమారవిక్రమ జయ; శ్రీకృష్ణదేవ మహారాయ జయ; దిగ్విజయీభవ" అని బిరుదములు వినబడును. మంగళ వాద్యములు మ్రోగును.)

మాధవయ్య—(ప్రవేశించి) ఉండవయ్యా రవంత. అబ్బా! నడవలేను. ఈశ్వరయ్యా, కొంచెం నెమ్మదిగా పోదాం.

ఈశ్వరయ్య—అయినట్టే. మనం పోయేటప్పటికి అంతా అయిపోతుంది. తెనాలిరామలింగయ్య నగరికి పోయి చాలాసే పయింది.

మాధ—అది సరేగాని, ఏమిటయ్యా ఈవేళ విశేషాలు, జరగబొయ్యేవి?

ఈశ్వ—ఓహో! ఏమనుకుంటున్నావు? ఈ దినం తెనాలిరామలింగయ్య గ్రామాంతరంనుండి రాజధానికి వచ్చాడు. ఆస్థానానికి వస్తాడు. ధూర్జటి గారినిగుఱించిన ఆసమస్య పూర్తిచేస్తాడు. ఆ బయటి దేశాల పండితులతో వాదం చేసి తరిమివేస్తాడు. పెద్దయ్యగారికి గండపెండేర బహూకరణం. ఇంకా చాలా విశేషాలు. భలే తమాషాగా ఉంటుంది. రా, రా. పోదాం.

మాధ—బలే! బలే! ఈదినం ఏమి స్వారస్యమైనా ఉంటుంది. సరేగాని, ఆ సమస్య ఏదో మరిచి పోయినాను, కొంచెం చెప్పవయ్యా.

ఈశ్వ—చాదస్తుడా, ఎంతలో మరిచిపోతావయ్యా! కృష్ణదేవరాయలవారి సమస్యలు ఈదేశంలో ఆబాలగోపాలం ఎరగనివాళ్లు లేరు. నువ్వేమో మరిచి పోయినానని అంటావు. చెప్తా విను.

"స్తుతమతియైన యాంధ్రకవి
ధూర్జటిపల్కులకేట్లు కల్గె నీ
యతులితమాధురీమహిమ........"

(నేపథ్యమునుండి)

"హా! తెలిసెన్ భువనైకమోహనో
ద్ధతసుకుమారవారవని
తాజనతాఘనతాపహారిసం
తతమధురాధరోదితసు
ధారసధారఁగ్రోలుటంజుమీ."

ఈశ్వ—అదుగోనయ్యా తెనాలిరామలింగయ్య, సమస్య పూర్తిచేస్తున్నాడు. (నేపథ్యమున కరతాళ ధ్వనులు) సభ మొదలుపెట్టారోయి, పదపద.

(నిష్క్రమింతురు.)

స్థలము ౨. రాయలవారి సభ.

(రాయలు, అష్టదిగ్గజములు, మంత్రులు, పరివారము ప్రవేశింతురు.)

వంది—జయీభవ. (ఇత్యాది పఠించును.)

రాయ — పండితులారా, కవీశ్వరులారా, విద్యావంతులారా, ఎవరైనను ఈసమస్యను పూరింపుడు.

"స్తుతమతియైన యాంధ్రకవి
ధూర్జటిపల్కులకేల కల్గె నీ
యతులితమాధురీమహిమ."

తెనాలిరామ — (నేపథ్యమునుండియే) హా! తెలిసెన్.

రాయ—ఓహో! తెనాలిరామలింగయ్యగారు వచ్చినారు.

రామలిం—(ప్రవేశించును.)

రాయ— రామలింగయ్యగారూ, ఏమి తెలిసినది?

రామలిం—"......హా! తెలిసెన్ భువనైక
మోహనో
ద్ధతసుకుమారవారవనితాజనతాఘనతాపహారిసం
తతమధురాధరోదితసు
ధారసధారలగ్రోలుటంజుమీ."

రాయ—(ఆశ్చర్యముతో సభయంతయుజూచి) ధూర్జటిగారూ, ఒప్పుకొందురా?

వంది — మహాప్రభూ, ధూర్జటిగారు నేడు రాలేదు.

రాయ— వేశ్యయేగదా, దోషమేమి?

అప్పాజి—మహాప్రభూ, నేడు రామలింగయ్యగారు వచ్చినందున ఆ వైదేశికపండితులకు వాదార్థము సెలవొసంగవలెను.

రాయ—అప్పాజీ, చాల సంతోషము. కానిండు. విద్యావినోదములు ప్రారంభింపుడు.

అప్పాజి—తిమ్మయ్యా, ఆ పండితులను రమ్మను.

(ఇరువురు పండితులు అట్టహాసముగా ప్రవేశింతురు.)

ఇరువురును—జయము జయము, శ్రీకృష్ణదేవరాయమహారాయా, నీకు జయము. నీవు సత్యమున హరిశ్చంద్రుడవు, దానమున కర్ణుడవు, ఐశ్వర్యమున దేవేంద్రుడవు, రూపమున మన్మథుడవు, ఆంధ్రవాఙ్మయమునకు అపరభోజుడవు, పండితుడవు, కవివి, నిరంతరవిద్యావినోదివి. మేము పండితులము, కవీశ్వరులము. నీ ఆస్థానమందలి కవులను జయించుటకు వచ్చినాము. ఆశుకవిత్వధోరణిలో మమ్ము జయించినవారు లేరు. గడియకు వేయిపద్యములు నిరాఘాటముగా చెప్పగలము. ఎటువంటి క్లిష్టసమస్యయైనను పూర్తిచేయగలము. అవధారణచక్రవర్తి, ధారణసార్వభౌమ, వాదిఘటాపంచానన, వాదిమత్తేభసింహ, కవితార్కికకేసరి మొదలైన బిరుదులు మాకు వందలువందలు. మా ప్రజ్ఞాపత్రములు వేనకువేలు. మా గండపెండేరములు మోయుటకు మత్తేభములు చాలవు. పోయినచోట నంతయు ఏనుగులనెక్కినాము. నానారాజసందర్శనములు చేసినాము. రాయలవారి ఆస్థానముమాత్రమే మాకు మిగిలియున్నందున వచ్చినాము. మీ పండితులను జయించి మా దేశమునకు గోదావరీతీరమునకు పోదలంచినాము. మహాకవీశ్వరులారా, పండితప్రకాండులారా, విద్యావంతులారా, మీతో వాదమనగా మాకు తృణప్రాయము. ఊదివేయగలము మిమ్మందరను. ఈ చిన్న సమస్యను పూర్తిచేసి మీ పరువు నిలుపుకొనుడు చూతము.

"కుంజరయూథంబు దోమకుత్తుక జొచ్చెన్."

రామలిం—(ఒకమారు లేచి మరల కూర్చుండును.)

వాదిపండి—ఏమీ, ఎవరూ చెప్పలేరా? ఇంతేనా మీ శక్తి?

అలసానిపెద్దన—అబ్బాయీ, రామలింగయ్యా, కానీ.

రామలిం—ఓహో! సభాస్తారులారా! వినుడు. ఓయి వాదీ!

గంజాయి త్రాగి తురకల
సంజాతుల గూడి కల్లు చవిగొన్నావా?
లంజలకొడుకా? యెక్కడి
కుంజరయూథంబు దోమకుత్తుక జొచ్చెన్?

వాదిపండి—(కోపముతో) మహాప్రభూ, ఇది దౌర్జన్యముగాని వాదము గాదు. దూషించుటగాని పూరించుట గాదు. న్యాయము గాదు.

రాయలు—రామలింగకవీశ్వరా, ఈ సమస్యను ఒకవేళ మేమే యిచ్చియుండినయెడల నేమి చేయుదురు?

రామలిం—మహాప్రభూ! ఏలినవారి యాశ్రితులముగదా. వినుడు మరి—

రంజన చెడి పాండవు లరి
భంజనులై విరటు గొల్వ బాల్పడి రకటా
సంజయ విధి నేమందును
కుంజరయూథంబు దోమకుత్తుక జొచ్చెన్.

సభ్యులు—బళిబళి.

వాదిపండి—ఎవరయ్యా నీవు, అధికప్రసంగిగా నున్నావు!

రామలిం—మహాహంకారగర్వితదుష్టవాది మదమత్తేభకంఠీరవ, నిరర్థకబిరుదాడంబరకవీంద్రమేఘమహావాతూల, శుష్కవాదిశునకవిద్రావణమహాలగుడ, వికటకవి, గండరగండ, గండభేరుండ, గోదావరీప్రాంతకవీంద్రతలగుండుగొండ, ఆశుకవిత్వ లాడలాడాయమాన కవివృషభముక్కుత్రాడు ఇత్యాదిబిరుదుల్గొట్టి, శతఘంట, సహస్రఘంట, లక్షఘంట, కోటిఘంట, అర్బుదన్యర్బుదఘంటాదికవీంద్రుల గర్వమును భంజించి, వారి బిరుదులు, గండపెండేరములు, శాలువలు, దుప్పట్లుసహా పుచ్చుకొని రాయలవారి ఆస్థానమును ఆశ్రయించియున్న కవిమశకము తెనాలి రామలింగయ్య. ఈ కవిమశకమునకే భయపడుచున్నావు; కవిశార్దూలములు నీమీద లంఘించిన నేమైపోగలవు?

వాదిపండి—'శిశుస్త్వం మా ప్రలాప.' మహాప్రభూ! ఈపద్యమునకు చెప్పిన యర్థమును చెప్పక అన్నిపాదములు చక్కగా సమన్వయింపవలయును.

సీ. రాజనందనరాజరాజాత్మజులు సాటి
తలప నన్నయవేమధరణిపతికి.
(అదే మిగిలిన పాదములును)

గీ. భావభవభోగసత్కళాభావములను
(అదే మిగిలిన పాదములును)
రాయ—(సభవైపు చూచును.)

రామలిం—'పశుస్త్వం మా విలాప.' మహారాజా, ఇతడు పరమదురాత్మర్గుడు. ఏలినవారి యాస్థానమునకు వచ్చి వేమభూపతిని పొగడుచున్నాడు. మా యేలినవారు సర్వదక్షిణాపథచక్రవర్తి కానున్నారు. దండుబయలుదేరెనా కృష్ణకాదు, గోదావరి, మహానదివరకు రాగలరు. అప్పుడు మీప్రభువులందరు మా యరిగాపు లగుదురు. నీసమస్యను నేను పూర్తిచేసినాను. ఈమారు ప్రశ్న నావంతు. నాపద్యానికి చెప్పవయ్యా వాదిఘటాపంచానవా.

సీ. మేకతోకకుమేకతోకమేకకుతోక
మేకతోకామేకతోకమేక
(ఇట్లే తక్కిన మూడు చరణములును)

గీ. మేకతోకతోకమేకమేకతోకతోక.
(ఇట్లే తక్కిన మూడు)

వాదిపండి—(ఆలోచించుట నభినయించి) దీనికి అర్థము లేదన్నచో నవమానమగును. చెప్పుట కష్టముగా నున్నది. కానీ, (ప్రకాశము) మహాప్రభూ, ఇది వట్టి అసందర్భప్రలాపము. ఇటువంటి పద్యములకు కూడ మేము అర్థముకల్పించగలము. రేపు ఏలినవారి సన్నిధిలో మనవిచేయగలము.

(సభ్యులు కొందరు నవ్వుదురు; కొందరు దగ్గుదురు)

రామలిం—తదికిణతోం. అయినదా మీపని! ఎక్కెక్కించినారయ్యా మిమ్ము ఏనుగులమీదను, లొట్టిపిట్టలమీదను!

ఒక సభ్యుడు— నిచ్చెనలు వేసి ఎక్కించి ఉంటారు.

రామలిం—ఈ పద్యమునకు అర్థము చెప్పుడు.

నరసింహకృష్ణరాయని
కరమరుదగు కీర్తి యొప్పె గరిభిద్గిరిభిత్
కరికరిభిత్ గిరిగిరిభిత్
కరిభిత్ గిరిభిత్ తురంగకమనీయంబై.

వాదిపండి—ఈపద్య మేగ్రంథములోనిది కవిగారూ?

రామలిం— తిలకాష్టమహిషబంధనములోనిది. నేనే వ్రాసితిని.

వాదిపండి— (ఆత్మగతము) ఈమహానుభావుడసాధ్యుడుగా నున్నాడే. ఉపాయముగా నిచ్చటి నుండి తప్పించుకొనిపోవలయును. (ప్రకాశము) అబ్బబ్బ! అబ్బ! కడుపునొప్పిగా నున్నది. మహాప్రభూ, మాకు నేడు సెలవిప్పించవలయును. రేపు మేము వచ్చి, శతావధానము సహస్రావధానముకూడ చేయగలము. నేటికి సెలవు. (అని వడిగా నిష్క్రమించి.)

రామలిం— శతసహస్రావధానముకూడ చేయగలరు! మహాప్రభూ, ఈ ఆశుకవులు మరల రారు.

రాయలు—

ఉదయం బస్తనగంబు సేతువు హిమ
వ్యూహంబునన్ జుట్టిరా
విదితంబైన మహిన్ మహాంధ్రకవితా
విద్యాబలప్రౌఢి నీ
కెదురేరీ సరసార్థబోధఘటనా
హేలాపరిష్కారశా
రద నీరూపము రామలింగకవిచం
ద్రా సాంద్రకీ ర్తిశ్రీరా.

రామలిం—ఏలినవారి అనుగ్రహమే అంతయు.

అప్పాజి — మహాప్రభూ, కవిపండితులలో నందరకును పెద్దయైన పెద్దనగారికి నేడు గండపెండేరము బహూకరించవలెను.

రాయలు—అవును. చాల సంతోషము. (నౌకరులు వరహాలపళ్లెమును తెచ్చి సభామధ్యమున నుంతురు. వానితో గండపెండేరముకూడ.) పెద్దనార్య! అందుకొనుడు.

అలసాని పెద్దన—మహారాజాధిరాజ!

శరసంధానబలక్షమాదివివిధై
శ్వర్యంబులం గల్గి దు
ర్భరషండత్వబిలప్రవేశచలన
బ్రహ్మఘ్నతల్మానినన్
నరసింహక్షితిమండలేశ్వరుల నె
న్నన్వచ్చు నీసాటిగా
నరసింహక్షితిమండలేశ్వరుని కృ
ష్ణా రాజకంఠీరవా.

లు—ఆహాహా! బళిబళి! బాగుబాగు!

రామలిం—(హహహా యని నవ్వి) మహాప్రభూ! ఈ పద్యము పనికిరాదు. తాతగారూ, ఏమి ఇట్లు చెప్పుచున్నారు? బిలము ప్రవేశించిన రాజకంఠీరవా యని తోకపట్టి వెలికీడ్తురా యేమి? ఇది దోషము కాదా? నేను చెప్పెదను చూడుడు.

కలనం దావకఖడ్గఖండితరిపు
క్ష్మాభర్త మార్తాండమం
డలభేదం బొనరించి యేగునెడ ద
న్మధ్యంబునన్ హారకుం
డలకేయూరకిరీటభూషితుని శ్రీ
నారాయణుం గాంచి లో
గలగంబారుచు నేగె నీవయనుశం
కం గృష్ణరాయాధిపా.

సభ్యులు—ఆహాహా, దివ్యముగా నున్నది.

పెద్దన—మహాప్రభూ, ఈ గండపెండేరమును, పారితోషికమును రామలింగయకే తగినవి.

రాయలు—రామలింగయగారూ, రండు.

రామలిం—ప్రభూ, పనికిరాదు. నేను పద్యము చెప్పుటకై చెప్పితినిగాని వేరుగాదు. తాతగారి పద్యము నిర్దోషము. బహుమతికి మాబోంట్లు కేవల మనర్హులుగదా. తాతగారూ, రండు. (అని స్వయముగా వారిని పిలుచుకొనివచ్చును. రాయలు గండపెండేర మును స్వయముగా కాలికి తొడుగును.)

(నేపథ్యమునుండి—"జయంజయం ఏలినవారికి. పదునెనిమిది తిరుపతులనుండిన్ని, డెబ్బైరెండు దేవ స్థలాలనుండిని, ఆయా ఆచార్యులు ప్రసాదములు తెచ్చియున్నారు. నానాదేశములు తిరిగి ఏలినవారి దర్శనాని వేసులు వచ్చియున్నారు. అహమ్మదానగ రమునుండి వేగుల రాయున్ను, గోలకొండనుండి వేగుల గోపాజిన్ని, వాయువేగి హనుమంతయ్య, మనోవేగి పురుషామృగయ్య మొదలైనవారు వచ్చియున్నారు. ఇంకా ఏలినవారి దర్శనానికి రాణా జగదేవు, గని తిమ్మప్పనాయడు, రాచూరి రామినాయుడు, సేనా పతి పెమ్మసాని రామలింగమనాయడు, హండే మల్లా రావు, బోయి రామప్ప పదునెనిమిది కప్పణాలవారు, దళనాయకులు, అప్పరపిళ్ల, కుప్పరపిళ్ల, సాళువ నాయడు, కొమారతిమ్మప్ప, సంగ్గరాజు, చెర్వప్రధాని తిప్పరసు, అయ్యప్పనాయుడు, కటికం విశ్వనాథ నాయడు, చెవ్వప్పనాయడు, అక్కప్పనాయడు, కృష్ణప్పనాయడు, వెలుగోటి యాచమనాయడు, కన్నడ బసవప్పనాయడు, సాళువ మేకరాజు, మట్ల అనంతరాజు మొదలైనవారున్ను, బొమ్మిరెడ్డి నాగారెడ్డి, బసువారెడ్డి మొదలైన రెడ్డికొమాళ్లున్ను, కమ్మనాయ కులు వితలప్పనాయడు అల్లుళ్లు కొమాళ్లు రాచరికం వారు అమరనాయకంవారు అందరున్ను ఏలినవారి దర్శనానికి కాచుకొనియున్నారు."

అప్పాజి—మహాప్రభో, కవితాగోష్ఠి యైనది. ఏలినవారు కార్యాలోచనమందిరమునకు పోవలయును.

(సభ లేచును. రాయలు, మంత్రియు నొకవైపును, మిగిలినవారు మరియొకవైపు నిష్క్రమింతురు.)

## స్థలము ౩. నగరిబయట

తెనాలిరామ—(ప్రవేశించి)బళి. అద్భుతముగా నున్నది. ఈ జడబిళ్ల అంతయు నొకటే వజ్రము. పది కోట్ల వరహాలు చేయగలదు. అరచేతియంత యున్నది. దీనిలో బంగారమును చేర్చి పెక్కుమణులవలె చూపి నాడు. మంచి పనితనము. మాబోంట్లకేల? దేవేరులకే తగును. మరి దీనిని ఏలినవారికే చూపెదను. (వెనుకకు చూచి) ఓయి, ఆ బుడతకీసువర్తకుని మా యింటికడ నుండుమను. (ముందుకు నడచి) ఎవరురా అచ్చట! ఏలినవారెచ్చు డెక్కడనున్నారు?

(నేపథ్యమునుండి—"తిరుమల దేవమ్మగారి నగ ళ్లినారండి.")

రామలిం. మంచిది. నేను తిరుమలదేవిగారి నగరికే పోయెదను. (నిష్క్రమించి)

## స్థలము ౪. తిరుమలదేవినగరు

(రాయలు, తిరుమలదేవి పాచికలాడుచు ప్రవే శింతురు. చేటికలు కొందఱు వారికి వీచోపులు వీచు చుందురు.)

రాయలు—నాదే గెలుపు.

తిరు—ఎట్లు ప్రభూ! తా మోడిపోయినారు.

రామలిం—(తటాలున ప్రవేశించి) ఇరువురును ఓడిపోయినవారే.

రాయ—రామలింగయ్యగారూ, రండు రండు.

(తిరుమలదేవి లేచి నిలుచును. ఒక చేటి రామ లింగయ్యకు ఆసనమిడును. విసరును.)

రాయ—ఎట్లు కవిగారూ? ఇరువురును ఎట్లు ఓడిపోగలము?

రామలిం—ఏల కాదు? ప్రభువుల విజయము లును, పరాజయములును వారి దేవేరులను చెందినవే గదా. కావున ఇరువురును ఓడినవారే.

తిరు—మరి తమ వాదముప్రకారము ఇరువుర మును గెలిచినట్లుకాదా?

రామలిం—ఆహా! కాకేమి. మీ కిరువురకును భేద మున్నదా. మండనమిశ్రుని శంకరాచార్యులవారు గెలిచినప్పుడు ఆయనభార్య తన్నుకూడా గెలిచిననే గాని గెలుపు పూర్తికాదని చెప్పలేదా? పరస్పరము మీ రొకరి నొకరు గెలిచిన నది గెలుపును గాదు, ఓడి పోవుటయు కాదు. కావున ఇరువురును గెలిచినట్లే, ఇరువురును ఓడినట్లే.

తిరు—కవులుగదా! నిరంకుశులు. మరి కవి గారూ, తాము నేడిచ్చటికి వచ్చుటచే మానగరు పావనమైనది. ఇటీవల వచ్చుటయే మానితిరిగదా.

రామలిం—అమ్మా, బొత్తిగా తీరిక లేకపోయి నది. నేను కొంతకాలముగా గ్రామాంతరము పోయి యుంటిని. పైగా వైదేశికులు కవులు వచ్చియుండిరి. లేనిచో మాకేమి, నిరంతరము ఏలినవారిని, దేవిగారిని వినోదింపజేయుటయేగదా మాపని. మరి నేడొక విశేషము. బుడతకీసువర్తకు డొకడు వచ్చియుండి నాడు. వానికడ నీయద్భుతమైన వజ్రపుజడబిళ్ల యుండినది. చూచితిని. అట్టి యపూర్వవస్తువును ధరించుటకు దేవిగారుతక్క నితరు లెవ్వరర్హులని తీసి కొనివచ్చితిని. ఇదిగో చూడుడు. (అనిచూపును)

(రాయలవా రందుకొని దేవి కిత్తురు.)

తిరు—చక్కగా నున్నది. ఇట్టి దొకటి వలయు నని తలంచుచుంటిని. తలవనితలంపుగా వచ్చినది. రామలింగయ్యగారికి మనయం దెప్పుడును అకారణ వాత్సల్యము.

రామలిం—మహారాణిగారు తా మట్లు సెల వీయగూడదు. ఏలినవారు సాక్షాత్తు ఆ విష్ణువునవతా రము. 'నావిష్ణుః పృథివీపతిః'. సర్వదక్షిణాపథచక్ర వర్తియొక్క పట్టమహిషియైన తాము సాక్షాత్తు ఆ మహాలక్ష్మియే. మీయిరువుర కటాక్షమే మాకు సక లైశ్వర్యములకు కారణము. తా మిట్లుపలుకవచ్చునా?

(తిరుమలదేవి ఆబిళ్లను ధరింపబోగా చేటికలు వచ్చి దానిని చక్కగా నమర్తురు. దూరమునుండి చిన్నమదేవిచేటికలు ప్రభావతీకళావతులు చూచు చుందురు)

ప్రభావతి—ఒసే కళావతీ, చూచావటే. ఈ తెనాలిరామలింగయ్య. ఈమెగారు మహాలక్ష్మియట. మన దేవిగారిని తక్కువచేయడానికి ఈ ఎత్తు. ఈమె మహాలక్ష్మి ఐతే ఈయన నారదమహామునికాబోలు.

కళావతి— ఎరగవటే ప్రభావతీ, రామలిం గయ్య గడుసుదనం, టక్కరిమాటలు.

రామలిం—దేవిగారు ధరించడంచేత ఈవజ్రపు బిళ్లకు విలువ యేర్పడినది. మీభాగ్యము ఆపౌలోమి కైనా లేదు. ఈభరతఖండంలో ఇటువంటి ఆభరణం ఇంకొకటి లేదు. ఢిల్లీలో లేదుగదా పాశ్చాత్యదేశా లలోనూ లేనేలేదు. ఏలినవారి ప్రతాపం విని ఎక్కడి వారున్ను ఇక్కడికి రావడంచేత సకలాభరణాలున్ను మన రాజ్యమునకే వచ్చుచున్నవి. మనము వదిలినవి ఇతరులకు. ప్రపంచమునందలి మేలైనవస్తువులు భరత ఖండములోను, అందులో మేలువస్తువులు విజయనగర ములోను, అందులోను మేలు శ్రీతిరుమలదేవిగారి నగరి లోను ఉన్నవి. సకలరత్నములున్ను ఇక్కడికే రాగలవు. ఏలినవారికి తాము బహిఃప్రాణము. తమకు తర్వాతనేగదా మిగిలిన యంతఃపురమంతయు. కడమ దేవేరులందరును తమకు తర్వాతివారే. చిన్నమదేవి గారుకూడ తమకు చిన్నయే.

ప్రభావతి—(రోషముతో) చూచావటే చూ చావటే, ఈరామలింగయ్యను. చిన్నమ్మగా రేమి చేశారే ఈయన్ను. ఆమె నెందుకే వేలుపెట్టిచూపడం. నారదుడే జగడాలుపెట్టడంలో. రావే పోయి దేవికే చెప్దాం ఇతగాడి చేష్టలంతా.

కళావతి—రామలింగయ్యకు త్వరలోనే శాస్తి ఔతుందిలే. (అని నిష్క్రి)

(నేపథ్యమున శంఖధ్వని)

ఒక చేటి - మహాప్రభూ స్నానసమయ మైనది.

రాయలు—(లేచి ఆత్మగతము)నేడు ఈరామలింగయ్యగారు చిక్కు తెచ్చిపెట్టినారు. చిన్నమదేవి చేటికలు చెప్పుటకు పోయినారు. కానీ, ఎట్లగునో చూతము.

చేటి—ఏలినవారు ఇటు ఇటు.

(అందరు నిష్క్రి))

స్థలము ౫. చిన్నమదేవినగరు

(మంచముపై చిన్నమదేవి పరుండియుండగా చేటికలు చుట్టు విసరుచుండగా ఒకతె వీణను మీటుచుండును.)

చిన్నమ—ఒసే, ఆ పాట వద్దే, నాకేమో కష్టంగా ఉందే.

ముసలిచేటి—ఏమమ్మా, ఒక విధంగా ఉన్నావు తల్లీ.

చిన్నమ—తెనాలిరామలింగయ్యవచ్చాడన్నది మొదలు మళ్లీ ఏమితంటా తెచ్చిపెడతాడో అని భయంగా ఉన్నదే. (తటాలున లేచి కూర్చుండి) ఒసే, ఏలినవారు ఇప్పు డెక్కడున్నారో చూచిరా.

ము. చే—ఆస్థానంనుంచిలేచి (అని సగములో)

చిన్నమ—లేచి ?

ము. లేచి తిరుమలమ్మగారి నగరికి వెళ్లారమ్మా.

మరియొకచేటి—అక్కడికే తెనాలిరామలింగయ్యగారు కూడా వెళ్లారండి.

చిన్నమ—(మంచముపైబడి) ఒసే, నాకేమో ఇవాళ ఒకమాదిరిగా ఉందే, అక్కడి కెందుకు వెళ్లారే ఏలినవారు ఇక్కడికి రాక ?

ము. చే—ఊర్కే మొహమాటానికి పోయియుంటారమ్మా.

చిన్నమ—నాకేమో అనుమానంగా ఉందే.

ము. చే—పిచ్చితల్లీ, అనుమానా లెందుకమ్మా. ఏలినవారు మొహమాటానికి ఏవేవో చేస్తుంటారు.

ఒకచేటి—(వడిగా ప్రవేశించి) ఎవడో ఒక బుడతకీసువాడమ్మా, నగలవర్తకుడు ఏవేవో మంచి మంచి ఆభరణాలు తెచ్చాడమ్మా. తెనాలిరామలింగయ్య అతన్ని తిరుమలమ్మగారి నగర్లోకి పిలుచుకొని పోయినారు.

చిన్న—(ముసలిచేటిని చూచి) చూచావటే, నా అనుమానం బలపడుతున్నది. నా కేదో అవమానం చేయడానికి ఎదో ఎత్తు వేస్తున్నాడే రామలింగయ్య.

(ప్రభావతీ కళావతులు ప్రవేశింతురు)

ప్రభావతి—ఏమని చెప్పడమే దేవిగారికి ?

కళావతి—మరి చెప్పకపోతే ఏలాగే ?

చిన్న—ప్రభావతీ కళావతులా, రండి. చెప్పండే అక్కడ ఏం జరిగిందో.

ప్రభావతి—ఏమీ లేదమ్మా. ఏలినవారు ఇందాక తిరుమలమ్మగారి నగరికి వచ్చారండి. అక్కడ ఏలినవారూ, దేవిగారూ పాచికలాడుతూఉంటే పరియాచకాలాడుతూ రామలింగయ్యగా రక్కడికి వచ్చారు.

చిన్న—ఏం చేశాడే ఆ మహానుభావుడు. త్వరగా చెప్పి ముగించు.

ప్రభావతి—ఎవడో బుడతకీసు వాడట మ్మా, వర్తకుడు. గొప్పగా ఒక వజ్రపుబిళ్ల తెచ్చాడు. తెనాలిరామలింగయ్యగారు పదికోట్లవరహాలకు బేరం చేశారట. ఏలినవారి కిచ్చారు. ఏలినవారు తిరుమలమ్మగారి కిచ్చారు. ఎంత బాగుందమ్మా, చీకటిని చీల్చేస్తుంది.

చిన్న—అధ్వాన్నంగా ఉంది. త్వరగా చెప్పి ముగించవే దాని సంగతి.

కళావతి—అంతటితో ఊర్కోకుండా తిరుమలమ్మగారిని చాలాదూరం పొగడి 'చిన్నాదేవిగారు మీ కంటె చాలా చిన్న' అని ఇలాంటిమాటలు చాలా తక్కువపరుస్తూ మాట్లాడారమ్మా. మేము వినలేక వచ్చేశాము.

చిన్న—నా పాలిటి యముడే ఆ రామలింగయ్య. (అని ముసలిదానిని కౌగలించుకొని కన్నీరు నించును.)

ము. చే.— ఏమమ్మా, ఏం మునిగిపోయిందిప్పుడు. ఏదో ఒక రాయి ఆయన తెస్తే, అప్పుడక్కడున్నారుకాబట్టి ఏలినవారు ఆమెకిచ్చారు. అంతమాత్రమేగదమ్మా. నీవు కోరితే ఆలాంటివి వందలు రావా ?

చిన్న—వందలు గిందలు. నామాట ఎందుకెత్తవలెనే ఆ రామలింగయ్య. అతని నోటి కడ్డము లేదే. ఏలినవారుకూడా నిలుపలేరుగదవే. నన్ను ఈ విధంగా అవమానం చేయడానికి నేనేం అపకారం చేశానే ఇతనికి ? ఏలినవారుకూడా ఆమోదిస్తే ఎందుకే ఈ బ్రతుకు ? (అని ఆభరణములు మొదలైనవి తీసి మంచముపై విసరికొట్టి తటాలున నిష్క్రమించును)

ము. చే.— దేవిగారికి కోపము వచ్చినది. బహుశః ఏలినవారు ఇక్కడికి వచ్చినా రావచ్చు. ఒసే, మీరంతా పనిపాటలు నిలిపివేసి ఎక్కడివారక్కడ చప్పుడుచేయకుండా ఉండండి.

(చేటికలు నిష్క్రాం.)

(నేపథ్యమునుండి 'ఏలినవారు ఇటు ఇటు.' అంత రాయలవారు ప్రవేశింతురు.)

రాయ—ఏమాశ్చర్యము, ఈనగ రేమి ఇట్లు చిన్నబోయి యున్నది ?

(అని ఇటునటు చూచుచు నిష్క్రాం.)

స్థలము ౭. కోపగృహము.

(ఒక చేటి విసరుచుండగా, ఒక చేటి పాదము లొత్తుచుండ, కొందఱు నిలిచియుండ, తెల్లచీర ధరించి ఆభరణములు మాని మంచముపై పొరలాడు చిన్నమదేవి ప్రవేశించును.)

చిన్న—(తటాలున లేచికూర్చుండి) అయ్యో, నేనేం చేశేదే ఈ ఆరాటం తీశేదానికి ?

సీ. కలలోననైన నవ్వులకైన నామాట
జవదాటవెఱచు నోచంద్రవదన
యేపదార్థంబు నాయెదుట బెట్టకమున్న
యెవ్వారి కొసగ డోయిగురుబోడి
చెలులు నాతో నేమి చెప్పుదురో యని
లంచంబు లిచ్చు నోచంచలాక్షి
తోడిచేడియలు నాతోడి వంతులకు రా
సైరింపజాల డోసన్నుతాంగి

గీ. అరమరలు లేని కూరిమి ననఁగిపెనఁగి
కొదలుతీరని కోర్కుల గూడియాడి
కపటమెరుగని మమతల గలసిమెలసి
యున్న విభు డిట్లు సేయునే యోలతాంగి.

ఒకచేటి—అమ్మా, ఏలినవారు వస్తున్నారు.

చిన్న—ఒసే, నాదుప్పటి తేవే. (అని ముసుగిడుకొని పరుండును)

(రాయలు నెమ్మదిగా ప్రవేశించును. ఒకతెను చూచి నోటిపైవ్రేలుపెట్టి మిగిలినవారిని చప్పుడుచేయవలదని చేసన్నలచే సూచించి, చిన్నమదేవిని సమీపించును. దేవికి వీచుచుండిన దాసి చేతినుండి విసనకఱ్ఱను తీసికొని దేవికి వీచును. చిన్నమ తటాలున ముసుగు తీసి రాయలను చూచి మరల ముసుగిడుకొనును)

రాయ—ఏమి యీకోపమునకు కారణము? నిజముగానే నీకు కోపము వచ్చినదా, లేక నన్ను పరిహాసముచేయుచున్నావా ? నీ కెవరైన నపకారమొనర్చిరా ? నా కేమియు తెలియకున్నది.

మనముల మాటలం గ్రియల
మన్నన లీనొకనాడు నెట్టికా
మినులకు, గారవంబు మెర
మెచ్చులకై పచరింతుగాని పా
యని యనురక్తి నీయెడన
యగ్గలమై కనుపట్టు నాకు నీ

వనిచిన పంపు సేయుటయు
ప్రాభవమా టది నీకెఱుంగవే.
(అని చిన్నమదేవిని తాకజూచును.)

చిన్నమ—(లేచి పయ్యెద సర్దుకొని) ప్రభు నన్ను తాకవలదు. చాలును, చాలును చిన్నమ అందరకన్నను చిన్న. రామలింగయ్యకే చులకనై పోయినాను. ప్రభుల కేమిలెక్క. నన్నింకనూ చిన్న బుచ్చవద్దు

రాయ—ఏమీ, రామలింగయ్యగా రేమిచేసినారు?

చిన్న—చేయవలసిన పనియే చేసినారు. ఏలినవారు సాక్షాత్తు విష్ణువు, ఆమెగారు మహాలక్ష్మి. జడబిళ్ల మహాలక్ష్మికే తగును మహాప్రభూ, ఈ చిన్నదానికేల?

రాయ— ఏమీ, ఈ రవంతరవకా అలిగెదవు?

చిన్న—లేదు మహాప్రభూ లేదు. తిరుమలదేవి అలిగిన లాభమున్నదిగాని మావంటివారు అలిగి మాత్ర మేమి? ఏగుట్టయో, ఏబావియో చాలును.
(అని బిరబిర నిష్క్రమించును.)

రాయ—(ఆత్మ)దీని కోపము మిక్కుటముగానున్నదే. చూచెదగాక. (అని వెనుకనే నిష్క్రమించును.)

(చేటికలు ఒకరినొకరు చూచుకొనుచు నేపథ్యమువైపు చూతురు.)

నేపథ్యమునుండి చిన్నమ—
పతి ప్రాణసదృశబంధువు
పతి దైవం బేమగడయ పతి సతులకు న
ప్పతియె కడు మేరదప్పిన
గతి కులకాంతలకు వేరు కలదే చెపుమా.
కలకాల మొక్క గతి పూ.
సలలో దారంబుమాడ్కి సతి మదిలోనన్
మెలగెడు పురుషులు గలుగుట
తొలుజన్మమునోముఫలము తోయజనేత్రా.

ము. చే.—అమ్మగారు ఏలినవారిమీద చాలా కోపం చేస్తున్నారు. పాపం ఏలినవారు చాలా వేడుకొంటున్నారు.

(మరల నేపథ్యమునుండి—
ధన మిచ్చి పుచ్చుకొన్నను
మనఃమున నొర్వంగవచ్చు మగ డింతులకున్
జనవిచ్చి పుచ్చుకొన్నను
మనవచ్చునె యింక నేటి మాటలు చెపుమా.)

ము. చే.—చూడవే, చూడవే. పాపం ఏలినవారు అమ్మగారికి దండం పెడుతున్నారు. య్యో, అమ్మగారు ఏలినవారిని తన్నివేసిం ఎంత పని! ఎంతపని! ఏలినవారి పాగ పడిపోయినది. అయ్యో! ఏలినవారికి చాలాకోపం వస్తున్నది.

(రాయలు నేపథ్యమునుండి.—'బుద్ధిహీనురాలా, ఎంతసేపటికిని కోపము మానవా? ఛీ! నీ మొఖము చూడరాదు. నా పాదాల్లో నీవు పడేదాకా నీ మొఖము చూడను. ఏమి దీమసము! ఏమి దీమసము!' అనుచు ప్రవేశించి కోపాటోపమున నిష్క్రమించును.)

(చిన్నమదేవి ప్రవేశించును.)

ము. చేటి—ఎందుకమ్మా అంతకోపం చేశావు?

చిన్న—పోవే బుద్ధిలేనిదానా, నీవా నాకు బుద్ధులునేర్పేదానివి? (అని రాయలవారు పోయినవైపు చూచి) ఒసే, నిజంగానే ఏలినవారికి కోపం వచ్చినట్టుందే?

ము. చే—అదిగదమ్మా నేను చెప్పడమున్నా. అంతదూరం ఎందుకు పెట్టుకొన్నావు తల్లీ?

చిన్న—(ము. చే.తో) ఒసే, నువ్వు పోయి వారితో మంచిమాటలు చెప్పి పిలుచుకొనిరావే.
(ముసలిది నిష్క్రమించును)

చిన్నమ—అయ్యో, ఏలినవారు బదులుచెప్పకుండా పోతున్నారే? (అని రెండడుగులు ముందు పోయి) ముసలిదాన్ని కసరుతున్నారు. నేనైనా పోయి పిలుచుకొని వస్తాను. (అని నిష్క్రమించును)

చేటికలు—మనమూ పోదాంపండి. (నిష్క్రమింతురు)
[సశేషము]

# గ్రహణకాలపాలైన సిమ్లాసభ



= శ్రీ కె. పార్థనాథశర్మ =

గడచిన జూను ౧౯-వ తేదీనాడు నే నొక గ్రామమున నుంటిని. వార్తాపత్రిక లక్కడ దొరకవు. ఆనాటి సాయంకాలమున సమీప పట్టణమునుండి నామిత్రు డొకడు అక్కడకు వచ్చి "ఈ నెల ౨౫-వ తేదీ నాటికి సిమ్లాలో నాయకుల సమావేశము జరుగునట్లు లార్డు వేవెల్ గారు నిర్ధరించినారు" అని చెప్పెను. ఆనాడు పున్నమ. అది చంద్రగ్రహణమని జ్ఞాపకము వచ్చినది. చంద్రుడు మకరరాశిలో ౩°-౪౦'లో, సూర్యుడు కర్కాటకరాశిలో ౩°-౪౦' లో ఉండగా ఆ గ్రహణము. కాన్ఫరెన్సు ఇట్టిరోజునందా లార్డు వేవెల్ గారు నిర్ధరించుట? హిందువులలో చనిపోయినవారికి తిలోదకములు విడుచు దిన మది! హిందూ దేశమునకు జాతీయ పరిపాలనా విధానమును సమకూర్చుటకు నాయకులతో సంప్రతించు విషయమున వైస్రాయిగారు ఇట్టికాలమందా కాన్ఫరెన్సు సమావేశపరచుట? దేశముయొక్క అభివృద్ధికై తగిన రాజకీయ సంస్కరణములను ఇయ్యగోరి సహృదయత్వముతో లండనునకు పోయి మంత్రులతో మాటలాడి నానాప్రయాసలు పడి పైవారి అనుమతి పొంది వైస్రాయిగారు కడకు కాన్ఫరెన్సుకు గ్రహణదినము నిర్ణయించిరే అని నా మనసు చాల నొచ్చినది. గ్రహణకాలమందు సూర్యచంద్రులనడుమ పూర్ణకేంద్రములో జిత్తులమారి ఇంద్రగ్రహము తులారాశిలో ౩°-౪౧' లో ఉండగలదు. అంతా ఇంద్రజాలముగా పరిణమించగలదు.

"ఈ కాన్ఫరెన్సువలన నేమియు ఫలము లేదు. ఎండమావులలో త్రాగుటకు నీ రెట్లు దొరకును? అంతా వట్టిశ్రమ" అని నామిత్రునికి చెప్పితిని.

జూన్ ౨౫-వ తేదీనాడు కాన్ఫరెన్సు ౧౧-౩౦ ఏ. యమ్. లో ఆరంభమైనది. ఇదిగో అప్పటి గ్రహస్థితిని చూపు కుండలి:—

| | | | |
|---|---|---|---|
| | | కు 10-3<br>శు 17-35 | X 7¼<br>వ 14-28 |
| | [సాయనము]<br>కాన్ఫరెన్సుకుండలి | | ర 3-15<br>రా 9-32<br>శ 12-54<br>బు 14-6 |
| కే 9-32 | | | |
| చ 28-19 | | ఇ 3-41 | I 8¾<br>గు 19-59 |

లార్డు వేవెల్ గారు సకాలమున సభ నలంకరించియుందురు. పరస్పరపరిచయాదులు జరిగి సమావేశము ఆరంభమవునప్పటికి రమారమి అరగంట కాలమైనా జరిగియుండును. అనగా దశమకేంద్రము వరుణగ్రహము మీదికే వచ్చియుండును.

ఈ కాన్ఫరెన్సులో ప్రధానపాత్రలు మూడు- ఇండియన్ నేషనల్ కాంగ్రెసు, ముస్లిమ్‌లీగ్, లార్డు వేవెల్. కాంగ్రెస్ జాతకము ఈ క్రింద ఉన్నది. రాజప్రతినిధిగారి జాతకము, ముస్లిమ్‌లీగ్ జాతకము దొరకి ఉండినచో చాలా బాగుండి యుండును.

పోనిండు. దొరకిన సామగ్రి ఏమనుచున్నదో చూతము గాక:—

| | | | |
|---|---|---|---|
| కే 20-6 | I 9-39 | ఇ 23-7 వ(క్రి) | |
| శు 22-30 | కాం(గెస్ జాతకము [సాయనము] | | శ 4-46 (వ) |
| ర 6-47 X 6-45 | | | |
| బు 29-11 | | చ 4-2 గు 5-10 వ 7-37 | రా 20-6 కు 20-49 |

మంచి ఉత్సాహశక్తి గల మేషరాశి లగ్నము. సరిగా దశమకేంద్ర మధ్యములోనే గ్రహరాజు ఉన్నాడు. పుణ్యసహమము (Part of Fortune) సూర్యసంయోగములో ఉన్నది. (మకరములో ౬°-౫౮') గొప్ప ఆదర్శాలతో స్వదేశమునకు రాజ్యాధికారము సంపాదించు పుణ్యకార్యమునకు పూనుకొన్నదికదా కాంగ్రెస్సు? తన ప్రయత్నపు ఫలితములను చూపు నాల్గవ ఇంటిలో రాజ్యస్థానాధిపతి యగు శని ఉండి రవిని ఎదిరించుచున్నాడు. కాంగ్రెస్ ప్రయత్నము ఫలించుటలో గొప్ప కష్టములు, చాల ఆలస్యము ఉన్నవని దీని అర్థము. ఈ జాతకమున ప్రత్యక్ష శత్రుస్థానము (సప్తమస్థానము) తులారాశి. దానిలో చంద్ర, గురు, వరుణులు చేరి దశమస్థానమందున్న రవిని, దశమాధిపతియగు శనిని ద్వేషించుచున్నారు. అనగా కాంగ్రెస్ ఆదర్శాలకు ప్రతికూలించు సంస్థలు మూడని. గ్రహముల స్వభావముల ననుసరించి చూచినచో, వరుణగ్రహము అతివాదులు (Extremists), విప్లవకారులు (Revolution-ries), వామపక్షీయులు (Left-wingers) వీరిని సూచించగలదు. సనాతన ధర్మవాదులు (Sanathanists, Hindu Mahasabhaites etc.), పాశ్చాత్య రాజనీతి వేత్తలు (Foreign Politicians) వీరిని బృహస్పతి తెలుపగలడు. ఇక మస్లిమ్‌లీగును సూచించువాడు చంద్రుడు. బాలచంద్ర ధ్వజులుకదా మస్లిమ్ సోదరులు? రాజ్యాధిపతియైన శనికి కేంద్రమందున్న ఈ మూడు గ్రహములను చూచినచో కాంగ్రెస్ ప్రయత్నములకు ప్రతిబంధకము ఎచటనుండి రాగలదో సులభముగా బోధపడును. విశేష మేమనగా ఈ మూడు గ్రహములలో శనికి సరిగా కేంద్రబిందువందే నిలిచినవాడు చంద్రుడే. ఆక్షేపణ, లేక ప్రతిబంధకము ప్రబలముగా ఎచటనుండి రాగలదో వేరే చెప్పనవసరము లేదు. శని చంద్రుల కేంద్రవేధ సంకుచితదృష్టి నిచ్చునది. మస్లిమ్‌లీగ్ మనస్తత్వమును ఇది చూపగలదు.

కాన్‌ఫరెన్సు కాలమందలి గ్రహములతో కాంగ్రెస్ జాతకమును పోల్చిచూతము. ఆనాడు సూర్యుడు సరిగా కాంగ్రెస్‌కుండలిలోని శనైశ్చరునిపైననే ఆవాహనమైనాడు. జన్మకాలమందలి ప్రతిబంధక సామగ్రి అంతా ఈ కాన్‌ఫరెన్సుకు ఆకర్షింపబడినది. కాంగ్రెస్ జాతకమందలి చంద్ర, గురు, వరుణులనుండి కాన్‌ఫరెన్సుకాలపు రవికి కేంద్రవేధ తప్పలేదు. ఇదంతా బూటకమని తలచు అతివాదులు ఉండనే ఉన్నారు. హిందూసంఘపు హక్కులు, అభ్యాసములు నశించునని చింతించు సనాతనవాదు లున్నారు. ఏ చీమ తుమ్మినా "నాస్తి" అనుటకు పరదేశపు రాజ్యతంత్రజ్ఞులు కాచుకొనియున్నారు. దేశమును రెండుగా చీల్చి, పాయలుజేసి, ఐకమత్యమును పాడు చేయుటకు మస్లిమ్ లీగువారు తయారుగా ఉన్నారు. ఈ మూడు గ్రహములలో చంద్రునిదే ప్రబలవేధ. కర్కాటకములో ౪-వ డిగ్రీలో కాంగ్రెస్ శనిపైన కూర్చున్న రవికి ఎదురుగా నిలచి, ఇంద్రునికి కేంద్రస్థానములో గ్రహణముపట్టనున్న చంద్రుని చూచినచో ఈ కాన్‌ఫరెన్సువలన కాంగ్రెసుఆదర్శము నెరవేరదనియు, దానికి లీగే అడ్డము తగులుననియు స్పష్టమగుచున్నది. కాంగ్రెసు జాతకమందలి చంద్రుని మీద ఇప్పుడు ఇంద్రగ్రహము వచ్చికూర్చుండి కాన్

ఫరెన్సు గ్రహములతో చేయికలుపుకొనుట గమనించితి మేని, మస్లిమ్‌లీగువారికి ఏదో రహస్యబలమో, ఊహాకు మించిన మాయాశక్తియో ఉన్నదనవచ్చును. అట్లు కానిచో, వారి ప్రతిఘటనవలన లార్డ్ వేవెల్ అంత శక్తిమంతుడగు రాజ్యతంత్రవేత్త తన ఉద్దేశమునుండి విరమించవలయునా?

అది అట్లుండనిండు. కాన్ఫరెన్సునాడు కాంగ్రెస్ లగ్నాధిపతియగు కుజునిమీద గురువు నిల్చినాడు. ఇది శుభసూచకమే అనవచ్చును. సద్భావముతో కాంగ్రెసుఅభిప్రాయములను మన్నించదలచి లార్డువేవెల్, వైట్‌హాల్ ప్రభువులను సమాధాన పరచి ఈ సమావేశమును తయారుచేసినాడు. ఈ గురువుపైన శుక్రునినుండి త్రికోణదృష్టి పడుచున్నది. సమావేశము జరుగు పట్టణము ఇండియాలో సుఖావాసమునకు తగిన పట్టణములలో ముఖ్యమైనది. నాయకులకు గృహవసతులు, ప్రయాణానుకూలములు, భోజన సౌకర్యములు చక్కగా సమకూరినవి. లంచ్‌లు, డిన్నర్లు యథేచ్ఛముగా జరిగియేయుండును. సమావేశమునకు చేరినవారు "భాయి, భాయి" అని మిత్రులుగా ప్రవర్తించినారు. గలాటాలు, హరతాళములు, కొట్లాటలు జరుగలేదు. నాంది . బాగానే జరిగినది.

సిమ్లానగరపు అక్షాంశలో (Latitude) ఆ పట్టణపు రేఖాంశా (Longitude) కాలమునకు వచ్చు లగ్నము కన్యారాశిలో ౧౫-౩౦°లో ఉండును. కాంగ్రెస్ జాతకములో చలితకుజుడు ఇప్పుడు ఆ డిగ్రీలోనే ఉన్నాడు. ఆచోటికే బృహస్పతి ఇప్పుడు వచ్చినాడు. గొప్ప ఆశలతో సిమ్లాపట్టణములో ఈ కాన్ఫరెన్సు జరుగుట చాల రమ్యముగా ఉన్నది.

తయారు కావలసియున్న రాజ్యాంగ కార్యనిర్వాహ.సంఘమునకు (Executive Council) తగిన వారిని ఎన్నుకొనుడని లార్డ్ వేవెల్ కోరినాడు. కాంగ్రెస్ ఎన్నుకొన్నవారి పేర్లు గల పట్టీని ౭-౭-౪౫ నాటి సాయంకాలము ౭-౩౦ గంటలకు కాంగ్రెసు కార్యదర్శి నైస్రాయిగారి ఆంతరంగిక కార్యదర్శి చేతికి ఇచ్చినాడట! ఎంత మంచి ముహూర్తములో ఇచ్చినాడో? అప్పటి గ్రహస్థితి ఇది:—

| | | | |
|---|---|---|---|
| | | కు 18-52<br>శు 29-47 | వ 15-8<br>చ 17-35 |
| | [సాయనము]<br>కాంగ్రెస్‌వారు పట్టీ<br>ఇచ్చినప్పటి కుండలి | | రా 8-53<br>శ 14-28<br>ర 14-56 |
| కే 8-53<br>I 4-0 | | | బు 6-2 |
| | | ఇ 3-48<br>X 21-0 | గు 21-31 |

లగ్నము మకరరాశి ౪°కి వచ్చియుండును. కాంగ్రెస్ కుండలిలోని రాజ్యస్థానాధిపతి అయిన శని (కర్కాటకరాశి నాల్గవ డిగ్రీ) అస్తమించుచున్న కాలమది. రాజ్యాశ అస్తమించవలసినదేకదా? తాత్కాలిక లగ్నానికీ, కాంగ్రెస్ శనికీ. సరినడుమ ఉండు కాంగ్రెస్ జాతకపు చంద్రునిమీద ఇంద్రుడు కూర్చుండి ఉయ్యాల ఊగుచుండు కాల మది. కాంగ్రెస్‌వా రిచ్చిన పట్టీ లీగ్ సమ్మతించునా? మంత్రివర్గములో ఉండవలసిన ముసల్మాను లైదుగురూ తాను చెప్పినవారే ఉండవలయునని జిన్నాగారు భల్లూకపు పట్టు పట్టినారు. తమ లీగులో చేరని ఎంతోమంది మస్లిమ్‌మతస్థు లుండినా వారికి అతని దృష్టిలో వెల లేదు. ఇదే శనిచంద్ర కేంద్రముయొక్క సంకుచిత దృష్టిఫలము. దీనిలో కొంచెము ఇంద్రజాలముకూడా లేకపోలేదేమో!

మరియొక విశేషము. ఈ కుండలిలో రవి ఉండునది కర్కాటకరాశి ౧౫-వ డిగ్రీ. కాంగ్రెసు సరిగా ౧౫ మంది పేర్లే ఇచ్చిన దట. వారిలో ఎవరి నైనా ఎన్నుకోవచ్చునని. కాని ఆ రవితో చేరి ఆనాడు శని కూర్చున్నాడు. లిస్టుకు శనిపట్టినది.

అప్పటి బుధుడు (కాంగ్రెస్ వ్రాసిన పట్టి) అప్పటి గురువునుండి ౪౫°ల చెడ్డదృష్టిలో నున్నాడు. లిస్టును గురువు (వైస్రాయి) ఉపయోగింపజాలడు. కాంగ్రెస్ జాతకములో చలితరాహువు ఇప్పుడు కన్యారాశి ౧౮-వ డిగ్రీలో, చలితకేతువు మీనరాశి ౧౮°లో ఉన్నారు. ఈ రాహుకేతువుల నడుమ చిక్కి తాత్కాలిక చంద్రుడు గిజగిజ లాడుచున్నాడు. గ్రహణముపట్టిన చంద్రుని ఫలము ఈ రాహుకేతువుల ద్వారా కాంగ్రెస్ జాతకమును చేరుకొన్నది.

కాంగ్రెసు జాతకములో తులారాశిలో ౪° లో నున్న చంద్రుడు ప్రతిపక్షులలో ముఖ్యుడనుకొన్నాము కదా. తనవారినే అయిదుగురిని తీసుకొనవలయునని జిన్నాగారు పట్టుపట్టగా, వైస్రాయిగారు ౪ రిని మాత్రమే తీసుకొందునని వారి పేర్లను జిన్నాగారికి రహస్యముగ చూపిరట. ఇంద్రుడు కాంగ్రెసు చంద్రునిపైన కదా ఇప్పుడుండుట!

సిమ్లానగరములో జరుగుచున్న ఈ నాటక పరివత్తుకు ఆకాశరంగమున సూత్రధారు లున్నారని అనిపించునట్లున్నది!

కాన్ఫరెన్సు ఆరంభమైన దినమున రాజ్యస్థానమందున్న వరుణగ్రహము రవికి ౧౯° దూరములో ఉండినాడు. నికరముగా ౧౯ వ రోజునాడే-అనగా జూలై నెల ౧౪-వ తేదీన కాన్ఫరెన్సు కడసారి కూడినది. వరుణుని చేయి పడితే పిడుగుపడినట్లే! జరిగిన ఫలము అందరికీ తెలిసియేఉన్నది. ఆదినము ౧౧ ఏ. యం. కు సభ. అప్ప కుండలి ప్రక్కకాలమున చూడుడు.

లగ్నము కన్యారాశిలో ౧౪°. అచ్చటనే అప్పటి చంద్రు డున్నాడు. లిస్టు ఇచ్చిననాటి చంద్రస్థానమునకు ఇది నిండుకేంద్రము. అనగా లిస్టునాటి చంద్రునికి ఇది నైధనతార. అసలు కాంగ్రెస్ జాతకమునకు నైధనతారలోనే కాన్ఫరెన్సుఆరంభమగుట. తారాబలము బాగా కుదిరినది! అది అట్లుండనిండు. కాం

| | | | |
|---|---|---|---|
| | | కు 23-38 | శు 6-48<br>వ 15-29<br>X 17-0 |
| | [సాయనము]<br>కాన్ఫరెన్సు<br>కడపటి<br>సమావేశము | | రా 8-32<br>శ 15-22<br>ర 21-21 |
| కే 8-32 | | | బు 16-20 |
| | | ఇ 3-53 | I 17-45<br>చ 16-54<br>గు 22-30 |

గ్రెస్ జాతకమున చలితరాహువుతో కడపటి కాన్ఫరెన్సునాటి చంద్రుడు సంయోగము! కాన్ఫరెన్సుకు రావు(రాహువు)కొట్టినది. ఫలమునకు గ్రహణము పట్టినది. బుధుడు (వ్రాతలు, తీర్మానములు) కాంగ్రెస్ కుండలిలో చలితశనికి (కర్కాటకరాశి ౧౩°) అర్ధకేంద్రపు (౪౫°) ప్రతికూలదృష్టిలో నిలచినాడు. కాన్ఫరెన్సు వ్రాతలలో, ఉపన్యాసములలో ముగిసినది. వార్తాపత్రికలకు సమృద్ధిగా సమాచారములు దొరకినవి. ఫలముమాత్రము గడ్డకట్టినది.

చంద్రగ్రహణపు దినమును మాని కాన్ఫరెన్సును మంచిదినమున ఆరంభించియుండినచో లార్డువేవెల్ గారి ప్రయత్నము తప్పక నెరవేరియుండును. అతని కీర్తి రాజకీయరంగమున సువర్ణాక్షరములతో చెక్కబడియుండును. కాన్ఫరెన్సును వేరే దినమునకు మార్చవలయునని ఎవరో కొందరు ప్రార్థించగా, అది సాధ్యము కాదనిరట. ఏమి కారణమో మరి?

రాయిటర్సు ప్రత్యేకవిలేఖరి లూయీ మ్యాన్స్ ఫీల్డ్ (**Louis Mansfield**) గారు ఇటీవలనే ఒక వింత సమాచారము వార్తాపత్రికలకు వ్రాసినాడు. యుద్ధారంభము కాగానే బ్రిటిష్ యుద్ధమంత్రులు తమ మంత్రాంగములో జ్యోతిష్కులను చేర్చుకొనిరట. హిట్లర్ కు ఈశాస్త్రముపైన చాలా నమ్మకము. శాస్త్రజ్ఞులతో ఆలోచించి ఫలానాదినమే, ఫలానాకాలము

నకే ఫలానాసేనాని ఫలానాస్థలమునకు, ఫలానా విధముగా సేనలను నడుపవలయునని నిర్ధరించి, ఆప్రకారమే అతడు జరుపునట. ఇదంతయు బ్రిటిష్‌వారు తెలుసుకొన్నారు. జర్మనీజాతకము, హిట్లర్‌జాతకము, అతని సేనాపతుల జాతకములు మొదలుగా కొంత సామగ్రి వీరు సంపాదించుకొన్నారు. ఎప్పుడు, ఏవిధముగా, ఎట్టిపరిస్థితులలో జర్మనులు సేనలు నడిపి దండెత్తివత్తురో, ముందుముందుగా బ్రిటిష్‌వారి జ్యోతిష్కులు గ్రహములనుబట్టి ఊహించి యుద్ధమంత్రులకు చెప్పుచువచ్చిరి. ఆసలహాల ననుసరించి మనవారు ముందుగానే తయారుపడినారు. హిట్లర్ శుభకాలమునకై కాచుకొనిఉండగా ముందుగనే పోయి, శత్రువుల ప్రయత్నములు కొనసాగకుండా మనవారు ధ్వంసముచేయుచువచ్చినారట. ఆ విద్యావంతు లెవరని కుతూహలపడి ఎందరో అడుగగా, బ్రిటిష్‌మంత్రులు వారి పేర్లు చెప్పలేదట. ఇది యుద్ధరహస్యము!

గ్రహముల చారమువలన సూచించబడుఫలమును ఉపయోగించుకొని యుద్ధమున జయమును పొందుచున్నవారు బ్రిటిష్ రాజ్యాంగమంత్రులు. అట్టివారికి ఈగ్రహణఫలము తెలియకుండునా? మరి, ఉద్దేశపూర్వకముగా ఇట్టి దినమును లార్డ్‌వేవెల్‌గారికి ఎవరైనా సూచించియుందురా?

ఎట్లైననేమి, భారతభూమిఆశ ఈగ్రహణము వల్ల చెడినది. ఇట్టి క్రూరదినమున ఇంత మంచికాన్‌ఫరెన్సు జరుగుటకు ముహూర్తము పెట్టినారే అని భారతమాత తల్లడిల్లినది. జూన్ నెల ౨౩ తేదీన— కాన్‌ఫరెన్సుకు నాయకులు సిమ్లాకు ప్రయాణము చేయు సమయముననే — ఉత్తరహిందూస్థానమందు లాహోరు, అమృతసరము, రావల్‌పిండి మొదలగు పట్టణములలో భూకంపము కలుగుటయే ఇందులకు సాక్ష్యము.



# జ్యోతిర్వేదము

## ఎక్కడ పుట్టిన దీవిశ్వము? ఎటనుండి వచ్చిన దీసృష్టి?

= శ్రీ గొబ్బూరు వెంకటానంద రాఘవరావు =

౪

"కో అద్ధా వేద క ఇహ ప్రవోచ త్కుత ఆజాతా? కుత ఇయం విసృష్టిః?

మనకు కనబడుచున్న ఈ విశాలవిశ్వము ఎక్కడ నుండి పుట్టుకొనివచ్చినది? ఈ సృష్టి ఎటనుండి వచ్చినది? అనేది ప్రశ్న లన్నిటిలో పెద్ద ప్రశ్న. ఈ సంగతి ఎవనికి తెలుసును? తెలిసినప్పటికిని "దీని సంగతి ఇది" అని ఢంకామీద దెబ్బకొట్టినట్టు గట్టిగా నిలబడి చెప్పగలవా రెవరు? అని వేదము ప్రశ్నించుచున్నది. ఈ ప్రశ్ననే విశ్వామిత్రఋషి మరొకవిధముగా వేసియున్నాడు:

"కో అద్ధా వేద క ఇహ ప్రవోచ
 ద్దేవాం అచ్ఛా పథ్యా కాసమేతి,
దదృశ్ర ఏషా మవమా సదాంసి
 పరేషు యా గుహ్యేషు వ్రతేషు."
(ఋ. III-౫౪-౫.)

ఏమార్గము ననుసరించి పోయిన మనము దేవతానివాసముల నెఱుగగలము? ఆ మార్గము సరియైనదేనని ఎవరు నిర్ధారణగా ప్రవచనముచేయగలరు? దేవతలు నిజముగా ఎక్కడ ఉన్నారో, ఏమూల ఏ రహస్య ప్రదేశములలో వారు డాగియున్నారో తెలియలేదు. దేవతానివాసముల పొలిమేరల చివర భాగములుమాత్రము దృశ్యాదృశ్యముగా కనబడుచున్నవి.

ఇక భాగవతద్వితీయస్కంధములో (౬౩,౬౪, ౬౫,౬౬) నారదుడు బ్రహ్మను విశ్వప్రకారమును గూర్చి చక్కగా ప్రశ్నించినాడు:

మ. "చతురాస్యుండవు, వేల్పుపెద్దవు
 ...............భారతీ
 సతి యిల్లాలట నీకు నో జనక నా
 సందేహమున్ బాపవే."

శా. "ప్రారంభాదివివేక మెవ్వ డొసగున్
 ప్రారంభసంపత్తి కా
 ధారం బెయ్యది? యేమి హేతువు? యద
 ర్థం బేస్వరూపంబు?"

శా. "నాకుం జూడగ నీవు రాజవనుచు
 న్నాడన్ యథార్థస్థితిన్
 నీకం టెన్ ఘను డొక్క రాజు గలడో
 నీవంతకున్ రాజవో
 నీ కేలాభము రాదలంచి జగముల్
 నిర్మించె దీచేతనా
 నీకం బెందు జనించు? నుండు? నడగున్?
 నిక్కంబు భాషింపుమా."

తద్విభున్
సంభాషింపగవచ్చునే తలప నే
చందంబునా వాక్కృతిన్?"

ఈ ప్రశ్నలలో విశేషము లున్నవి. "భారతీ సతి యిల్లాలు, వాణీశ్వరా" అని సంబోధించి వాణీ హిరణ్యగర్భులకు గల భార్యాభర్తృసంబంధము సూగ్గడించినాడు. అందుకుకూడ మంచికారణము కలదు. సరస్వతిప్రభావము ఋగ్వేదమునందు ఇట్లు వర్ణింపబడినది:

"చోదయిత్రీ సూనృతానామ్-చేతంతి సుమతీనామ్
యజ్ఞం దధే సరస్వతీ-ధియో విశ్వ విరాజతి."

"సత్యములు, మనోజ్ఞములు నైన పలుకులనే సరస్వతి పలికించును. ఆమెయనుగ్రహము వలన భావము లుత్తేజమునొందును. అటువంటి అద్భుత శక్తులు గల సరస్వతి నీకు భార్యయై నీ ముఖమందున్నది కనుక నీ పలుకులు అబద్ధములు, పేలవములు కాకూడదుసుమా" అను ధ్వనితో నారదుడు సాభిప్రాయముగా బ్రహ్మను ప్రశ్నించినాడు: అటుపిమ్మట "యథార్థస్థితిన్" "నిక్కంబు భాషింపుమా" అని తేటతెల్లముగా రెట్టించి అడిగినాడు. "ఔరా! నా విభుని మర్మమడిగితి వత్సా!" అని బ్రహ్మ నారదుని ప్రశ్నల నాదరించి మెచ్చుకున్నాడు.

ఈ నాటి వైజ్ఞానికులుకూడ "Whence & whither?"—ఈ విశ్వము ఎలాగు పుట్టినది, ఎక్కడకు పోవుచున్నది అనే ప్రశ్నకు సమాధానము తెలుప యత్నించుచున్నారు. ఇటువంటి ప్రశ్నలకు వేదాదిప్రాచ్యవాఙ్మయము ఏమి జవాబులిచ్చినది? ఆ జవాబులను నవీనవిజ్ఞానము ఖండించునా? బలపరుచునా? అనేది ఈ జ్యోతిర్వేదములో మన ముఖ్య జిజ్ఞాస. ఈ మహత్తరసమస్యలను సాధించుటకు మనము ఏమి చేయవలెను? ఏమి పరిశోధించవలెను?

మన అజ్ఞానాంధకారమును నశింపచేయుటకు సృష్టిలో భగవంతుడు మనకు సూర్యచంద్రనక్షత్రాది జ్యోతిస్స్వరూపములను నిర్మాణముచేసి యున్నాడు. అందు చంద్రుడు మన భూగోళముచుట్టును గానుగ ఎద్దువలె తిరిగివచ్చుచున్న ఉపగ్రహము. భూమి సూర్యునిచుట్టును అదేవిధముగా ప్రదక్షించుచున్నది. మన సూర్యు డొక నక్షత్రము. నక్షత్రములు బ్రహ్మాండ తేజముతో మెఱయు గొప్ప సూర్యగోళములు. కాబట్టి విశ్వరహస్యము కొంతవఱకైన భేదించి విశ్వప్రకారము రవంతయైన తెలిసికొనుటకు మనకు ఖగోళపరిశీలన మవసరము; నక్షత్రవేధ ముఖ్యసాధనము.

## చుక్కలు - చుక్కల గుంపులు - వాని రూపములు

ఆకాశమందు చుక్కలు వేలకొలది అన్ని దిక్కులను వ్యాపించియున్నట్లు కనబడును. ఆ చుక్కల వ్యాప్తిని, కూర్పునుబట్టి కొన్ని గుంపులుగా విభజించవచ్చును. ఆ గుంపులలో కొన్ని చుక్కలను కొన్నివిధములుగా కలుపుకొనుచు గీతలు గీసినట్లు భావించుకొనిన పక్షమున ఏవేవో కొన్ని రూపములు ఏర్పడగలవు. అది యేలాగున చేయవచ్చునని మీరు ప్రశ్నించవచ్చును.

మన హిందువుల ఇండ్లలోను, వాకిండ్లలోను ప్రతిరోజున ఉదయము ముగ్గుపిండితో ముగ్గులు పెట్టి బొమ్మలు వేయుట ఆచారమైయున్నది. పిండితో నేలమీద తెల్లని గీతలు పడునట్లు వేయుచు గుమ్మడిపండ్లవలెను, పడగలు గల పాములవలెను అనేకవిధములుగా ముగ్గుబొమ్మలు వేయుచుందురు. ఒకప్పుడు రవంత రవంత మాత్రము పిండి వేయుచు ముందు తెల్లని బొట్లు పెట్టి చుక్కలవంటి ఆ బొట్లమధ్య అనేక రేఖలు వేసి నేర్పుగా కలుపుచు ఎన్నెన్నో లతలు, పువ్వులు, చిలుకలు, హంసలు మొదలగు చిత్రములు ముగ్గుతో రచించవచ్చును. నేర్పుగలవార లీముగ్గులు పెట్టినపుడు ఆ ముగ్గుచిత్రములు చూచుట కెంతో ముచ్చటగా నుండును. అదేవిధముగా పూర్వులు ఆకాశముమీద మెఱయు చుక్కలను గుంపులుగా విభాగించి వాటి రూపసాదృశ్యములనుపట్టి ఒకొ్కక్క

గుంపునకు ఒక్కొక్క పేరు పెట్టిరి. ఈ చిత్రములో కొన్ని బొమ్మలు చూడనగును. ఈ చిత్రముయొక్క అడుగుభాగములో కుడిప్రక్క ఒక తేలురూపము కానవచ్చుచున్నది. ఈ చుక్కలను చూచినచో వంకరైనను ఇవి రూపమున తేలును పోలియున్నవని అనుకొందురు. ఈ చుక్కలగుంపును అన్ని దేశములవారును వృశ్చిక మనిరి. తేలుముఖమున నున్న మూడు చుక్కలు అనూరాధ అందుము; తేలుకడుపులో నున్న మూడు చుక్కలలో మధ్యది జ్యేష్ఠనక్షత్రము. ఇంద్రుడు జ్యేష్ఠకు అధిదేవత. తేలుకొండెలో కనబడు చుక్కలు మూలనక్షత్రము. మూలకు ఎడమభాగమున విల్లులో



అలుగు పెట్టి ప్రయోగించనైయున్న పురుషరూపము కనబడుచున్నది. ఈ గుంపును మనవారు ధనుస్సు అనిరి. ఇంగ్లీషువారు ధనర్ధారి అనునర్థమిచ్చు **Sagittarius** అనిరి. ధన్వి మన పురాణప్రసిద్ధుడైన మన్మథుడు. మన్మథుని దిగువభాగము గుఱ్ఱమును పోలియున్నట్లు పాశ్చాత్యులు భావించిరి. మనవారు ఆ రూపమును చిలుకగా భావించిరి. చెఱుకువింటివానికి చిలుక వాహనమనుటకు కారణమిదియే. ధన్వికి ప్రక్కగా ఒక మేకరూపము కలదు. ఈ అజరాశినిగూర్చి వెనుక నుంచి ముచ్చటింతము. అజమునకు మీదిభాగమున గరుడపక్షి రూపము కలదు. గరుడుని కడుపులో కనబడు మూడు చుక్కలు శ్రవణ మనబడు శ్రోణీనక్షత్రములు. గరుడునిపై నెవరో ప్రయోగించిన బాణముయొక్క రూపము ఆమీద చూడనగును. అమృతమపహరించువేళ ఇంద్రుడు కోపముతో వజ్రమెత్తి గరుడుని కొట్టగా ఆవజ్రాయుధము గరుడుని 'ఏక పర్ణశకలము'ను మాత్రము ఛేదింపగలిగెననుట సుప్రసిద్ధవిషయము. గరుడుడు సుపర్ణుడు; గరుత్మానుడు నని ఋగ్వేదము.

ఆమీద, పటముయొక్క ఉత్తరభాగమందు ఒక పక్షిరూపము కానవచ్చుచున్నది. పాశ్చాత్యులు ఈచుక్కలను **Cygnus** అనుచున్నారు. అనగా చిన్న హంస అని అర్థము. వేదములో ఇది హంస, హఙ్ంస అని వ్యవహరింపబడినది.

హంసకు కుడితట్టున తీగెలుగల ఒకయంత్రసాధనమున్నది. దీనిని పాశ్చాత్యులు **Lyra** అని

చెప్పెదురు. మనవారు వీణ యని చెప్పుచున్నారు. వీణకు కుడిప్రక్క ఒక బలాఢ్యుడు తలక్రిందుగా నుండి పెద్దఅడుగులు వేసి ఏమో కొలుచుచున్నట్లు కనబడుచున్నాడు. అతని కాలు ఒక పాముమీద నున్నది.

"ఇదం విష్ణు ర్విచక్రమే, త్రేధా నిదధేపదమ్, సమూహ మస్య పాంసురే"

అని వేదములో వర్ణింపబడిన విష్ణుని రూప మిది. విష్ణుమూర్తి వామనుడై మూడడుగులలో విశ్వమంతయు కొలిచి బలిచక్రవర్తిని పదభ్రష్టుని చేసిన కథ భాగవతములో ప్రసిద్ధము. ఈరూపమునకు కుడి ప్రక్క నవరత్నఖచితమైన కిరీటరూపము కనబడుచున్నది. వృశ్చికరాశిలో జ్యేష్ఠనక్షత్రమున కధిదేవతయగు ఇంద్రుడు వృత్రుని సంహరింపబోవుచు "ఓ విష్ణుమూర్తీ! పెద్ద అడుగులు వేసి త్వరగా రమ్ము! మనము వృత్రుని సంహరింపవలయు" నని అర్థమిచ్చు మంత్రములు ఋగ్వేదమున కలవు. (ఋ. viii ౮౯-౧౨) వృశ్చికరాశికిని, వామనరూపికిని మధ్య పాముతో పట్లుపట్టుచున్న సర్పధారిరూపము కానవచ్చుచున్నది.

ఈ చిత్రము రివరెండ్ గాల్‌దొరగారు రచించిన **Easy guide to the Constellations** అను పుస్తకములో నున్న ౩౮-వ పటమునకు సరియైన నకలు. ఈప్రాంతము ఖగోళములో చాల ముఖ్యమైనదని మన వేదఋషులు ఆనాడే గుర్తించిరి. "సర్వేంద్రియాణాం నయనం ప్రధానమ్"- శరీరమునందు గల ఇంద్రియము లన్నింటిలో కన్ను ప్రధానమైనది. అదే విధముగా ఆకాశరంగమంతటిలో ఈభాగము మిక్కిలి ప్రధానమైనది. "దివీవ చక్షు రాతతమ్" అని ఋగ్వేదము. కనుకనే బుద్ధిమంతులు ఎప్పుడును దీనిపై కన్నుంచి చూచుచున్నారు. "సదా పశ్యంతి సూరయః." ఇదే విష్ణువుయొక్క పరమపదము. "తద్విష్ణోః పరమం పదమ్."

ఈ నక్షత్రములను, వీని ప్రాముఖ్యతను మొదట బాగుగా గుర్తించినవారు వేదఋషులు. పాశ్చాత్యులకు తొలుత ఈ నక్షత్రసమూహముల పేళ్లు తెలియవు. వాటి ప్రాముఖ్యత అసలే తెలియదు. ఈ విషయము ప్రాక్ప్రతీచీవిమర్శకుల కందరకును బాగుగా ఋజువు చేయుట మిక్కిలి అవసరము గనుక గ్రంథవిస్తరభీతి కోర్చి, ఖగోళమును చక్కగా వర్ణించుచు కావ్యములు వ్రాసిన గ్రీకురోమనుమహాకవుల గ్రంథములనుండి కొన్ని పంక్తులుమాత్రము వ్రాయుచున్నాను. పై చిత్రములో తలక్రిందుగా నుండి మీదకు పెద్ద అడుగులు వేయుచున్న స్వరూపము సుప్రసిద్ధగ్రీకురోమనుకవులిట్లు వర్ణించిరి; కాని దానికి పేరు లేదనిరి.

**Manilius:—**

"A constellation kneels without a name.

**Aratos:—**

"Near to the Dragon's head,
in toil-spent posture
Revolves a phantom whose name
none can tell
Nor what he labours at;
they call him simply
The man upon his knee.

"Like a toiling man revolves
A Form. of it no one can clearly speak
Nor to what toil he is attached; but
Kneeler they call him... [simply
He who is never far distant from the
Lyre
Whoever this stranger of the Heavenly
Forms may be..." (Robert Brown's
translation from Original Greek)

ఈ పంక్తులు చదివినతరువాత ఈ ఖగోళస్వరూపమును గూర్చి ఆ నాటి పాశ్చాత్యుల కెవరికిని ఏమియు తెలియదని నిస్సందేహముగా స్థిరపడుచున్నది. ఈ రంగపు ఖగోళములో ఈ పటముడు

చిత్రింపబడిన రూపములు చాల మోటుగా, అనాకర్షణీయముగా ఉన్నవి. వీటి పరస్పరసంబంధ మేమో పాశ్చాత్యరచయితలు తెలుపలేదు. వీటికి వరుస, వావి, ప్రమేయము, ప్రయోజనము ఏమియు వారు వర్ణించలేదు. అసలు పేరులే వారిలో ఎవరికిని తెలియవని స్పష్టమగుచున్నది. కొదువసంగతులు వారేమి తెలుపగలరు?

మన వేదకాలపు ఋషులు బహుకాలము దీక్షతో ఖగోళమును పరిశీలించిరి. వృశ్చికరాశికి పైని ఉత్తరముగా ఉన్న ఖగోళప్రాంతము విశ్వమునకు నేత్రమువంటిదని గ్రహించిరి. విశ్వమున కిదే ప్రాదుర్భావస్థానము; ఇదే రాజధాని; ఇదే గమ్యస్థానము నని నిర్ధారణచేసిరి. సృష్టి ఇక్కడనే ప్రారంభమగును; పుట్టి, పెరిగి, పెద్దదై నలుదిక్కుల వ్యాపించిన విశ్వము ఇందే తుదకు లీన మగునని ఆ మహనీయు లానాడే స్పష్టముగా ప్రవచించిరి. విశ్వముయొక్క సమస్యను సాధించుటకు పూనుకొనిన వేదఋషులలో విశ్వామిత్ర, వసిష్ఠ, మేధాతిథి, దీర్ఘతము లనువారు చాల ముఖ్యులు. ఈ క్రింద వ్రాసిన మంత్రరత్నములలో వారు ఈ విశ్వచక్రమును త్రిప్పుచున్న విశ్వప్రభుని స్థానము చక్కగా హద్దుసరిహద్దులతో నిశ్చయించినారు.

౧. యత్రా సప్తఋషీన్ పరం ఏకం ఆహుః
౨. మారుతస్య వేధసః
౩. విష్ణోః పదే పరమే మధ్వ ఉత్సః
౪. తమిద్గర్భం ప్రథమం దధ్ర ఆపో యత్రదేవాః
సమగచ్ఛంతి విశ్వే, అజస్య నాభావధ్యేక
మర్పితం, యస్మి న్విశ్వానిభువనాని తస్థు
౫. యత్ర గావో భూరిశృంగా అయాసః
౬. నపతయంతః పతత్రిణః
౭. యత్రా సుపర్ణా అమృతస్య భాగా
మనిమేషం విదదాభి స్వరంతి
౮. ఇనో విశ్వస్య భువనస్య గోపా.

ఈ హద్దులు, ఆనవాళ్లు గల ప్రదేశములో విశ్వచక్రమును నడుపుచున్న విశ్వప్రభుని—"నక్షత్రాణి రూపమ్" అని శ్రుతులు తెలుపు నక్షత్రస్వరూపుని—ప్రాక్ప్రతీచీవిజ్ఞానమతసమన్వయదృష్టితో పరిశీలించి చక్కగా తెలిసికొందము.



# నేను — తాను

శ్రీ నండూరి వెంకటసుబ్బారావు

తనువంత నారాజు
తపసె యని — నేను,
మనసులో మెంకితో
మంతనము — తాను !

బతుకంత నారాజు
పాటె యని — నేను,
పాటలో మెంకితో
పల్లదము — తాను !

నిదరంత నారాజు
నీడె యని — నేను,
కలలోని మెంకితో
కిలకిలలు — తాను !

జగమంత నారాజు
సొగసె యని — నేను,
అద్దాన మెంకితో
విద్దెములు — తాను !



# సౌందర్యము యొక్క రెండు తరాలు

వారిద్దరికి 20 సంవత్సరములు తేడా. గాని, ఆ తల్లియొక్క సౌందర్యము, పదహారు సంవత్సరముల వయస్సుగల కుమార్తెకువలె వున్నది. తల్లి తన చిన్నతనమునుంచి—తన తల్లియొక్క సలహాను పొంది—చర్మ సౌందర్యమును, పియర్సు సబ్బుతోను నిర్మలమైన నీటితోను కాపాడుకొను చున్నది. ఈ రోజున సౌందర్యవతియగు తన కుమార్తె ఇదే చేస్తోంది. గాన ఆమె శరీర కాంతి, తన తల్లి శరీర కాంతివలె వుండును.

ఇండియాలో నలభై సంవత్సరములనుంచి అందమైన స్త్రీలు ప్రత్యేకముగా పియర్సునే వాడుచున్నారు. దీని పరిమళము, మృదువైన నురుగు దీనికి సబ్బులలో ప్రాముఖ్యత నిచ్చినవి.



# పియర్సు సబ్బు

శాశ్వతముగా సౌందర్యమును కాపాడుటకు

TG. 38-172 TL A. & F. PEARS, ISLEWORTH, ENGLAND



సమయమునకు తగిన వ్యక్తి సందర్భము లభించిన, ఏ పనినైనను భారతీయుడు చేయగలడను నిదర్శనము చూపుటకు ఈ యుద్ధము ప్రారంభించినదాదిగా అనేకమంది భారతీయులు వైమానిక విద్య యందు తమ నిపుణతను ప్రపంచమునకు వెల్లడించినారు. శౌర్య పరాక్రమ సాహసములకు, వాటిని సాధించుటలో రాయల్ ఇండియన్ వైమానిక దళము పేరు ప్రతిష్ఠలను స్థాపించినది, ఇది భవిష్యత్తుకు శుభ శకునము.

ఈ క్రొత్త సర్వీసు నేడు ధైర్యోత్సాహములుగల యువకుల నెందరినో ఆహ్వానించుచున్నది. శాంతి నెలకొల్పబడిన తరువాత వారికి, భారత దేశమునకు కూడ వారు నేర్చిన ఈ విద్య ఎంతో లాభదాయకముగా నుండును. ఇప్పటివలె అప్పుడు కూడా రాయల్ ఇండియన్ వైమానిక దళములో పనిచేసిన వైమానికుడు సమయమునకు తగిన వ్యక్తియగును.

ఏ రిక్రూటింగ్ ఆఫీసరు అయినను దరఖాస్తును పెట్టు విధానమును బోధపరుచును.

# అక్క చెల్లెళ్లు

[ కథానిక ]



= 'స్వైరవిహారి' =

ఇటీవల రామనారాయణకూ, రాజేశ్వరికీ మధ్య వివాదాలు మరీ ఎక్కువయినాయి. అంతకుముందు మూడునాలుగు రోజులనుండి ఎందుకో ఒకందుకు తెరిపిలేకుండా పోట్లాడుకుంటూనే ఉన్నారు. కొంచెం మొగం చిట్లించుకొని, "అబ్బ! వెధవగోల, రోజూ ఇంటికి వచ్చేసరికి ఏదోఒక జట్టీ. మరి యీ నాజన్మకు శాంతన్నది ఉండదుకాబోలు" అని రామనారాయణ విసుగుకొని, వెంటనే వీథిలోనికి వెళ్లిపోవడము అదివరకు మామూలయిన పద్ధతి. కాని ఆనాడు కార్యక్రమం కొంత్త భిన్నంగా జరిగింది. అతని కంఠస్వనం ఒక్కమారుగా మంద్రస్థాయినుండి తారస్థాయిలోనికి లేచింది; కొంచెం చెయ్యి చేసుకుందుకుకూడా తయారుపడ్డాడు. అయితే రాజేశ్వరికి దీని పైసంగతి తెలియకపోలేదు. విచిత్రంగా ఆమెగొంతు తగ్గటం, ముక్కూ కళ్ళూ విజృంభించటం జరిగింది. ఆమె బాష్పసిక్తమయిన వదనాన్ని గంభీరంగా పైకెత్తి—"కొట్టండి; మీయిష్టం వచ్చినట్టు కొట్టండి. ఆఖరుకు మనకు చేతనయినది పెళ్లాన్ని కొట్టడమేగా" అంది సధైర్యంగా కన్నీరు తుడుచుకుంటూ. ఆమె భయపడి తప్పించుకుందుకు ప్రయత్నం చేస్తే అతడు కొట్టేవాడేమోగాని, అప్పట్లో అతనికి నిజంగా కొంచెం భయం వేసిందనే అనాలి. అతడు నిరుత్తరంగా వెనక్కు తిరిగి అదేపోకగా నల్లచెరువు మెట్లవైపుకు నడక సాగించేడు.

ఎదురుగా ఆకాశాన ఇంద్రధనుస్సు కరిగిపోతూ ఉంది. రోజూ సర్వసామాన్యంగా ఉండే ఆకాశం మీద అప్పుడప్పుడు హరివిల్లు కనిపిస్తూఉంటుంది. విల్లు యుద్ధోపకరణంకదా? దీనితో వానరాజు ఎండదొరను వెంటాడుతాడేమో? ఎవరు ఓడినా, ఎవరు గెలిచినా ప్రపంచానికి సఖ్యత ఎంత సహజమూ, అనివార్యమో వైరముకూడా అంతేకాబోలు! అయితే వీటిలో, వైరములో ఏమి ప్రభావముందో, ఒకమారు అడుగుపెట్టిందంటే, అంతవరకు ఎంతోకాలముగా వ్యాపించిఉన్న సఖ్యతను ఎప్పుడయినా బ్రతికిఉందా అనే స్థితిలోనికి తీసుకొనిరాగలదు! రానురాను మానవుడు తాను ప్రకృతిలోని అంతర్భాగాన్నన్నే మాటను మరిచిపోయి, తక్కిన యావత్ప్రపంచమును తనకు దాసీభూతముగా చేసుకొందుకే శక్తినంతటినీ ధారపోస్తున్నాడు.

అతని భావన అతనికంటే జోరుగా సాగిపోతున్నది. మళ్లీ అప్రయత్నంగా ఆకాశంవయిపు చూసేసరికి, హరివిల్లు చాలాభాగం కరిగిపోయింది. రెండు చివరలను రెండు ముక్కలుమాత్రం మిగిలేయి. ఈమారతని యోచనాధోరణి వేరు.

ఇంతవరకూ హరివిల్లు పూర్తిగానే ఉంది. ఇక నీ రెండు ముక్కలూ మళ్లీ కలియడం ఎలా సంభవమౌతుంది? ప్రత్యేకములయిన ఆ రెండుఖండాలనూ కలిపికట్టడానికి మామూలుత్రాళ్లు చాలవు; ఆరెంటితో అవినాభావసంబంధ మున్న ఇంకొక సజీవ సవర్ణ

పదార్థమేదో మధ్యను ఉండాలనిపించింది రామనారాయణకు.

అతను చాలా ఆలస్యంగా ఇంటికి వచ్చేడు. ఇంటిదగ్గర వ్యవహారం గంభీరంగా గడిచిపోయింది. అతను భోజనానంతరము తమలపాకులు వేసుకొంటున్న సమయంలో ఆమె మొగం దించుకొని నెమ్మదిగా అంది: "మద్రాసునుండి మాచెల్లెలు మావాళ్ల యింటికి వస్తుందట. నేనుకూడా చాలాకాలమాయి వెళ్లలేదు. రేపుదయం రైలుకు నన్ను దిగబెట్టండి."

యీప్రార్థనకు మూలకారణమేమో రామనారాయణకు తెలియకపోలేదు. ఒక్కనిముషం ఊరుకొని ఉరిమినట్లుగా "సరే" అని, సినీమా (రెండవఆట) కు బయలుదేరేడు.

* * *

రామనారాయణలో సహృదయత్వం లేకపోడాన్నే కాదు, సంకుచితత్వాన్నికూడా మొట్టమొదట కనిపెట్టి వెలికితీసుకొనివచ్చినది రాజేశ్వరే అనాలి. అంతవరకూ తనలో ఆయాగుణా లున్న సంగతే తెలియదు అతనికి. అయితే యిక్కడ ఒక చిన్న ధర్మసందేహం ఉంది. అతనికి ఆయాగుణాలు మిక్కిలీ సహజములై వాటి ఒరపిడికి తాళుకోలేని రాజేశ్వరివల్ల వెలికివచ్చేయో, లేక తన స్వభావానుగుణంగా రాజేశ్వరి అతనియం దాయాగుణాలను పదే పదే ఆరోపించటంవల్ల ఇటీవల మాత్రమే జనించి విస్తరించేయో అన్నది కొంచెము సంశయాస్పదమే. కాని రామనారాయణను చిన్నతనంనుండి బాగా తెలిసినవారికిమాత్రం రెండవ పద్ధతే ఎక్కువ సమంజసంగా తోస్తుంది. అతడు అమాయకుడు కాడుగాని దుర్మార్గుడుమాత్రం కాడు; అతడు ఆడంబరం అంటే ఎక్కువ యిష్టపడడుగాని వేదాంతికాడు; అతని సహనశక్తి అపరిమితమైనదేకాని కోపంకూడా విపరీతమైనదే. అతనికి ఇతరులమ్మీద తన్ను స్తుతిస్తున్నప్పటికంటె నిందిస్తున్నప్పుడే నమ్మకం అధికం.

అతను స్టెనోటైపిస్టుపని చేస్తూ ఆరేళ్లూ, రాజేశ్వరితో సంసారం చేస్తూ నాలుగేళ్లూ అయింది క్రమంగా. ఏ అభివృద్ధీ లేకుండా మొదలుపెట్టినప్పటికీ, యిప్పటికీ ఒక్కలాగే ఉన్నాయి పై రెండూ కూడా. ఆరంభంలో, వీటికంటె తాను వాంఛించవలసిన వేమీ ఉండవనీ, వీటివలన తాను స్వర్గసౌఖ్యం కాకపోయినా, మానవమాత్రులకు సాధ్యమయిన సౌఖ్యం చాలావరకూ పొందవచ్చుననీ ఆశించాడు. కాని కాలక్రమేణా ఏమీ కొత్తలేకుండా అన్నిరోజులూ ఒకదాని ప్రతిబింబముగా ఒకటి ఉండడంమూలాన్ని అతనిలో ఒకవిధమయిన అసంతృప్తి పొడసూపింది. ఆ అసంతృప్తివహ్నికి ఇటీవల రాజేశ్వరితో అప్రయత్నంగా వచ్చే వివాదాలు ఆజ్యధారలైనాయి.

రాజేశ్వరి అందమైనదే. మొదట్లో ఆమె అందాన్ని చూసుకొని అతడెంతో ఆనందించటమేకాదు, గర్వించేవాడుకూడా. ఆ ఆనందాతిరేకంలో "నీఅంత చక్కనిది దొరకడం నిజంగా నాఅదృష్టమేసుమా" అనికూడా అతడెన్నోమార్లామెతో అన్నాడు. ఇది అతడు హృదయపూర్వకంగా అన్నదే. కాగా, ఇందువల్ల రాజేశ్వరిస్వాతిశయం వృద్ధిపొందడంలో విశేషమేమీ లేదు. ఇంతకూ ఏయిల్లాలు మాత్రం తన భర్తనోటివెంట ఇల్లాటి ప్రశంసను విని గర్వించకుండా ఉండగలదు? కాని ఇక్కడే తెలిసో తెలియకో రాజేశ్వరి ఒక పొరపాటు చేసింది. తన అందాన్ని ఇంతగా స్తుతిస్తూవచ్చిన రామనారాయణ తాను అసహ్యించుకోవలసినవాడు కాకపోయినా, తనకు యీడైన చక్కనివాడు కాడేమో ననుకుంది. ఈరకపు భావనను అతనిని ఆమెదృష్టిలో తేలికపరచిన అనేకకారణములలోనూ ముఖ్యమయినదిగా గణించవలసివుంది. అంతటినుండీ ఆమె అతనితో ఏవిషయములోనూ హృదయపూర్వకంగా కలియలేకపోయేది. ఇటీవల వారిద్దరిమధ్యనూ ఆవిర్భవించిన అభిప్రాయవైషమ్యాలకు ఈభావన చాలా దోహదంచేసింది.

రామనారాయణలోని శాంతిప్రియతనూ, సహనశీలాన్నీ గుర్తించినంత చక్కగా అతనిలోని కోపాన్నీ, సడలని పట్టుదలనూ ఊహించినట్టయితే, రాజేశ్వరి అతనితో అంతగా వివాదపడకపోయేదేమో? కాని

యిప్పుడు సమయం పూర్తిగా దాటిపోయింది. అతని లోని నిగ్రహ మనే తంతువు ఆగ్రహవిజృంభణకు బిగిసి బిగిసి చివరకు తెగిపోయింది. ఇక అతనిలో మిగిలిన దల్లా ఆమెను ఎల్లాగైనా సాధించాలన్న పట్టుదల. ఆమెను శారీరకంగా బాధించి సాధించలేనన్న సంగతి అతనికి అనుభవపూర్వకంగా తెలిసినదే. ఇక ఆమెను సాధించటానికి ఉన్నదల్లా ఒక్కటే మార్గం.

*      *      *

లక్ష్మి రామనారాయణకు ఒక వేలువిడిచిన మేనతకూతురు. ఆమెకు పదమూడవ ఏట పెళ్లి అయింది. పెళ్లిఅయిన ఆర్నెల్లకు భర్త టైఫాయిడుతో వచ్చి పోయాడు. ఆమెతల్లి నరసమ్మకూడా విధవే. దగ్గరబంధువు లెవ్వరూ లేరు వారికి. అయితేనేం, కాలక్షేపం చెయ్యక తప్పతుందా? కొంత నగదూ, కొద్దిగా భూమీ ఉండడంవల్ల భుక్తికి బాధ లేక పోయేది. కాని, వయసులో ఉన్న లక్ష్మిని, తాత్కాలికానందంకోసం, పాశవికంగా కామించే వారి దృష్టినుండి తప్పించటం నరసమ్మకు రానురాను మరీ దుర్భరమనిపించింది. ఎంత లోకంతో సంబంధాన్ని తెగకొట్టుకొనిఉన్నా, లక్ష్మిప్రవర్తనమీద అనేకదుష్ప్రవాదాలు కర్ణాకర్ణిగా వారికి తెలిసేలాగ వాడుకలోకిరావడం నరసమ్మకు దీర్ఘమనోవ్యాధికారణంగా పరిణమించింది. మనోవ్యాధి కొంచెం ఆశ్రయం కల్పించుకున్నతరువాత శారీరకవ్యాధులకు కొదవా?

సరిగా అదేసమయంలో రాజేశ్వరి తనతో పోట్లాడి పుట్టింటికి వెళ్లిపోయినతర్వాత, పట్టణంజీవితం మీద విసుగుపుట్టి, రెండునెలలు నౌఖరీకి సెలవుపెట్టి రామనారాయణ బయల్దేరేడు స్వగ్రామానికి. అక్కడ అతనికి స్వంత ఇల్లుందిగాని, అందులో కొన్ని సంవత్సరాలుగా ఎవ్వరూ ఉండకపోవడంవల్ల, అది కొంత పాడుపడింది. అతడు తిన్నగా నరసమ్మఅత్తగారింటికి వెళ్లేడు. వెళ్లి చూసేసరికి ఆమెస్థితి చాలా ప్రమాదకరంగా ఉంది. మేనల్లుడు తలకనితలంపుగా మంచి అదనుకు వచ్చేడన్న సానందమయిన ధైర్యంతో ఆమె చెప్పిన రెండుమాటలవల్లా అక్కడి వారి పరిస్థితి పూర్తిగా అవగాహనఅయింది రామనారాయణకు. అదివరకు లక్ష్మి పెళ్లి ప్రాధేయపడితే, ఆమెతో పరాచికాలాడిన వైద్యుడే, రామనారాయణ వెళ్లి మొహమాటపెట్టగా కాదనలేక వచ్చి యిచ్చిన నాలుగు పొట్లాలకూ ఫలితంగా నరసమ్మగారికి కొంచెం తెరిపిచ్చింది. కాని ఎక్కువభాగం ఆమెలోని యీ మార్పుకు కారణం రామనారాయణఆగమనమే.

అప్పటికి శాంతించినా అక్కడే ఉంటే వ్యాధి పూర్తిగా నయమవడం అసంభవమనీ, అందువలన తనతో మర్నాడే పట్నం రావలసిందనీ పట్టుపట్టేడు రామనారాయణ. లక్ష్మికు అదే మంచిదంది. నరసమ్మగారు కాదనలేకపోయిం

పట్నంవచ్చిన రెండురోజులకు నరసమ్మగారి వ్యాధి తిరగబెట్టింది. రామనారాయణ కుదిర్చిన డాక్టరు "పంతులుగారూ! లాభం ఉన్నట్టు కనిపించదు; చాలాకాలం అశ్రద్ధ చేసినట్టున్నారు"అని, కొంచెంసేపు ఆలోచించి, "అయినా, ఆఖరుప్రయత్నంగా ఒక ఇంజక్షను ఇచ్చిచూద్దాం; కొంచెం తెలివయినా వస్తుందేమో"అన్నాడు. రామనారాయణ నిరుత్తరంగా మంచందగ్గర నేల చతికిలబడ్డాడు. డాక్టరు అన్నట్టే అయింది. ఇంజక్షను ఇచ్చినతరువాత కొద్దిగా తెలివివచ్చింది. కాని ఆమె ఆట్టే మాట్లాడలేదు. రామనారాయణను 'బాబూ!' అని పిలిచి, కాళ్లదగ్గర ఉన్న ...ని కళ్లతో సూచిస్తూ "జాగ్రత్త! నిన్ను నమ్ముకొని నేను పోతున్నాను"అని యింకా ఏమో చెప్పడానికి వ్యర్థంగా ప్రయత్నంచేసింది.

రామనారాయణకు బాగా జ్ఞానంవచ్చినతర్వాత సబాష్పమయిన ఏడుపు రావడానికి అదే మొదటిమారు. లక్ష్మి "అమ్మా!"అని శిలాప్రతిమవలె అలా చూస్తూ ఉండిపోయింది. డాక్టరు నీరవంగా నిలబడిపోయేడు.

కొంతసేపటికి డాక్టరు కటువుగా ఇంగ్లీషులో, "పంతులుగారూ! మీరే అలా ఏడుస్తే ఎలా కుదురు

తుంది? మనము ఏవో ప్రయత్నాలు చేసే మానవులమేగాని దేవతలం కాముకదా! ఇక మీరు అలా విచారిస్తూఉంటే, మీభార్య(అని లక్ష్మినుద్దేశిస్తూ) ఆమెఆరోగ్యంకూడా బాగున్నట్టులేదు. తగిన మందు తీసుకొంటూ త్వరలో యీవిషయాన్ని మరిచిపోతేనే తప్ప, ఆమెకుకూడా ఏదయినా అనివార్యమయిన వ్యాధి అంకురించడానికి అవకాశం ఉంది"అనడంతో రామనారాయణ మళ్లీ మామూలుమనిషి కాకతప్పింది కాదు.

* *

లక్ష్మి ఆరోగ్యం విషయంలో రామనారాయణ తీసుకొనే శ్రద్ధ డాక్టరుగారికి మొదట ఆనందాశ్చర్యాలనూ, తరువాత క్రమంగా విసుగుదలనుకూడా కలిగించే స్థితికి వచ్చింది. అంతవరకూ రామనారాయణ అతని నేవో సంశయావళితో ముట్టడిస్తూనే ఉన్నాడు.

ఇక లక్ష్మిని ఆనందింపజేయడము సందర్భములో రామనారాయణ అదివరకు తనకు అపరిచితములయిన ఎన్నో మార్గాలను అవలంబించేవాడు. "నాకేం కష్టం లేదు—నేను బాగానే వంటచెయ్యగలను" అని ఆమె అంటున్నాకూడా హోటలునుండే భోజనం తెప్పించేవాడు. తాను సామాన్యమైన ఖరీదులకే కొన్న రెండు చీరలను కట్టుకొనే ఆమె ఎంతో మురిసిపోవడంతో అతనికి విలువైనమరి రెండు చీరలు కొనాలనిపించింది.

రైల్వేబుక్ స్టాలులోని ప్రతిపత్రికనూ, కథల పుస్తకాన్నీ కొన్నాడు అతడామెకోసం. మూడు రోజుల కొకమారయినా సినిమాకు తీసుకొని వెళ్లేవాడు. ఎప్పుడూ ఆమెను ఒంటరిగా ఉండనీయక ఏదోవిధంగా తనను తాను మరిచిపోయేట్టు చెయ్యడానికి బహుధా ప్రయత్నించేవాడు రామనారాయణ.

లక్ష్మి సుఖంకోసం రామనారాయణ అవలంబించిన పథాలు ఇదివరలోగాని, ఇప్పుడుగాని ఆమె మనఃపూర్వకంగా వాంఛించినవే అనలేం. అయినా తన తల్లికి అతనిమీద నుండే అభిమానమూ, తనకు సరైన వేళను ఆలంబనము ఇచ్చేదన్న గౌరవమూ ఆమెను అతని చేతిలోని కీలుబొమ్మను చేసేయి. అంతేకాని చిన్నతనంలో ఇద్దరూ కలిసిమెలిసి ప్రవర్తించిననాటి అనురాగగరిమ ఇన్ని సంవత్సరాల ఎడబాటుకూ, ప్రత్యేకవ్యక్తిగతవేదనలకూ నశించక యింకా అజ్ఞాతంగా మిగిలిఉందని విశ్వసించలేముకదా!

ఏది ఎల్లాగయినా ఇక్కడ ఒక చిన్న విశేషం. రామనారాయణకు సహజంగా సినిమాలూ, చీట్లాట, కథల పుస్తకాలూ,కబుర్లూ అంటే ఉన్న సరదా బహు పరిమితము. కాని తానే సర్వస్వమయిఉన్న లక్ష్మిని ఆనందపరచేందుకు ఆమెతోకూడా తానూ అలవాటు పడుతున్నాడు. ఇక లక్ష్మి! ఆమెకు ప్రత్యేకించి ఎల్లాటి సరదాలూ లేకపోయినా, తనకు సరైన సమయంలో రక్షకుడుగా అవతరించిన రామనారాయణ ఉత్సాహాన్ని నిరోధించకుండా ఉండడానికి మాత్రమే వీటికి ఇష్టపడుతున్నది.

ఇతరములయిన ఆడ్డంకులు లేని సమయాలలో స్త్రీపురుషులమధ్య (అందులోనూ యౌవనమధ్యస్థంలో ఉన్నవారినడుమ)స్నేహం అక్కడితో అలా ఆగిపోవడం ఎక్కడోకాని సాధ్యంకాదు. మొదట్లో కేవలం లక్ష్మిదేహారోగ్యం మీదనే కేంద్రీకృతమయిన అతని మనసు నేడామె కనులకదలికలలోని తారళ్యాన్నీ, మాటపొందికలోని మాధుర్యాన్నీ గమనించటంతో ఆగక ఆమెకరస్పర్శలోని కాంతత్వాన్నీ, సాహచర్యంలోని సౌఖ్యగరిమనూ ఆకాంక్షించ సాగింది. ఇది మొదట్లో అతనికే ఏదో వింతగా తోచింది. కాని ఏదో వింత అన్నంత తేలికగా కాకుండా. ఈవిషయంలో అతనిఉత్కంఠ రానురాను అతివేలమయింది. అతడామెను చూడకుండా ఎడంగా ఉండలేడు. చూస్తూ నిర్మోహంగా ఉండడం మరీ దుర్భరంగా.వుంది.

"లక్ష్మిమీద నాకు కలిగిన యీమోహము ఎంతవరకూ సభ్యమయినది? చిన్నతనంలో ఆమె నాకు ఎంతో సమీపంలో ఉండేది కాదా? అప్పడామెను

ప్రేమించడములో ఎటువంటి దోషమూ లేదుకదా! పరిస్థితులు మారినంతమాత్రాన హృదయాల్లోకూడా పరివర్తనం వచ్చితీరాలా? అది సాధ్యమా? అంతేకాక, హృదయాలు నశించిన వృద్ధులు ఏవేవో కారణాలు మనసులో పెట్టుకొని వేయించిన వివాహపు ప్రేమడి ముడులకు ఫలితంగా ఇంతకాలం ఒకరికి ఒకరు కాకుండా అయిపోయేము. ఇప్పుడు ఏకారణంవల్ల నయితేనేమి ? మెఱుపు మెరిసినట్లుగా ఆమె వచ్చి నాచేతిలో పడ్డది. అదృష్టవశాత్తూ వచ్చిన యీ అవకాశాన్ని స్వార్థం శూన్యంచేసుకొని జారవిడుస్తానే అనుకుందాం. అయితే యిప్పుడామె నేం చేసేది ? ఎవరోఒక రక్షకుడు అంటూ ఉండకతీరదుకదా, స్త్రీకి?

"ఇవతల నాపరిస్థితికూడా ఇటీవల మరీ పాడుగా ఉంది. రాజేశ్వరికీ, నాకూ యీ నాలుగేళ్ల లోనూ నాలుగువందలమార్లయినా వివాదాలూ, పోట్లాటలూ వచ్చిఉంటాయనుకొంటాను. అయినా దృక్పథాలే వేరుగా ఉన్న స్వాతంత్ర్యప్రియులయిన యిద్దరు వ్యక్తులు కలిసి కాలక్షేపంచేయడం ఎలా సాధ్యమవుతుంది ? ఇక ఆమెకూ, నాకూ కుదరనట్టే. ఆమెకు ఆమెతండ్రి తెస్తున్న ధనముమీదనే గౌరవం. నాకు నాతండ్రిచేత జీవితసర్వస్వాన్నీ, యావదాస్తినీ పరార్థమై వ్యయింపజేసిన త్యాగశ్రీమీదనే పూజ్యభావం. పూర్తిగా ఆయనకు పుత్రుడను కాలేకపోయేనే అని నావిచారం. మానసికంగానైనా ఆయనఅభిప్రాయాలనూ, చేతలనూ ఆరాధించటం ఆమెకు కంటకప్రాయం. ఇక మాకెల్లా కుదురుతుంది ? అటువంటప్పుడు లక్ష్మికి నాహృదయంలో స్థానం ఇవ్వడంలో తప్పేముంది ?"

—అతని యోచనాచక్రము హృదయ మనే ఇరుసు నాధారంచేసుకొని ఎన్నిరకాలుగాపరిభ్రమిస్తూవచ్చినా అయస్కాంతమువలె చివరకు సూచించే దిక్కులు రెండే—లక్ష్మిని హృదయాధిదేవతను చేయడం, రాజేశ్వరిని విస్మరించటమున్నూ. ఈ రెంటినీ తూచే సందర్భంలో అతని హృదయం ప్రాలేయాచలంమొదలు పరమాణువువరకూ ఉండే పదార్థాలన్నిటినీ తూకపు రాళ్లుగా ఉపయోగించసాగింది.

మంచిచెడ్డల మాట ఎలాగున్నప్పటికీ, అదే పనిగా అజస్రమూ ఆలోచించడంమూలాన్ని రామనారాయణకు తన అభిలాషలో ఎటువంటి దుష్ట ప్రకృతిచ్ఛాయా లేదనిపించింది. క్రమంగా అదే న్యాయ్యమూ, అవలంబనీయమూ అన్నట్టుకూడా తోచింది. అంతేకాదు. తనను నీరసంగా చూసి, నిర్లక్ష్యంచేసి, పుట్టింటికి వెళ్లిపోయిన రాజేశ్వరిని సాధించడానికి అదే ఉత్తమవిధానంగా రూపించింది.

లక్ష్మిని ప్రేమించడంవిషయంలో ఒక నిశ్చయానికి వచ్చినతరువాత రామనారాయణకు తక్కిన పని తానూహించినకంటె ఎన్నోరెట్లు సులువుగా నెరవేరిన ట్లనిపించింది. అనగా లక్ష్మికి తనమీద ఇటీవల కలిగిన గౌరవభావము అంత మహిమాన్వితమయేనా ఉండాలి; లేకపోతే, తనలాగే ఆమెలో కూడా చిననాటి స్నేహం ప్రణయంగా పరిణమించేనా ఉండాలి. ఏది ఎల్లాగయితేనేం ? పుట్టిన ఉద్దేశానికి తుది కనుక్కొగలిగేననీ, కనుక్కొన్న లక్ష్యాన్ని సాధించితీరేననీ అతనిలో కలిగిన ఆనందము అతణ్ణి పారవశ్యవిలీనుణ్ణి చేసింది.

లక్ష్మిరామనారాయణ లిప్పుడు భార్యాభర్తలలాగే ప్రవర్తిస్తున్నారు. అసలు భార్యాభర్తృసంబంధంలో యింత ఆనందముందా అనిపిస్తున్నది హృదయాలు ఏకమయిన వారిద్దరికీ. అంతేకాదు. వారి అన్యోన్యసంబంధము ఎన్నోజన్మలనుండీ, ఎన్నో యుగాలనుండీ అవిచ్ఛిన్నముగా వస్తున్నట్టు వారిరువురికీ ఏదో అంతర్వాణి ప్రబోధించినట్టు తోచింది.

వారికి పరస్పరసాహచర్యంవలన రోజులు గంటలుగానూ, గంటలు క్షణములుగానూ గడిచిపోతున్నాయి. ఆమెను వదిలి ఉండలేక అతడు ఆఫీసుకు మరిఒక నెలరోజులు సెలవుపెట్టేడు. లక్ష్మికి యిదేదో సుఖస్వప్నం కంటున్నట్టు మాత్రమే ఉంది. అంతకాలం వయసుకు తగిన వలపూ, ఉత్సాహమూ లేక, ఒంటరిగా నైరాశ్యంలో కాలం గడిపిన ఆమె

యీరకపుజీవితాన్ని ఒక్కమారుగా నిజమని నమ్మ లేకపోయింది.

అతనికి వెనుక రాజేశ్వరితో కాపురంచేస్తున్నప్పుడు ఈమాత్రం సౌందర్యపిపాసా, ఉత్సాహోద్రేకాలూ లేకపోలేదు. కాని లక్ష్మిలోని సహానుభూతి, ఆత్మీయతాఫలితమయిన అనురాగమూ లేకుండా, అతని కాంక్షాపరిపూర్తికి అడ్డుచెప్పకపోవడాన్నే ఏదో మహత్కార్యంగా భావించేది రాజేశ్వరి. అమాయకదృష్టిలో ఈరకపు భావనకూ, ఆమె పుట్టింటివారి ఆర్థికోన్నతికీ విశేషం సంబంధం కనబడదుగాని ఏస్త్రీ నడిగినాసరే, తప్పేమని చెప్పేస్తుంది అదే అసలుకారణమని. కాగా ఈసందర్భంలో తెలియజేయవలసిన దేమిటంటే—రాజేశ్వరితండ్రి బాగా రాబడి ఉన్న వకీలు. చెల్లెలుమగడు మద్రాసులో నెలకు నాలుగువందలు జీతం తెచ్చే లెక్చెరరు. ఆమె అన్న ఇంజనీరింగు చదువుతున్నాడు. ఈమధ్యనే ఎవరో ఒక జమీందారువంటివారు అతనికి తమ పిల్ల నిస్తామని చెప్పవచ్చేరుకూడానట!!

ఆరకపు వాతావరణంలో పెరిగిన ఆమెకు రామనారాయణ స్టెనోటైపిస్టుపని చేసి తెచ్చే అరవై రూపాయలూ ఎందుకూ చాలనివిగా, ఏమీలేనికంటె ఏకొంచెమో ఎక్కువగా మాత్రమే కనిపించటంలో ఆశ్చర్యమేముంది? కేవలం పుట్టుకవల్లనే ధనికులయిన వారికంటె, శ్రమ పడిపడి జీవితలక్ష్యంగా భావించి ఆర్జించినవారికే ధనముమీద కాపీనమూ, గౌరవమూ కూడా ఎక్కువగా ఉంటాయి ఆరకపు వ్యక్తులతోనే చిన్నతనమునుండీ సంబంధము ఉన్న ఆమె హృదయంలో రామనారాయణకు ఎన్నడూ గౌరవనీయమయిన స్థానం లేదు. కాని తనలోని ప్రప్రథమ సౌందర్యపిపాస చల్లారేవరకూ అతనికి ఆమె తనను ఏరకపు దృష్టితో ! చూస్తున్నది అన్న ప్రసక్తే లేదు. అల్లాటి సమయంలో ఆమె అతని ఉత్సాహవల్లికి ఏమాత్రం దోహదం కల్పించినా అత డామెను వినిశ్చలంగా ప్రేమించేవాడే ; కాని కాలం గడచినా మార్పు లేకుండా, ఎప్పటికీ అతని ఆర్థికస్థితిమీదనే దృష్టినిలిపిన ఆమెను అతడు క్రమంగా ఏవగించుకొనే స్థితిలోనికి వచ్చేడు.

ఇక లక్ష్మి: ఆమెకు ధనమువల్లనే కలిగే సుఖదుఃఖాలు అనుభవపూర్వకంగా తెలియవనే అనాలి. తనకు సరిపడినకంటె ఎక్కువ ఉండీకూడా ఆమె నిన్న మొన్నటివరకూ ఆనందమంటే ఏమిటో తెలియని స్థితిలో ఆరాటపడింది. ఈనా డామె రామనారాయణసాహచర్యంవలన పొందుతున్న ఆనందానికి కూడా అతని ధన మొక ముఖ్యకారణము కాదు. ఆమెలోని ఆనందమల్లా, తనలో అదివరకు అవ్యక్తంగా అణగిఉన్న అభిలాషలకు ఒక ఆకృతిని కల్పించి, వాటి సాఫల్యానికి తోడుపడుతున్న తనకు గౌరవనీయుడైన ఒక వ్యక్తిని ఆనందింపజేయగలుగుతున్నాననే తృప్తివలన కలిగినదే. అదివరకు రాజేశ్వరితో అన్ని సంవత్సరాల సాంసారికజీవితంలోనూ అతనికి అననుభూతమూ, అజ్ఞాతమూ అయిన తన్మయానందగరిమ లక్ష్మి సాహచర్యంమూలంగా ఇంత కొద్ది కాలంలో సంప్రాప్తించడానికి ఆమెలోని యీ సహానుభూతిమంతమయిన సంతృప్తే ముఖ్యకారణము.

“ఇంక నే నెలాగూ నీదాననేకదా బావా! నువ్వు నాకోసం నీ మిగతాపనులన్నీ మానుకొని కూర్చుంటే ఎలాగ?” అన్న ప్రేమపూర్వకమయిన ఆమె సూచనవలన అతడు మళ్లీ ఆఫీసులో ప్రవేశించేడు. ఆఫీసుజీవితం వెనుకటికంటె ఎన్నోరెట్లు అసహ్యంగా ఉన్నా, సంతతదరస్మితాంచితమయిన లక్ష్మి ప్రసన్నవదనదర్శనంతో అతడు పారవశ్యవిలీను డయ్యేవాడు.

అత డామెను రానురాను మరీ గాఢంగా ప్రేమించడానికి తగిన కారణం లేకపోలేదు. ఆమె యిప్పుడు గర్భవతి. తమ అన్యోన్యప్రేమవృక్షపు ప్రప్రథమఫలము ఇక కొద్దిలో అందుబాటులో ఉన్నదన్నప్పుడు పరస్పరప్రేమసూత్రబంధితులయిన ఏ యువతీయువకుల హృదయాలు తన్మయానందలహరీ తరంగమాలికలతో కలిసి నృత్యముచేయవు?

వస్తుందివస్తుం దనుకొంటున్న సరళ ఇంకా రానేలేదు; కాని రమ్మని పిలుపుగాని, వస్తున్నానని సూచనగాని లేకుండానే రాజేశ్వరి హఠాత్తుగా పుట్టింటికి వచ్చింది. ఆ తరువాత రెండునెలలకు సరళ వచ్చింది.

ఈ మారు రాజేశ్వరి వెనుకటివలె "నావికాని ఈ ఇంటి మంచిచెడ్డలతో నాకేమిపని?" అన్నట్టు ఒంటరిగా ఉండడంలేదు. ఇంటిని అలంకరించటంలోనూ, ఇంటికి అయే ఖర్చువెచ్చాలను సరిచూడటంలోనూ, యథేచ్ఛాచారులయిన పనివాళ్లను అదుపు ఆజ్ఞలలో ఉంచడంలోనూ ఆమె అసమానమయిన ప్రతిభను ప్రదర్శించింది. సూక్ష్మంలో చెప్పాలంటే, పుట్టింటిలో యజమానురాలు లేకపోవడంవల్ల ఎంత ఘనము ఖర్చు అయినా ఇంటివారికి సరైన సగుపాయము లేకపోవడము అనే ముఖ్యమయిన లోపాన్ని పూర్తిగా తొలగించిం దనకతప్పదు. రెండురోజులుగా ఆ యింటిలో వున్న దూరపుచుట్టానికికూడా, ఒక్క గంట ఆమె లేకపోతే, ఇంత యిల్లూ శతధా శకలీభూతము కాకతీరదనిపిస్తుంది. ఆమెచాకచక్యము అంతటిది.

సరళ వచ్చిన తరువాత ఆమెతో కాలక్షేపం చేయడంలో రాజేశ్వరి కొంతవరకూ ఇంటి వ్యవహారాన్ని చూడడం తగ్గించినా, అదివరకూ ఆమె ఏర్పరచిన నియమాలప్రకారం సాంసారికచక్రం సక్రమంగానే సంచరించేది.

ఎన్నో వ్యాపృతులతో, బాధ్యతలతో, ఆనంద జనకములయిన ఆందోళనలతో ఆమెకు కాలము అతిత్వరితంగా గడిచిపోతున్నది; కాని, అన్నిటికీ అడుగున, మరిచిపోవడానికి యత్నిస్తున్నకొద్దీ మరీ బలంగా భర్తతో పోట్లాడివచ్చేనన్న స్మృతి ఆమెను కలవరపెట్టసాగింది.

అంతలో సంక్రాంతి వచ్చింది. అదివరకు సంక్రాంతికి రాజేశ్వరీరామనారాయణ లిద్దరూ కలిసే వచ్చేవారు. అతడు పండుగవెళ్లగానే వెళ్లిపోయేవాడు. ఆమె మరొక నెల్లా ట్లుండి వెళ్లేది. ఇదీ అదివరకు అలవాటయిన పద్ధతి. ఈ మారు (ఎలాగూ రాజేశ్వరి ఇక్కడే ఉండికదా అని) అతనిని రమ్మని రాసిన రెండు ఉత్తరాలకూ జవాబే లేదు. ఈనిరుత్తర నిరాగమన వ్యవహారానికి ఇంట్లోవారందరూ తలా ఒక రీతిని వ్యాఖ్యానం చేసేరు. రాజేశ్వరివర్తనం ఎంత గంభీరంగా ఉన్నా ఆమె రావడానికీ, అతడు ఉత్తరమయినా లేకుండా రాకపోడాని వారూహించిన కారణంలో విశేషం దోషంలేదు అనే అనాలి.

రాజేశ్వరిలోని పట్టుదలా, గుంభనమూ మచ్చుకైనా లేవు ఆమెచెల్లెలు సరళలో. ఆమెకంటె రాజేశ్వరి సహజంగా చక్కనిది కాకపోయినా, సమయస్ఫూర్తీ, వాక్చమత్కృతీ, ఆంగికవిన్యాసమూ ఆమె కొక విశిష్టమయిన ఆకర్షకశక్తి నిచ్చేయి.

ఇక, యింట్లోకూడా, రామనారాయణను అతనితోడి అల్లుణ్ణి చూసిన గౌరవభావంతో ఎన్నడూ ఎవ్వరూ చూడకపోయినా, అన్ని విషయాల్లోనూ రాజేశ్వరినే సరళకంటె ఎక్కువగా మన్నించేవారు అందరూను.

కాని యీమారు సరళ వచ్చినతరువాత రాజేశ్వరి ప్రాముఖ్యము రోజురోజూ తగ్గిపోతూవచ్చింది. ఆమె విసుగుకొని తొలగించిన పనిమనుషులు పోయి సరళతో ఫిర్యాదుచేసికొని తమ స్థానాన్ని పునఃప్రతిష్ఠించుకోవడమూ, తండ్రికూడా ఏ కారణంవల్లనో ఆమెమాటనే 'సబబుగా వుందనడమూ రాజేశ్వరికి ఎంతో అవమానజనకము లయేవి. ఈ అవమానకంటకములు ఒకింత స్తబ్ధమయిన స్మృతినాగమును మరింత రెచ్చగొట్టేయి.

ఇక ఊళ్లోని చెలిమికత్తెలుకూడా సగంమంది తన ఉనికినే గ్రహించినట్టు లేదు. చాలామంది సరళను ప్రత్యేకించి ఇళ్లకు ఆహ్వానించి విందులు చేసేరు. బాగుండదేమో అన్న దృష్టితో తననుకూడా కొందరు ఆహ్వానించకపోలేదు. కాని వెళ్లడం తనకు ఏమంత గౌరవప్రదం?

సరళభర్త తనకు రావడానికి వీల్లేదనీ, అందుచేత అవకాశం చూసుకొని, ఎవరినయినా సాయంతీసుకొని రావలసిందనీ రాశాడు. ఆమె వెంటనే ప్రయాణం కట్టింది. తండ్రీ అన్నదమ్ముడే కాదు, ఇంట్లోని దాసీలుసైతమూ బలవంతం చేసి, ఆమెను మరొక పది రోజులు ఉండడానికి ఒప్పించేరు. రాజేశ్వరి కిదేమీ తెలియని సంగతి కాదు. తననుకూడా ఇదివరకు ఇలా బలవంతపెట్టిఉంచడము మామూలే. కాని యీపర్యాయము తన నెవరూ మరొక రోజుకూడా ఎక్కువ ఉండమని కోరటంలేదు. అయినా తాను వెళ్తానంటే కదా తనను ఉండమనడానికీ, అనకపోవడానికీ. తన భర్త తనకోసం తహతహపడుతున్నప్పుడుకదా తనను మరికొంతకాలం ఉండమని బలవంతంచేయడానికి ఇక్కడివారికి వీలు. తానతనికి అక్కరలేకపోయినతర్వాత ఇక్కడివారికీ తన అవసరము లేదు. తప్పనిసరిగా భరిస్తారుగాని

ఇన్నినాళ్లుగా ఆమెలో అణగిఉన్న వేదనావాహినికి నేడానకట్ట తెగిపోయింది. ఆమెకళ్లలో నీళ్లు గిఱ్ఱుమన్నాయి. ఎదుటివస్తువు లేవీ సరిగా కనిపించలేదు. తొందరతొందరగా తన గదిలోని మంచంమీద బోర్లపడి వెక్కివెక్కి ఏడ్వసాగింది ఆమెదుఃఖం తెరలుతెరలుగా వచ్చింది. ఆమె చిన్నతనంలోకూడా ఎన్నడూ అంత నిస్సంకోచంగా ఏడవలేదు. ఆనాడామె ఏడ్పులోకూడా ప్రత్యేకత. ఇదివరకువలె తన దైన్యమునకు ఇతరుల దౌష్ట్యమునుకాక తన తొందరపాటునే కారణముగా భావించగలుగుతున్నది ఆమె. ఆ సందెమసక వెలుగులో ఆరంభించిన ఆమెయేడ్పు తండ్రితో సినీమానుండి వచ్చిన సరళ "ఏమే రాజా! నువ్వింట్లోనే ఉన్నావుటే? అన్నయ్యతో నాటకానికి వెళ్లేవనుకున్నాను." అనేవరకూ అలా నిర్నిరోధంగా సాగిపోతూనే ఉంది.

రాజేశ్వరి ఎంత గంభీరంగా ఉన్నా ఆమె యథార్థస్థితి అదివరకే కొంత అవగాహన అయింది ఆమెచెల్లెలు సరళకు. ఇక మరి ఆ గాంభీర్యముకూడా అవసరంలేకపోయింది. రాజేశ్వరి వేదనను వెలార్చటానికి వీలులేనప్పటి గాంభీర్యములోని క్లేశాన్ని మరి సహించలేకపోయింది.

మునుపు తాను ఏమి మాటాడినా, ఏదో ఒక విధంగా ఎగతాళిచేసి నవ్వడంగాని, నిరుత్సాహంగా ఊరుకోవడంగాని అలవాటయిన రాజేశ్వరి అంటే కొంచెం బెదురుగానే ఉండేది సరళకు. ఆ జంకు తెరను తొలగించుకొందుకు ఆమె సోదరీత్వపు ప్రేమకు బలం చాలకపోయేది. కాని నేడు వారిద్దరిమధ్యను అదివరకున్న తెరలు వాటంతటఅవే తొలగిపోయేయి.

తర్వాత సరళ ఉన్న పదిహేనురోజులూ ఒక్కక్షణమయినా ఒకరినొకరు విడిచిఉండలేదు. తక్కిన ప్రపంచమునుగూర్చిన స్మృతే లేదు వారిద్దరికీ. ఆ కొద్దికాలం ఒకరి కష్టసుఖాలు ఒకరు సానుభూతిమతులై వినడంతో, అపూర్వమయిన అనుబంధమేదో వారిని సరైన అక్కచెల్లెళ్లను చేసింది

సరళ చెప్పిన మాటలవలన ఆమెభర్త ఎంత సౌమ్ము తెస్తూఉన్నా, ఆమె తనకంటె—కాదు తనపాటికూడా - సుఖపడలే దనిపించింది రాజేశ్వరికి. ఔను పాపం. ఏ సరదాలూ లేని రోగగ్రస్తుడయిన భర్తతోడి సంసారంలో ఏమాత్రం ఆనందం ఉంటుంది? తన శరీరానారోగ్యాన్ని ఎఱిగిఎఱిగి పెళ్లిచేసుకున్న అతనిని సరళ ఎలా ప్రేమించగలుగుతున్నదో? తానైతే ప్రేమించలేకపోవడమేకాదు, ద్వేషించేదికూడా. కాని సరళ అతని ఆనందమును మనసా వాంఛిస్తున్నదే! అలాంటి పరిస్థితిలో తాను రామనారాయణప్రేమగౌరవములను తృణీకరించటం ఎంత అవమానకరమయిన సంగతి?

సరళను దిగబెట్టివచ్చిన మర్నాడే తండ్రితో కలిసి బయలుదేరింది రాజేశ్వరి. సరళవలన సూచనగా రాజేశ్వరిపరిస్థితిని విన్న తండ్రి ఆమె కోరడమే తడవుగా బయలుదేరేడు. (సశేషము)

# చరిత్రరచన - సాధనసామగ్రీదుస్థితి



శ్రీ నేలటూరి వెంకటరమణయ్య

భారతఖండమున జరిత్రరచన గడు నర్వాచీనకాలమున నారంభమైనది. సకలశాస్త్రములను, విద్యలను పరిశోధించి గ్రంథములు రచించిన మన పూర్వీకులెలనో చరిత్రరచన దలపెట్టరైరి. సంస్కృతవాఙ్మయమును గాలించి వెదకినను కల్హణవిరచితరాజతరంగిణి తప్ప చరిత్రగ్రంథ మొక్కటియేనియు గానరాదు. రాజతరంగిణియైనను భరతఖండచరిత్రను దెల్పదు; కాశ్మీరదేశము నేలిన రాజవంశముల చరిత్ర మాత్ర మిందు గలదు. మహమ్మదీయుల యాగమనానంతరము చరిత్రరచన యారంభమైనది. చారిత్రదృష్టి వీరియందు గానవచ్చిన ట్లన్యులయందు గానరాదు. వీరి రాజభాషయైన పారసీయందును, మతభాషయైన యరబ్బీయందును పెక్కు చరిత్రగ్రంథములు రచింపబడెను. ఆద్యమున నీచరిత్రకారు లందఱును మహమ్మదీయులేయైనను గాలక్రమమున వీరిచే నుద్బోధితులై హిందువులును జరిత్రరచనకు గడగిరి. ఇప్పటి పరిశోధకులు దమ పరిశోధనగ్రంథముల నాంగ్లభాషయందు రచించున ట్లప్పటివారు పారసీయందే తమ చరిత్రగ్రంథములను రచించిరి. తురకరాజుల యేలుబడియుండునంతకాలము నీగ్రంథములను జదువుటకు విద్యావంతులకు సాధ్యమైనను దురకరాజ్యము పోయిన పిమ్మట నివి మృతప్రాయములైనవి. ఇప్పటివారియందనేకులకు పారసీయరబ్బీభాషలయం దుండు విస్తారచారిత్రకవాఙ్మయ మపరిచితము. కాని మన ప్రాచీన చరిత్రనుగూర్చి దీనివల్ల నేమియు దెలియరాదు. మహమ్మదీయ చరిత్రకారులును, వారి ననుసరించి పారసీయందు తారీఖులను రచియించిన హిందువులును మహమ్మదీయులును మహమ్మదీయరాజుల చరిత్రలను వ్రాసిరేకాని హిందువుల విషయము ప్రస్తావించరైరి. పూర్వమహమ్మదీయ హిందూచరిత్ర వారి కపరిచితమగుటచే వారు తమకు పరిచితమైన మహమ్మదీయ చరిత్రమునే వ్రాసిరని కొందఱు చెప్పవచ్చును. పూర్వమహమ్మదీయయుగమున కిది యొకవేళ చెల్లుబడియైనను మహమ్మదీయులనాటి హిందూరాజ్యముల విషయమై యిట్లని చెప్పుటకు వీలులేదు. ఒకటి రెండుదాహరణము లీయంశమును తెల్లముసేయగలవు. మహమ్మదు కాసిం ఫెరిస్తా యనునతడు తారీఖ్-ఉల్-హింద్ అను చరిత్రగ్రంథమును రచించెను. హిందూదేశమునందలి సర్వమహమ్మదీయసంస్థానములచరిత్రయు నిందు వర్ణింపబడియున్నది; కాని రమారమి మూడు వందలయేండ్ల పర్యంతము వెలసిన విజయనగరసామ్రాజ్యచరిత్ర యిందు కానరాదు. ఫెరిస్తా మహమ్మదీయుడైన కారణమున నతడు హిందూసామ్రాజ్యమైన విజయనగరచరిత్రను వ్రాయక వదలిపెట్టెనని యనుకొందము. హిందూచరిత్రరచయితలయెడ నీసమాధానము చెల్లదు. లక్ష్మీనారాయణ, చంద్రభాను మున్నగువారు వ్రాసిన చరిత్రగ్రంథములయందు గూడ మహమ్మదీయ రాజ్యకథనమే కానవచ్చును. హిందూసంస్థానముల చరిత్ర యెందును గానరాదు. ఇటువంటి లోపము లున్నను మహమ్మదీయయుగమునకు చరిత్రలు గలవు; అప్పటి చరిత్రాంశములు జాలమట్టుకు వీనిమూలమున దెలియవచ్చుచున్నవి. పూర్వ

* ఇది ౨౬-వ ఆంధ్రసారస్వతపరిషత్సమావేశ సందర్భమున చరిత్రపరిశోధకుల సభయందు జదువబడిన యుపన్యాసము.

మహమ్మదీయ యుగమునకు జరిత్రగ్రంథములే లేవు. హిందువుల యేలుబడి క్రింద నేమి జరిగినదో తెలుపు గ్రంథములు ప్రాచీనవిరచితము లెవ్వియు లేవు. చరిత్రగ్రంథములు లేకపోయినంతమాత్రమున భరత ఖండమునకు జరిత్రయే లేదని చెప్పుట తగదు. కాల గర్భమున బూడిపోయిన ప్రాచీనభారతీయ చరిత్ర నుద్ధరించుటకు మార్గము గలదు. చరిత్ర గ్రంథములను వ్రాయక పోయినను మన పెద్దలు చరిత్రరచనకు వలయు సాధనముల ననేకములను మనకు బ్రసాదించియున్నారు. ఈ సాధనముల నన్నిటిని సేకరించి పరిశీలించి చూచినచో బ్రాచీనకాలమున హిందువుల యేలుబడిక్రింద నడచిన చరిత్ర జాలవఱకు వ్యక్తము గాగలదు. సాధనాసంపాదనార్థము దేశసంచారము జేసి, లభించిన చరిత్రసామగ్రిని సమకూర్చుటకును, సమకూర్పబడిన సామగ్రిని శాస్త్రసమ్మత పద్ధతుల ననుసరించి విమర్శించి గ్రంథరచనసేయుటకును చరిత్రపరిశోధన యని పేరు.

## ౨

చరిత్రరచయితలు పైజేర్కొనబడిన చరిత్రసాధనములను నాలుగు తరగతులుగ విభజించియున్నారు. ఇందు మొదటిది పురాతనవాస్తునిచయము. వాస్తు వనగా కట్టడము. పురాతనవాస్తువులు పెక్కు తెఱగు లవి కానవచ్చుచున్నవి. చరిత్రపరిశోధనసౌకర్యమునకై వీనిని పూర్వచారిత్రక, చారిత్రకయుగవాస్తువు లని రెండుతరగతులుగ విభజింపవచ్చును. మానవ చరిత్రయందు లిపియుత్పత్తికి ముందు గడచిపోయిన కాలమునకు బూర్వచారిత్రకయుగ మని పేరు. ఈ యుగము ప్రాచీనతమము; దీనికి జెందిన కట్టడములను పూర్వచారిత్రకయుగ వాస్తువు లందురు; వీనియందు పలువిధములు గలవు. ముఖ్యమైనవానికి రాక్షసగుళ్లని ఆంధ్రులు నామకరణము జేసియున్నారు. అరవలు పాండవగుళ్లందురు; మళయాళమున టోపికల్లని చెప్పుదురు. రాక్షసగుళ్లు ఆంధ్రదేశమున పెక్కుతావులయందు గానవచ్చుచున్నవి. బెజవాడపరిసరప్రదేశములం దనేకము గలవని వినికిడి. 'రాక్షసగుళ్ల'ను పేరునుబట్టి రామాయణాదిప్రాచీనగ్రంథములందు వర్ణింపబడిన రాక్షసులు నిర్మించుకొన్న దేవాలయములను నభిప్రాయము గలుగవచ్చును. కాని ఇవి గుళ్లును గావు; రాక్షసులతో వీనికి సంబంధమును లేదు. రాక్షసగుళ్లను పరిశోధించి చూచిన పురాతనవాస్తుశాస్త్రజ్ఞులందఱును ఇవి సమాధులని నిశ్చయించియున్నారు. ఇట్టి సమాధులను మృతశరీరనిక్షిప్తముకొఱకు ఆర్యుల యాగమనమునకు ముందు మన దేశమందు నివసించుచుండిన ఆదిమజనులు నిర్మించుకొనెడివారని పరిశోధకులు సామాన్యముగ నభిప్రాయపడుచున్నారు. కాని ఇది సంశయగ్రస్తము. ఋగ్వేదమునందును, శతపథబ్రాహ్మణమునందును ఇట్టి సమాధుల వర్ణన గలదు. వీనినిబట్టి యార్యులయందును నిట్టి సమాధులను నిర్మించుకొను నాచార ముండెడిదని తెల్లమగుచున్నది. కావున నీ రాక్షసగుళ్లు సర్వత్ర యనార్యజాతులవారివని నిస్సంశయముగ జెప్పుట సమంజసము గాదు. ఈవిషయ మెట్లున్నను రాక్షసగుళ్లు మన యాదిమయుగచరిత్రను పునరుద్ధరించుట కమూల్యమైన సాధనము లనుట నిస్సందేహము. ఈ రాక్షసగుళ్లను నిర్మించినవారు శవముతో గూడ నా మృతజనుడు జీవదశయందు వాడుకొనుచుండిన యాయుధములను, గొఱముట్లను, బ్రియపదార్థములను, నాహారపదార్థములను, వస్తువాహనభూషణాదులను బూడ్చిపెట్టెడివారు. ఈ యాచార మాధునికచరిత్రపరిశోధకుల కత్యంతోపయుక్తమైనది. రాక్షసగుళ్లయందు నిక్షిప్తమైన వస్తుసముదాయము నాధారముజేసుకొని యప్పటి జనుల నాగరికతను, సంస్కృతిని, మతసాంఘికవార్తికపరిస్థితులను గనుగొనుటకు సాధ్యమైనది. పైజెప్పినట్లు ఆంధ్రదేశమున రాక్షసగుళ్లును, దత్సంబంధమైన యితర వాస్తువిశేషములును పలుతావుల గానవచ్చుచున్నను వాని పరిశోధన ఇంకను ప్రారంభముకాలేదు. అచటనచట కొందఱు కుతూహలాతిశయముచేతను, కీర్తిలాలసతవల్లను రాక్షసగుళ్లను ద్రవ్వి యందు లభ్యమైన

వస్తువులను బయలుపెట్టియున్నారు. వీరికి ఖననవిద్యతోడి పరిచయము లేకపోవుటచేతను, శాస్త్రపద్ధతుల ననుసరించి భూగర్భమును త్రవ్వి పరిశోధించుటకు వీరు క్రమప్రకారము శిక్షితులు గాకపోవుటచేతను వీరి పరిశోధనలు నిష్ఫలములైపోయినవి. పురాతన వస్తుపరిశోధన ధనసహాయము లేక జరుగదు. ఇది సర్కారువారు సాధింపదగిన కార్యము. ఇంతకాలము సర్కారు పురాతనవస్తుపరిశోధనశాఖవారీవిషయమును సంపూర్ణముగ నుపేక్షించియున్నను ఇప్పుడిప్పుడు కన్నులు బులుముకొను సూచనలు గానవచ్చుచున్నవి.

చారిత్రకయుగ వస్తువులు లిపి యేర్పడి వ్రాత రూపకములగు చరిత్రసాధనసంపత్తి గల యుగమునకు జెందినవి: గుహలు, స్తూపములు, దేవాలయములు, కోటలు, ప్రాసాదములు, గృహములు ఈ తరగతికి జేరినవి. గుహలు స్వభావసిద్ధములు, నిర్మితములు నని రెండువిధములు. కొండల యుత్పత్తితో గూడనే యేర్పడినవి స్వభావసిద్ధములు. ఇట్టి గుహ లన్ని పర్వతపంక్తులయందును గలవు. నేజూచిన స్వభావసిద్ధమైన గుహలలో నెల్ల పెద్దది హంపిలోని హేమకూటమునందు గలదు. స్వభావసిద్ధమైన గుహలు సృష్టివైచిత్ర్యమునకు నిదర్శనములైనను చరిత్రకారునకు వానివల్ల ప్రయోజనములేదు; కాని కొన్ని తావులయం దాదిమనివాసులు స్వభావసిద్ధమైన గుహలను నివాసస్థలములుగ నేర్పఱచుకొనియుండిరి. అందు వారుపయోగించిన కొఱముట్లును, ఆయుధములును, ఆహారార్థము వధించిన మృగముల యస్థులును గానవచ్చుచున్నవి. మఱియు నీ గుహాతలముల వారిచే చిత్రింపబడిన పటములును గలవు. ఈపటముల యందు చిత్రింపబడిన దృశ్యములవల్ల వారి జీవన సరణి కొంతవఱకు వ్యక్తపడుచున్నది. కాని ఇట్టి స్వభావసిద్ధమైన గుహలు కాదాచిత్కముగ నెచ్చటనో యొకచోట గానవచ్చుచుండుటచే నవి యంత ముఖ్యములు గావు. వీనికంటె నిర్మితములైన గుహాలే చరిత్రకారున కెక్కువగ నుపయుక్తములు. నిర్మితము లనగా మనుష్యుడు పర్వతతలము దొలచి చేసినవి. ఆంధ్రదేశమున నిర్మితగుహలు పెక్కు గలవు. మిక్కిలి సుప్రసిద్ధమైనవి బెజవాడచెంత మొగలరాజాపురమునను, ఉండవల్లియందును గలవు. నిర్మితగుహలన్నియు సామాన్యముగ మతపోషణార్థము దొలువబడినవి. ఇవి చైత్యాలయములు, విహారములు, దేవాలయములు నని మూడు తరగతులుగ విభజింపబడుచున్నవి. మొదటి రెండును బౌద్ధులవి కడపటిది హిందువులది. ఏతరగతికి జేరినను చరిత్రపరిశోధకుల కివి గడు సహకారులు. మతపోషణార్థము తొలువబడినను వీనివల్ల నప్పటి మతాచారములతో పాటు లలితకళాపరిస్థితులును గొంత వఱకు దెలియవచ్చుచున్నవి. చిత్రకళ ముఖ్యముగ జెప్పదగినది. ఆంధ్రదేశమున నెచటను గానరాకున్నను అనేకస్థలములయం దీగుహాతలములు చిత్రింపబడియున్నవి. అజంతా, ఎల్లోర, బాగ్, బాదామి, చిత్తనవాసిల్ గుహలీసందర్భమున సంస్మరణీయములు. దక్షిణాపథమున మన ప్రాచీనులీచిత్రలేఖనమున నెంత యౌన్నత్యమును వహించిరో తెలుపుట కీగుహలు సాక్షి. కాని కాలము గడచుకొలదియు తగుసంరక్షణ లేక ఇవి మాసిపోవుచున్నవి. మాసిపోనీయక ఈ ప్రాచీన జాతీయచిత్రశాలలను సంరక్షించుట మన సర్కారువిధి. పురాతనవస్తుపరిశోధనకని ప్రత్యేకముగ నొక శాఖ యేర్పడియున్నను బ్రిటిషుహిందూదేశమున వీని సంరక్షణార్థము పేర్కొనదగిన యేర్పాటు లెవ్వియు జేయబడినట్లు గానరాదు. దీనికి ముఖ్యకారణము ఢిల్లీ ఇండియాప్రభుత్వమువారి పిసినిగొట్టుతనము. ధనము వెచ్చపెట్టక కార్యము సాగదు. ఇరుసున గందెన బెట్టక పరమేశ్వరు బండియైన బాఱదట. ఇండియాదొరతనముకారులు సాగునా? వేలకొలది రూప్యముల వేతనములనిచ్చి యధికారులపై నధికారుల నియమించిన నేమి లాభము? చిత్రకళావిశారదులను బిలిపించి, వారికి వలయు సామగ్రుల నిచ్చి, వలయు సౌకర్యములను గలుగజేసి సంరక్షణ కార్యమునకు పురికొల్పినగాని మాసిపోవుచున్న ఈచిత్రములు నిలువవు. ఈ సందర్భమున మన దేశీయసంస్థానాధిపతులకొందఱు ప్రశం

సార్హులు. దక్షిణాపథమున వీరిలో మొదట నెన్నదగినవారు హైదరాబాదు పాలకులు మ. ఘ. వ. నైజాముప్రభువులు. మహారాష్ట్రకర్ణాటమండలములలో గించిద్భాగము వీరి యేలుబడిక్రింద నున్నను వీరిని తెలుగుప్రభువులనియే చెప్పవలయును. రాజధానియగు హైదరాబాదు తెలుంగాణ్యమునకు హృదయమువంటిది. ఆ మాట నటుండనిండు. వీరి పాలన క్రింది దేశము ముప్పాతికవంతు ఆంధ్రమండలములోనిది. జనసంఖ్యనుబట్టి చూచినను వీరి ప్రజలలో నాంధ్రులసంఖ్యయే అధికము. ఈ తెలుగుప్రభువు ప్రాచీన చిత్రకళను నశించి నామమాత్రావశిష్టమైపోనీయక వేలకొలది ద్రవ్యమును వెచ్చపెట్టి స్వదేశజులను, విదేశీయులను చిత్రకళాభిజ్ఞులను రావించి వాని గాపాడుటకు దగునేర్పాటులను గావించెను. వీరి ప్రాచీనవస్తుసంరక్షణాభిరతి కజంతాయెల్లోరాగుహలు ప్రబలనిదర్శనములు. దీని కాంధ్రులమైన మనము గర్వపడవలసినదే. ఇట్లే రాజ్యము చిన్నదైనను, వరుంబడి యపారము గాకున్నను, అరవదేశమున పుదుకోట్టమహారాజులవారు విశేషధనము ఖర్చుచేసి చిత్తనవాసల్ గుహలను కాపాడుచున్నారు. వీరికి గల ప్రాచీనవస్తుసంరక్షణాభిమానము ధనాధిపుల కుండిన నెంతయో మేలు గలుగగలదు.

చిత్రములు లేని గుహ లుపయోగహీనము లని యనుకొనరాదు. చిత్రము లున్నను లేకపోయినను సర్వసామాన్యముగ గుహలన్నిటిలోపలను నద్భుతములగు శిలాబింబములు గలవు. వీనిని సామాన్యముగ శిల్పములని చెప్పుదురు. శిల్ప మను మాట లలితకళల కన్నిటికి జెల్లును. మఱియు నీమాటను రచనాకౌశల మను నర్థమున వాడుటయు గలదు. శిలలను మలిచి వానికి రూపేర్పఱచు విద్యనే శిల్పమని చెప్పుట యుక్తము గాదు. ఈవిషయమును గ్రహించిన మన పెద్దలు శిలలను ఛేదించి రూపుగల్పించు విద్య కొక ప్రత్యేక నామము నేర్పఱచియున్నారు. మలిచిచేయబడిన శిలాబింబములకు గండారములు, లేక గండారపుబొమ్మలని పేరు పెట్టియుండుటచే, దీనిని గండరుశిల్ప విద్యయని వారనుకొనినట్లు తోచుచున్నది. ఈగండరువుల జూచి మన మప్పటి విషయములను దెలిసికొనవచ్చును. అన్నిటికంటె అప్పటి కాసెపనివారి కౌశల్యమును, శిలాఛేదనవిద్యా యౌన్నత్యమును మనకు తెల్లముకాగలదు. అప్పటి కాసెపనివారిని జూచి శిల తన స్వభావసిద్ధమైన కర్కశత్వమును మాని మార్దవము నందినది. వారి చేయి సోకగనే బంకమట్టివలె, మైనమువలె, వెన్నవలె మెత్తనై యేరూపము గమ్మనిన వారి యాజ్ఞను మీరనేరక యారూపమును బొందినది. మహాబలిపురమునకు బొండు; బాదామికి, ఎల్లోరకు, మఱి యాకాలమున దొలువబడిన యేగుహకైనను బొండు. అచటి గండారములసముఖమున నిలుడు. అనిర్వాచ్యమైన సమ్మోహనపూరమున మిమ్ము ముంచి బహిఃప్రపంచమును మరపించి యొక సౌందర్యలోకమునకు గొనిపోయి యానందబ్రహ్మయందు లీనులజేసి తన్మయత్వము జెందించును. అచేతనములయ్యు మీసంగతివల్ల చేతనత్వము నందినట్లును, నచలములయ్యు మిమ్ము గాంచి చలనములై మి మ్మాహ్వానించుట కెదురువచ్చుచుండునట్లును, మూకములయ్యు మీతో నవ్యక్తమధుర వాక్కుల సంభాషించుచుండునట్లును, బధిరములయ్యును మీవాక్యామృతమును ద్రావి యా యానందమును సుందరమందహాసమువలన వెలిబుచ్చుచున్నట్లును దోచగలదు. ఇట్టి గండారపుబొమ్మలు మొన్న మొన్నటిదాకను బెజవాడసమీపమున నుండినవి. ఇవి కడు ప్రాచీనములు. వీనిని క్రీ. శ. ౬-వ శతాబ్దము నా డీప్రాంతముల నేలుచుండిన విష్ణుకుండిమహారాజులు చెక్కించిరని పరిశోధకపండితమహాశయు లభిప్రాయములను వెలిబుచ్చియున్నారు. ఇవి నేడు రూపఱి పోనైపోయినవి. ఆంధ్రుల దురదృష్టమువలన-చెప్పిన కోపము వచ్చునేమో. నిజముగుటచే జెప్పకతప్పదు-బెజవాడపౌరశ్రేష్ఠులకు వానిని బాగుచేయవలయునను బుద్ధి పుట్టినది; వారి కోరిక ప్రకారము కార్యము సాగించవచ్చునని యుత్తరువు ప్రసాదించుట కప్పటి సర్కారుపురాతన వస్తుపరిశోధన శాఖాధ్యక్షునకు సమ్మతమైనది. ఫలితము-చెప్పుటకు

నోరాడదు- ఈ యమూల్యమైన ప్రాచీనగండార ప్రదర్శనశాల నాశనమైనది. నిజమే, ఇప్పుడును శిలాబింబము లచట గలవు. కాని వాని ప్రాచీనత కలలోని వార్త యైనది. ఆ శిల్పాచార్యుల విద్యా వైభవము, ప్రతిమల సౌందర్యము, పనితనము సొంపు మంట-కాదు, కాదు, సిమెంట- గలసిపోయినవి. ప్రస్తుత మచ్చట గల ప్రతిమల వికారరూపములను, నంగ వైకల్యము, లింగాంతరీకరణములను గాంచిన నేపురాతన వస్తుపరిశోధకుని హృదయము రగులుకొనిపోదు? బెజవాడ యాంధ్రదేశములోని ప్రాచీనతమపురములలో నొకటి. విష్ణుకుండిప్రభువుల కాలమునుండియు బ్రఖ్యాతి వహించినది. పూర్వచాళుక్యులకు రాజధాని. ఇందు ప్రాచీనాంధ్రనాగరికతావశిష్టము లనేకములు గలవు; ఆంధ్రుల పూర్వచరిత్రను రచించుట ముఖ్యసాధకము లగును. కావున బెజవాడపురజనులకు చరిత్రపరిశోధకుల పక్షమున నా వేడికోలిది: "అయ్యలారా, మీ పురమందు గల పూర్వనాగరీకచిహ్నములు బాగుసేయ దలపెట్టకుడు. వాని బాగుసేయు మార్గము మీకు దెలియదు. పురాతనవస్తు సంచయమును జెడిపోనీయక గాపాడవలయు నను మీ కోరిక ప్రశంసనీయమైనదే. వాని గాపాడవలయు నను కోరిక దృఢమైనదేని, వాని సంరక్షించు మార్గము నెఱిగిన వారిని రప్పించి వారి యాజమాన్యము క్రింద కార్యము నడపింపుడు. అప్పు డొక చరిత్రపరిశోధకులకే కాక సకలాంధ్ర ప్రపంచమునకును మహోపకార మొనర్చిన వారగుదురు".

స్తూపములు:—స్తూపము అనగా మట్టి మొదలగు వాని దిబ్బయని శబ్దరత్నాకరకారు లర్థము జెప్పియున్నారు. ఈమాట కిదియే మొదటి యర్థమైనను బౌద్ధవాస్తు విశేషమున కీపేరు రూఢియైనది. సుప్రసిద్ధ చరిత్రపరిశోధకులు శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మ గారు స్తూపస్వభావము నిట్లు వివరించియున్నారు: "బౌద్ధవాస్తువున ఇటికతోనో, రాతితోనో కట్టిన అర్ధగోళాకారమువంటి ఘననిర్మాణమునకే స్తూప మను పేరు రూఢియగుటవలన దిబ్బయైన దెల్ల స్తూపము కాజాలదు. ఈ నిర్మాణము బౌద్ధమతము వాస్తువునకు బ్రసాదించిన విశేషము." మృతశరీరావశేషములపై నిర్మింపబడిన కట్టడములకే స్తూప మను పేరు అన్వయమగును. బౌద్ధులు బుద్ధునియొక్కయు, నతని యనుయాయులలో ప్రముఖులయొక్కయు శరీరావశేషములను భూస్థాపితము గావించి వానిపై నీస్తూపములను నిర్మించి యర్చించుట యాచారము. క్రీస్తు శకమున కించుకపూర్వమును, దరువాతను ఆంధ్రదేశమున బౌద్ధమతము ప్రబలి జనసామాన్యము బౌద్ధధర్మము నవలంబించుటచేత దేశమంతటను స్తూపములును, వీనితోగూడ చైత్యాలయములు, సంఘారామములును నిర్మింపబడినవి. కాలక్రమమున బౌద్ధమతము నశించి హిందూధర్మము మరల తలయెత్తి మతద్వేషకారణమునను, అన్యకారణములవల్లను బౌద్ధవాస్తువులు రూపడిపోయినను వాని యవశిష్టములు దేశమందంతటను గానవచ్చుచున్నవి. ఇట్టి యవశిష్టములు గల తావులను గొన్నింటిని పేర్కొనియెదను. చిరకాలమునుండి చరిత్రపరిశోధకులకును, కళావిమర్శకులకును పరిచితమైనది అమరావతి స్తూపము. ఇందలి చెక్కడపుబని చక్కదనమును, శిలాబింబముల సౌందర్యాతిశయమును జగద్విఖ్యాతము. ప్రాచీనాంధ్రుల శిల్పనైపుణ్యము నివి వేనోళ్ల జాటును. ఇటీవల బయల్పడినవి నాగార్జునునికొండ సంఘారామాదులు. శిల్పదృష్టిని జూచిన నివి యమరావతికి దీసిపోవు. ఇందలి కళ జీవకళ. శిల్పి రాతికి సర్వాంగసుందరమైన రూపొసగి, నిజహృదయాంతర్గతభావము నందు లగ్నముగావించి, యూపిరిపోసి యొక మాయా ప్రపంచమును గల్పించినాడు. అమరావతిశిల్పములు పరహస్తగతమైనవి. కొన్ని యింగ్లాండున, కొన్ని యరవదేశమున నున్నవి. నాగార్జునునికొండ శిల్పములుగూడ పరదేశయాత్రసేయ నుంకించుచున్నవి. వానిని బోనీక నిలబెట్టవలసిన భార మాంధ్రమహాజనులపై నున్నది. ఘంటశాల, భట్టిప్రోలు స్తూపములు ప్రాచీనతరములు. ఇవి మౌర్యయుగమునకు జెందినవని కొందఱి యభిప్రాయము. అజ్ఞాతములైన స్తూపము లనేకస్థలములందు గలవు. వీనిని వెదకి యానవాలు

పెట్టి త్రవ్వి యందలి విశేషవస్తువులను బయలు పెట్ట వలసిన పని సర్కారువారు చేయదగినదే కాని సామాన్యులకు సాధ్యముగాదు. కాని వారీవిషయమున నింతవఱకు జేసిన ఘనకార్య మెద్దియు గానరాదు. పురాతనవస్తుపరిశోధకశాఖవారికి దక్షిణదేశముపై సవతితల్లి ...మ. ఇక నాంధ్రదేశముమాట చెప్పవలయునా? ...రావతి, నాగార్జునికొండల మాట జెప్పవత్తురేమో. ... బుద్ధిపూర్వకముగ నీశాఖవారు పూనుకొన్న ...ర్యములు గావు. ఎవ్వరో జమీందారు గృహ...ర్మాణసామగ్రికై యమరావతిస్తూపమును బడగొట్టి ...డుచేయుచుండ కర్ణాకర్ణిగ విని సర్కారుద్యోగస్థ...ప్తపడి జమీందారుని కడకను మాన్పి యచట గానవచ్చిన చెక్కడపుశిలల పనితనమునకును, గండారపు ...మ్మల చక్కదనమునకును మెచ్చుకొని పరిశోధనకు ...డగిరి. గజదొంగ యని పేరువడసిన పరాసుదొర యొకడు ఆంధ్రదేశమునంతటను సంచరించి నాగార్జునికొండను గుర్తించి యందలి యద్భుతశిలాప్రతిమ...ను దస్కరించుకొనిపోవుచున్నాడని విని పోయి యచట త్రవ్వనారంభించిరి. ఇచటనైనను సంపూర్ణముగ పని ముగియలేదు. వీరి పద్ధతి తిరుపతిమంగలవాని పద్ధతి యైనది. నాగార్జునికొండలో పని సంపూర్తిచేయుటకు డబ్బు లేదట. పనిసాగించుటకు డబ్బులేనప్పుడు వేలకొలది మాసజీతముల నిచ్చి తెల్ల దొరలను, సీమదొరలను రప్పించుట యేలనో? అమరావతి స్తూపము చెంత నాస్తూపనిర్మాతలగు నాంధ్రసాతవాహనుల రాజధానియగు ధాన్యకటకము వెలసెను. ఆస్థలమును త్రవ్వి పరిశోధించిచూచిన సాతవాహనులనాటి యాంధ్రదేశస్థితిగతులు దెలియగలవు. ఈయుద్దేశము సర్కారుపురాతనవస్తుపరిశోధనశాఖవారికి దోచినట్లే కానరాదు. పురాతనచారిత్రకస్థలము లీదక్షిణదేశమునం దెన్నిలేవు? కళింగనగరము, రాజమహేంద్రవరము, వెంగి, బెజవాడ, కొండవీడు, హంపి, వల్లూరు, గండికోట, చంద్రగిరి, కంచి, మహాబలిపురము, కావేరిపూంబట్టణము, తంజావూరు, ఒరైయూరు, తిరుచినాపల్లి, కన్ననూరుకుప్పము, మధుర మొదలైనవెన్నియో కలవు. ఒకచోటనైన సర్కారుపురాతనవస్తుపరిశోధనశాఖవారు పారెడు మట్టిని త్రవ్విరా? లేదు. వారి కట్టి యుద్దేశ ముండునట్లే తోచదు. ఈ పురాతనస్థలములక్రింద పూడియుండు మన పూర్వచరిత్రను బయటికి దెచ్చుట యెట్లు? ఆంధ్రలోకమంతయు నేకగ్రీవముగ సర్కారువారిని మందలించవలయును. అమ్మరైయైన నడగనిది పెట్టదను సామెత నిరర్థకము గాదు.

దేవాలయములు:— దేవాలయములు స్తూపములంతటి ప్రాచీనములుగావు. అనాదిగ హిందువులు దేవాలయములను నిర్మించుచువచ్చినను, దక్షిణదేశమున నిప్పుడు గానవచ్చెడి దేవాలయములన్నియు క్రీ. శ. ౬-వ శతాబ్దమునకు దరువాతివే. తత్పూర్వము నిర్మింపబడిన దేవాలయములు మచ్చున కొక్కటేనియు గానరావు. స్తూపములకంటె నివి యర్వాచీనములైనను చారిత్రకదృష్టియందు తుల్యములే. బౌద్ధయుగచరిత్రరచన కవి సాధనములైన దరువాతి హిందూయుగచరిత్రరచన కివి సాధనములు. ఇవి హిందూజాతీయజీవనమునకు కేంద్రస్థానములు; ప్రజాప్రభుత్వసంస్థలు; కళానిలయములు. వీని యాకారమువల్లను, వీనియందు సామాన్యముగ గానవచ్చు శిలాప్రతిమాదుల రచనావిశేషమువల్లను జరిత్రయందు ముఖ్యాంశము లనేకములు దెలియుచున్నవి. పెక్కు ప్రాచీనదేవాలయములయందు చిత్రములు గలవు. అన్నిటియందును శాసనములు గలవు. వీనిమూలమున నప్పటి మత సాంఘిక ఆర్థికపరిస్థితులును, రాజకీయవిషయములును జక్కగ దెలియుచున్నవి. కావున మన దేవాలయములు ప్రాచీనవస్తుభాండారములు. ఖిలపడిపోనీయక వీనిని సంరక్షించుట మనవిధి.

కోటలు:—ప్రాతకోటలు మన దేశమునం దెల్లయెడల గానవచ్చుచున్నవి. అనుకూలమైన తావులలో వీనిని విఱగబొడిచి యందలి రాళ్లను గృహనిర్మాణార్థము గొనిపోవుట మనవారికి సహజమైపోయినది. ఇది స్వార్థమునుగోరి యజ్ఞానమువల్ల జేయుపని. చరిత్రయతిశయము



# అదనం పొదుపు

-యుద్ధం ముగియడానికి!
-శాంతి రావడానికి!

మితవ్యయంలో
కొరతను
జయించు




ఈ రోజులలో చాలావస్తువులు కొరతగా వున్నాయి. సప్లయిల మీద ఒత్తిడి ఎక్కువగావుంది. మీరు వాడుకొనేదానిని తగ్గించుకుంటేగాని పేదవారు తమకు రావలసిన భాగాన్ని పొందలేరు. అన్నివస్తువులను మీరు సాధ్యమైనంతగా వాడకం తగ్గించడం దేశభక్తితో కూడిన పనికూడ కాగలదు.

డబ్బువిషయంలో కూడా పొదుపు చాలామంచిది. ప్రతినిత్యం పొదుపువల్లకొంత అదాచేస్తే, మిగిల్చితే, నెలఆఖరయ్యేసరికే చాలా డబ్బునిలవ అవుతుంది. శాంతియేర్పడిన తరువాత, ధరలు తగ్గగానే, ఈ డబ్బుతో ఇంకా ఎక్కువగా ఖర్చు చేసుకోగలరు.



















# సాధ్యమైనంతవరకు ఏదికొనవద్దు.

ఇండియా ప్రభుత్వపు సమాచారం, బ్రాడ్ కాస్టింగు శాఖవారి ప్రకటన






ఇప్పుడు అతడు అనేక విషయములను నేర్చుకొంటున్నాడు, గాని లైఫ్ బాయి ప్రతిరోజు వాడటంవల్ల కలిగే వుపయోగము మరి యే యితర విషాయాల్లోను పొందడు. వాని తల్లి నేర్పిన పాఠమువలన "మురికివలని అపాయము" నుండి అతడు కాపాడబడుటచే ఆమె గర్వపడుచు సుఖించ వచ్చును. — యే మాత్రము శ్రద్ధవహించక పోయినను మురికి వలని అపాయము ఎదుర్కొనుటకు సిద్ధముగా వుంటుంది.

**లైఫ్‌బాయ్ మంచి సబ్బుల్లోకి ఉత్తమమైనది**

**ఇది మంచి అలవాటు**

77-23 TL

LEVER BROTHERS (INDIA) LIMITED

నెఱుగని జను లట్లు చేయుచున్నారు. దేశసంరక్షణ కును, శత్రువులను బ్రతిఘటించి యుద్ధము సేయుటకును పూర్వకాలమున మనవా రెట్టి యేర్పాటులను జేయు చుండిరో వీనిమూలమున జాలవఱకు దెల్లమగును; విజయనగరము, పెనుగొండ, గండికోట, కొండవీడు, కొండపల్లి, యోరుగల్లు, గోలకొండ మొదలగు దుర్గము లను గాంచినవారికి వీని ప్రాముఖ్యత స్పష్టము కాగలదు. అత్యంతప్రాచీనములగు ప్రాసాదములుగాని, గృహ ములుగాని యనేకములు గానరావు. అచటనచట గొన్ని కానవచ్చుచున్నను నవి శిథిలావస్థయం దున్నవి. బాగు చేయదొడగి కొన్నిచోట్ల సర్కారు పి. డబ్ల్యు. డి. శాఖవారు వీనిరూపును చెడగొట్టియున్నారు; సర్కారు వారు కొన్ని ప్రాచీనమందిరములను కచేరీలుగ మార్చి చరిత్ర కెంతయో నష్టము గలుగజేసియున్నారు. మధుర యందు తిరుమలనాయకుని నగరు, తంజాపురమునందలి నాయకుల ప్రాసాదములు, పెనుగొండయందలి కృష్ణ రాయని గగనమహలు, చెన్నపురిలోని యార్కాటు నవాబుకలశమహలు దీని కుదాహరణములు. ఇవి రూపు చెడక యుండిన విజయనగరరాయలు, దాక్షిణాత్యాంధ్ర నాయకులు, ఆర్కాటు నేలిన మహమ్మదీయప్రభు వులు దమ యంతఃపురములయం దెట్లు ప్రవర్తించు చుండిరో తెలిసికొనుట కవకాశ ముండెడిది.

## 3

ఇంతవఱకును బురాతనవాస్తునిచయ మెట్లు చరిత్రరచనకు దోడ్పడునో విన్నవించితిని. తరువాత చెప్పదగినవి శాసనములు. ఇవి ద్వివిధములు: లౌహిక ములు, శైలికములు నని. హేమాదిలోహములపై జెక్క బడిన శాసనములకు లౌహికములని పేరు. సర్వసాధా రణముగ దానశాసనములను తామ్రపట్టికల మీద నే చెక్కుట యాచారము; కాని కాదాచిత్కముగ బంగారువెండిరేకులపై జెక్కిన శాసనములును గాన వచ్చుచున్నవి. మఱియు ఢిల్లీయం దొక పెద్ద ఇనుపస్తంభముపై జెక్కిన శాసన మొకటి కలదు. శిలలపై జెక్కబడిన శాసనములు శైలికము లన బడును. రత్నములపై జెక్కిన నామాక్షరాదు లచట నచట గానవచ్చుచున్నవి. ఇట్టి శిలాలేఖనములు గూడ శైలికములని జేర్కొనదగియున్నను సాధారణ ముగ నీపేరు సామాన్యశిలలపై జెక్కబడిన శాసనములకే చెల్లుచున్నది. శైలికములకంటె లౌహికశాసనసంఖ్య యత్యల్పము. కాని పల్లవకదంబగాంగచాళుక్యాది ప్రాచీనదాక్షిణాత్య రాజవంశముల చరిత్రలన్నియు ముఖ్యముగ లౌహికశాసనములమీదనే యాధారపడి యున్నవి. చరిత్రపరిశోధకులును, మదరాసుసర్కారు శాసన పరిశోధనశాఖవారును పెక్కింటిని సంపాదించి ప్రకటించియున్నారు. లౌహికశాసనముల విషయమై ఇచట చెప్పదగిన ముఖ్యాంశములు రెండు కలవు. మొదటిది సంపాదితశాసనసంరక్షణార్థమై సర్కారు పురాతనవస్తు పరిశోధకశాఖవా రవలంబించిన పద్ధతిని గురించి. మొన్న మొన్నటివఱకు దక్షిణదేశమున లభ్యమైన లౌహికశాసనముల నన్నిటిని మదరాసు సర్కారు వస్తుప్రదర్శనశాలవారిచే క్రయమునకు గొనిపించి యందే పదిలపఱచునట్లు సేయువారు. ఇది సమంజసమైన పద్ధతియే. నేటివఱకును దక్షిణదేశమున కంతటికిని అది రాజకీయకేంద్రస్థానముగ నున్నది. దాక్షిణాత్యసంస్కృతికి గూడ నది కేంద్రమనుట యొప్పదగిన విషయమే. అరవలు, తెలుగులు, కన్నడులు, కేరళులు మున్నగు దాక్షిణాత్యజాతుల వారికి జెన్నపురి కూడలి. అంతర్జాతికూటమునకును, దన్మూలమున నన్యోన్య భావపరిగ్రహమునకును నిది యనుకూలమైన తావు. కావున మదరాసున నీ ప్రాచీన దాక్షిణాత్య చారిత్రోపకరణములను భద్రపఱచుట యందఱికి ననుకూలమే; కాని ఇటీవల నీసర్కారు పురాతనవస్తు పరిశోధనశాఖవారి కేలనో కలకత్తాలోని భారతీయ వస్తుప్రదర్శనశాలపై గాఢానురాగ ముదయించినది. ఎచటనేనియు నొక తామ్రపట్టిక లభించెనని తెలిసినంతటనే దక్షిణమండల పురాతనవస్తు పరిశోధనశాఖాధ్యక్షుడుగాని, లేక దక్షిణమండలశాసన పరిశోధన శాఖాధ్యక్షుడుగాని, లేక ఇరువురు గాని కలకత్తా భారతీయ వస్తుప్రదర్శనశాల పక్షమున కొను

గోలుచేసి యచటికి రసానాసేయుటకు సదుపాయములను వెదుకనారంభించుచున్నారు. ఇది గర్హ్యము. రెండవది జనసామాన్యము వీనియెడ నవలంబించు దుష్ప్రవర్తన. తామ్రపట్టికలపై నుల్లేఖింపబడి యుండుటచే నివి యంత్రము లనియు, భూగర్భమున నిక్షిప్తమైన ధనమును గనిపెట్టు రహస్యమిందుగ్రథితమై యున్నదనియు జనసామాన్యముయొక్క విశ్వాసము. కావున లౌహికశాసన మెద్దియేనియు హస్తగతమైనపుడు దానివిషయ మెఱిగినవారిచే జదివించి యందలి గ్రంథవిశేషములను నలుగురికి దెలియనీయక దాచుచున్నారు. మఱికొంద ఱజ్ఞానులు వచ్చినవఱకే లాభమని యెంచి రేకులను గరిగించి లోహమును విక్రయించి యల్పలాభము నందుచున్నారు. పెక్కు అమూల్యములైన తామ్రశాసనము లింకను ఆంధ్ర లోకమున డాగియున్నవని పరిశోధకు లందఱు నెఱుగుదురు; పెక్కు కంసాలివాని కుంపటియందగ్నిప్రవేశము జేసి రూపాంతరము నంది చెంబులు, తపెలలు, తట్టలు మొదలైన పాత్రలుగ మారిపోయినవి. ఈ ప్రవర్తనవల్ల నాంధ్రచరిత్ర కెంతటి నష్టము గలిగెనో చింతింపుడు. కావున ఈ లౌహికశాసనములు ప్రాచీనాంధ్రచరిత్ర పునర్నిర్మాణమున నమూల్య సాధనములని గ్రహించి వానిని నాశముగానీయకుండ కాపాడవలసిన దని యాంధ్రచారిత్రకుల పక్షమున వేడుకొనుచున్నాను.

శైలికములు:—వీని సంఖ్య వేనవేలు. దక్షిణ హిందూదేశమున గనీస మొక్క శిలాశాసనమేనియు లేని గ్రామముగాని, పల్లెగాని గానవచ్చుట యరుదు. ప్రసిద్ధ దేవాలయములు గల తావులయందు వేలకొలది గానవచ్చుచున్నవి. దక్షిణహిందూదేశమున గానవచ్చునన్ని శిలాశాసనము లీప్రపంచమున మఱి యేదేశమునను గానరావు. ప్రాచీనులు చరిత్రను వ్రాయకపోయినను, ఈ శాసనముల నాధారపఱచుకొని యశోకచక్రవర్తి కాలమునుండియు క్రీ. శ. ౧౭-వ శతాబ్దిమధ్య తురక లాక్రమించునంతవఱకు నవిచ్ఛిన్నముగ దక్షిణహిందూ దేశచరిత్రను వ్రాయవచ్చును; కాని యా కార్యమంత సులభముగ నెరవేరునది కాదు. దాని రములు పెక్కు గలవు. దక్షిణాపథమునంతటిని పర్యటనము గావించి లభించిన శాసనముల కన్నిటికిని ప్రతిబింబములు తీసి శాసనగ్రంథములను తయారుసేయుట ప్రథమకర్తవ్యము. ఇది యొంటరులు సేయగూడిన కార్యము గాదు. ఇతరసంగతుల నటుండనిచ్చి యపారమైన ధనము వెచ్చపెట్టక కార్యము జరుగదు. కావున ఈకార్యము సర్కారువంటి జాతీయసంస్థలే పూనుకొనవలసియున్నది. ఇటువంటి దొకటి మన దేశమున లేకపోలేదు. భారతీయపురాతనవస్తుపరిశోధన శాఖకు భారతీయశాసనపరిశోధనశాఖ యను నుపశాఖ యొకటి కలదు. ప్రత్యేకముగ శాసనపరిశోధనకొఱకే ఇది యేర్పడినది. దీనికి ప్రత్యేక మొక యధ్యక్షుడును, నుపాధ్యక్షులు నుండిరి. మొదటమొదట వీరు ప్రశంసాపాత్రమైన కృషి చేసి దాదాపు ముప్పదివేలకు మించిన శిలాశాసనములకు బ్రతిబింబములను దీయించిరి; కొన్నివేల శాసనముల గ్రంథములను బరిష్కరించి ప్రకటించిరి; కాని—

"ఏనాటి యగ్రహారమొ
యానాటికి ఖండ్రిగాయె నది యెట్లన్నన్
మానాడు మాన్యమాయెను
నానాటికి దీసికట్లు నాగంభట్లూ."

అన్నరీతిని ఇండియాగవర్నమెంటువారి కేంద్రీకరణమంత్రమాహాత్మ్యమువల్ల రానురాను ఈ యుపశాఖబలమును, దానితోపాటు కృషియు సన్నగిల్లుచున్నది. నామకార్థ మొక యధ్యక్షుడున్నను అతనికీయుపశాఖతో నేలాటి ప్రత్యక్షసంబంధమున్నట్లు తోచదు. అతడు ఢిల్లీలోనుండగా నతని స్థానమున గవరన్మెంటు ఎపిగ్రాఫిస్టుగ రెండు సంవత్సరములు రావుబహదూరు సి. ఆర్. కె. చార్లుగారు పనిచేసిరి. వీరిని వెనుకకు నెట్టి పంజాబీలు, బంగాళీలు, మరాటీలు దొరకకపోగా తుదకు ఉపకారవేతనము బుచ్చుకొనబోవునప్పుడు ఈ పదవినిచ్చినను ఈ యల్పకాలమున వీరొనర్చిన కృషి ప్రశంసాపాత్రము. వీరు ఉపకారవేతనము బుచ్చుకొని యుద్యోగ

ముసు విరమించుకొనినపిమ్మట వీరి స్థానమున మఱె యెవ్వరింకను నియమింపబడలేదు. ఈ యుదాసీనత క్రిందియంతస్తుల యుద్యోగస్థుల నియోగమునందును గానవచ్చుచున్నది. దక్షిణదేశమున శిలాశాసనములు తెనుగుతమిళకన్నడభాషలయందు గలవు. ఈ మూడుభాషలకు నాద్యమునుండి సహాయశాసనసంశోధకుల నేర్పాటుసేయుటయందు సమానప్రాముఖ్యత జూపుచుండిరి. ఇటీవల నీపద్ధతియందుగూడ మార్పు గానవచ్చుచున్నది. ఈశాఖయందేలనో కర్ణాటకుల ప్రాబల్యము హెచ్చినది. అసిస్టెంటుసూపరింటెండెంటుతోగూడ కర్ణాటకులు ముగ్గురు; అరవలిద్దరు; తెనుగువాడొకడు. శాసనములందు దేశవైశాల్యమునుబట్టి చూచిన నీవైపరీత్యమింకను స్పష్టముగ దెలియగలదు. చెన్నరాజధానిలో నీశాఖవారిక్రింద నుండు కన్నడజిల్లాలు ౧౩/౪ — దక్షిణకన్నడము, బళ్లారిలో సగము, అనంతపురములో కాలుభాగము. ఈ జిల్లాలలో నుండు శాసనములలో నధికభాగమున కింతకుపూర్వమే ప్రతిబింబములు దీయబడినవి. ఇంకొక విశేషము. బొంబాయిరాజధానిలో గల కన్నడ జిల్లాల కన్నిటికిని కన్నడ రిసర్చి ఇన్‌స్టిట్యూటని ప్రత్యేకముగ నొక పరిశోధక సంస్థను స్థాపించి దాని కొక శాసనపరిశోధకుని డైరెక్టరుగ నియమించియున్నారు. మఱి ౧౩ జిల్లాల యరవదేశముపై దిరిగి శాసనములను వెదకి ప్రతిబింబములను దీయుటకిద్దఱు. ౧౧ తెనుగుజిల్లాలకొక్కడు. ఈ ౨౪ జిల్లాలలోను ఏకొన్నింటనో తప్ప శాసనసంశోధన సంపూర్ణముగ జరుగలేదు. దీనికి దోడు ఒకరివెనుక నొకరినిగ పంజాబీలను, బంగాళీలను భారతీయశాసనపరిశోధనశాఖకు సర్వాధికారులనుగ నియమించనారంభించిరి. శాసనపరిశోధన శాఖకు సర్వాధికారిగ దాక్షిణాత్యులనే నియమించుట యుక్తము, సమంజసముగూడ. ఏలన, ఈ విస్తారభరతఖండమున వర్షవర్షమును శోధించి ప్రతిబింబములను దీయించు శాసనములలో నూటికి తొంబదియెనిమిది దక్షిణదేశమునందే లభించుచున్నవి. ఉత్తర హిందూస్థానమున లభించు నొక్క శాసనమునకు బ్రతిగ దక్షిణహిందూదేశమున వేయి లభించుచున్నవి. ఈ శాసనములు పై జెప్పినట్లు తెనుగు తమిళ కన్నడ భాషలయందు వ్రాయబడియున్నవి. వీనిని యథామాతృకముగ జదువుటకును, బరిష్కరించి ప్రచురించుటకును, అర్థము నిర్వచించుటకును నీ భాషలయందు పాండిత్య మవసరము. ఇంతేకాదు. శాసనోక్తచరిత్రాంశములను గ్రహించుటకు దక్షిణదేశభాషల వాఙ్మయముతోడి పరిచయము, దక్షిణదేశచరిత్రజ్ఞానమును నత్యంతావశ్యకము. ఉత్తర హిందూస్థానవాసులయందీగుణములు గానరావు. కావున దాక్షిణాత్యశాసనపరిశోధన కధ్యక్షులుగ వీరిని నియమించుట యుక్తము గాదు. ఈ కారణములవల్ల మన శాసనపరిశోధన నిరభ్యంతరముగ సాగుట లేదు. ఇంకొక విషయము నిచట స్మరించవలసియున్నది. అరవదేశమువలెగాక ఆంధ్రకర్ణాటదేశములొక యేలుబడిక్రింద లేవు. ఆంధ్రదేశము మదరాసు, మైసూరు, హైదరాబాదు, ఒరిస్సా, మధ్యపరగణాల పాలనక్రిందను, కర్ణాటకము మదరాసు, బొంబాయి, మైసూరు, హైదరాబాదుపాలనక్రిందను ఖండఖండములుగా విభజింపబడియున్నవి. ఇందు కొంత బ్రిటిషు ప్రభుత్వము క్రిందను, మఱికొంత స్వదేశసంస్థానాధిపతుల యేలుబడిక్రిందను నున్నది. మదరాసు, మైసూరు రాజ్యములవారు శాసనపరిశోధనయందు జూపిన శ్రద్ధ ప్రశంసనీయము. ఇప్పటి పురాతనవస్తు పరిశోధనశాఖాధ్యక్షులు శాసనపరిశోధనశాఖను విస్మరించియున్నను వీరి పూర్వీకుల కాలమున జాలపని జరిగినది. మైసూరు రాజ్యమున గల శాసనములన్నియు బ్రకటింపబడినవి. అఖిలభారతశాసనసభలోని కర్ణాట ప్రతినిధుల నిరంతర కృషికి ఫలముగ బొంబాయి రాజధానిలోని కర్ణాటక మండలశాసనములకు బ్రతిబింబములు దీయించి ప్రకటించుటకు దగు యత్నములు సేయబడి కార్యము నడచుచున్నది. మన ప్రతినిధులుగూడ నఖిలభారత శాసనసభయందుగలరు 'ఖోజ్జామగడు ఇంటిలోనున్నను దండులోనున్నను నొక్కటే' యను లోకోక్తి వీరి ప్రాతినిధ్యమువల్ల సార్థకమైనది. హిందూశాసనముల విషయమై హైద

రాబాదుసర్కారువారు గడు నుదాసీనులైయున్నారు. హిందూశాసనములకు ప్రతిబింబములు దీయించి వానిని బ్రకటించనేలేదని చెప్పలేదు. వీరు ప్రకటించిన శాసనములనన్నిటిని లెక్కవేసిచూచిన కాకతీయ శాసనములు ౭౦, ఇతరశాసనములు దాదాపు ౧౦. మొత్తము నూటికితక్కువ. ఇది కడు శోచనీయమైన విషయము. హైదరాబాదురాజ్యము ప్రాచీనాంధ్రకర్ణాటసామ్రాజ్యములకు హృదయమువంటిది. సాతవాహన చాళుక్య రాష్ట్రకూట యాదవ కాకతీయ సామ్రాజ్యముల కిది పుట్టినిల్లు. ప్రతిష్ఠానమాన్యఖేట కల్యాణఏకశిలానగరాది ప్రాచీనాంధ్రకర్ణాటరాజధాను లిందణగియున్నవి. వేలకొలది కాకున్నను వందలకొలది శాసనము లీ రాజ్యమునందు గలవు. దేశాభివృద్ధియే పరమాశయముగ గల మహోదారస్వభావులైన మ. ఘ. వ. నైజాము ప్రభువరేణ్యులీశాసనములకన్నిటికిని ప్రతిబింబములు దీయించి యచిరకాలముననే ప్రకటించుటకు దగు నేర్పాటులనుగావించి చరిత్రపరిశోధకులకు బ్రసాదించిన వీరి కీర్తిలత మఱింత వికసించగలదు.

మధ్యపరగణాలలోని బస్తరుసంస్థానమునందును, ఇతర తెలుగు జిల్లాలయందును పెక్కు తెనుగు, కన్నడ శాసనములు గలవు. వీనిని బరిశోధించుట కెట్టి ప్రయత్నమును జరిగినట్లు కానరాదు. దక్షిణదేశచరిత్ర రచనకు శాసనసంశోధన యత్యంతావశ్యకము. ఎంత శీఘ్రముగ నీకార్యము ముగిసిన నంతసంపూర్ణముగ మన చరిత్రను రచియించుటకు సాధ్యమగును.

తరువాతిది వాఙ్మయము. వాఙ్మయము చరిత్ర రచన కెంతవఱకు సహకారియగునో మొదట విచారించవలసియున్నది. ఆంధ్రమున పరంపరగ వచ్చు వంశచరిత్రలు కొన్ని గలవు. ఇందు పద్యకావ్యములు కొన్ని, వచనములు కొన్ని. వెలుగోటివారి వంశావళి, రామరాజీయము, ఔకురాజచరిత్ర, తొండమాన్ వంశావళి మొదలయినవి పద్యకావ్యములు. శూరపురుషుల సాహసకార్యములను వర్ణించు గని తిమ్మానాయని సీసమాలికలు, కస్తూరికంగప్ప సీసమాలికలు, యాచమనాయకుని సీసమాలికలును నీతరగతికి జేరవలసినవి. ప్రతాపచరిత్ర, తంజావూ రాంధ్రరాజుల చరిత్ర వచనములు. రాయవాచక మీతరగతికి జేరినది. ఇదిగాక సాధారణమైన ఆంధ్రకావ్యములయం దమూల్యమైన చరిత్రాంశములు గలవు. అవతారికలును, నాశ్వాసాద్యంతములు నెట్లు చరిత్ర రచయితల కుపయుక్తములో పరిశోధకులందఱు నెఱిగిన విషయమే. కాని వీనియందే కాక తక్కిన గ్రంథ భాగములయందును చరిత్రాంశము లణగియున్నవి. సాధారణముగ నివి రాజవంశములకును, యుద్ధములకును సంబంధించినవి కావు. కావ్యకర్తలు తమ రచనలయందు అనుభవసిద్ధములైన సాంఘికార్థికవిషయములను చేర్చియున్నారు. "గోవధము సేయు తురకల దైవంబవు" "ఇగురుకై జీతంపు పెక్కుటీలు" "పూదేనెగాసపునల్ల ప్రజ" "కమలాకరముపాళెము పట్టు" "కొలంపుపేరి సుంకరి యంబరమున బొడిచిన ముద్ర" ఇత్యాదు లెన్నియో కలవు. క్రీ. శ. ౧౪-వ శతాబ్దమున విరచింపబడిన గ్రంథము లప్పటి రాజకీయమత సాంఘికార్థికపరిస్థితుల నెఱుగనివారికి దుర్గ్రాహ్యములు. మచ్చున కొక్క పద్యము:

సీ. "అఖిలసీమాయాలమైన దుర్గమ్ము లు
  మ్మలికెలు గల కమ్మవెలమదొరలు
చేతికై దేసివేల్ శివరాయల వరాల
  నెలకట్టడీల పటానీ ల్గరీబు
లూళ్లాయముల మీద హూరవుత్తరువుగొన్న
  రాయకై జీతంబురాచవారు
పగటిగాసంబు దప్పక యుండ దినసరో
  జుమదిను నొంటరిజోదుమూక
మొదలుగాగల బారుల మొనకు నిలిపి
పొడిచి పేర్వాడి విధులొనర్పంగ జేసి
గాసిగావించి యరుల జేవాసి యెదుట
జూపె యిలరేడుమూడు మెచ్చులును మెచ్చ."

ఇట్టి పద్యములు ఆయుగప్రబంధములయందు త్రవ్వితండములు. విజయనగరసామ్రాజ్యమున వ్యవహారమునందుండిన రాజకీయ మతసాంఘికార్థిక పరిస్థితులు వీనియందు ప్రతిబింబితమైయున్నవి. పెనుదాహృతమైన పద్యము కాకమానిమూర్తిచే విరచితమైన రాజవాహనవిజయములోనిది; ఇందలి యితివృత్తము కేవలము కల్పితము. కథానాయకుడెప్పుడో బహుకాలమునకు ముందుండినవాడని కవి చెప్పియున్నాడు. అతడు తన కొలువునందుండిన పటానీలకును, గరీబులకును క్రీ. శ. ౧౬-వ శతాబ్దపు టుత్తరార్థమున విజయనగరసామ్రాజ్యమును పాలించిన సదాశివరాయలపేర ముద్రింపించిన వరాలను జీవితమొసగెనట!

లభ్యమగు నాంధ్రగ్రంథములనెల్ల జాగరూకతతో బఠించి యందలి చరిత్రాంశముల నెల్ల సమకూర్చి దేశకాలానుసారముగ విభజించితిమేని జీవకళతోడి జాతీయచరిత్రను వ్రాయుటకు సాధ్యమగును. ఆంధ్రచరిత్రరచయితల కత్యంతోపయుక్తమైన సాధన మింకొకటి కలదు. పూర్వకాలమున నాంగ్లేయు లీదేశము నాక్రమించుటకుముందు ఆంధ్రదేశమున గ్రామగ్రామమున నొక కవిలె యుండునది. గ్రామకరణము దీనికి కర్త. కవిలె యనగా గ్రామములోని భూస్వామ్యమునుగురించియు, పన్ను పర్యాయములను గురించియు కరణము వ్రాసెడిలెక్క. ఏయేభూము లెప్పు డేసందర్భమున నెవ్వరికి లభ్యమైనదియు, గ్రామవ్యవహారములు, దేశాధికారులతో గ్రామస్థులకు గల సంబంధమును, గ్రామస్థుల సుఖదుఃఖములును నందు నమోదై యుండెడివి. కరణీకులు తరతరములుగ నీకవిలెను సంరక్షించుచువచ్చినందున క్రమక్రమముగ నివి పెరిగి గ్రంథరూపము నందినవి. ఈ కవిలెలమూలమున గ్రామచరిత్రములును, దేశచరిత్రము కొంతవఱకు దెలియవచ్చుచున్నవి. ఇప్పు డీకవిలెలన్నియు నశించిపోయినను ఆంధ్రుల యదృష్టమువల్ల సుమారు నూటయేబదియేండ్లక్రింద కర్నల్ కాలెన్ మెకంజీయను మహాత్ముడు గ్రామగ్రామమునకును దన గుమాస్తాల నంపి యందుండు శాసనములకును, కవిలెలకును నకళ్లు వ్రాయించి కైఫీయతులను తయారుచేయించెను. ఇతడు వ్రాయించిన నకళ్లన్నియు నిపుడు మదరాసుప్రభుత్వమువారి ప్రాచ్యలిఖితపుస్తకభాండాగారమున పదిలపఱచబడియున్నవి. కాలగతివల్ల నిప్పటికే శిథిలమై కొంత చెడినవి. సంపూర్ణముగ జెడకముందే వీనిని ముద్రింపించి ప్రకటించుట యుక్తము. ధనవ్యయము లేక యీపని సాగదు. సామాన్యుల కిది సాధ్యముగాదు. ఆంధ్రవిశ్వవిద్యాలయమువంటి జాతీయసంస్థ లీకార్యమునకు బూనుకొనవలయును. కాని యిప్పటి పారుపత్యముక్రింద ఈకార్యమును వారు సేయదలపెట్టుదు రను నాశలేదు. ఆంధ్రుల నాగరికతను, సంస్కృతిని బోషించు నుద్దేశముతో నీవిశ్వవిద్యాలయము స్థాపింపబడినను వీరికి చరిత్రపరిశోధన మృగ్యమైనది. ఆంధ్రుల చరిత్రమాట చెప్పవలయునా?

నాణెములు:— పూర్వరచనకు నాణెము లొక సాధనమని యందఱు నొప్పుకొనిన విషయమే. వీని మూలమున ఇతరఆధారములవల్ల దెలియని విషయములను దెలుసుకొనవచ్చును. ఒక యుదాహరణము. ద్రావిడదేశమున యజ్ఞశ్రీశాతకర్ణి యను సాతవాహనవంశజుని నాణెములు కొన్ని కాన్పించినవి. వీనిపై నొకప్రక్క రెండు తెరచాపలు గల యోడప్రతిబింబము ముద్రింపబడి యున్నది. ఈనాణెములవల్ల సాతవాహనుల నాడు ఆంధ్రుల యేలుబడి దక్షిణమున కొల్లడమువఱకు వ్యాపించెననియు, నాంధ్రప్రజలు ద్వీపాంతరములకు రాకపోకలు సాగించుచు నోడవ్యాపారము సేయుచుండిరనియు దెలియవచ్చుచున్నది. ఆంధ్రదేశమున పూర్వవంశజుల నాణ్యములు విశేషముగ లభించలేదు. దొరకినవానిని ధనలోభముచే గరగించి చరిత్రకు తీరని నష్టము గలుగజేయుచున్నారు. కొన్నియేండ్లక్రింద బెజవాడప్రాంతవాసియగు నొక వైశ్యశ్రేష్ఠి దనకు లభించిన సాతవాహనుల వెండినాణ్యముల ననేకములను బ్రాహ్మీశాసనములతోడి వెండిముద్దలను గొన్నింటిని మదరాసున దక్షిణహిందూదేశపురాతనవస్తుపరిశోధనసంఘసమావేశములో బ్రదర్శించెను; తరువాత నవి

యేమాయెనో తెలియదు. కంసాలిమూసబడి కరగి రూపుమాసిపోయిన వని తలచెదను. ఇట్టి పురాతననాణెములు దొరకినపుడు లాభమున కాసపడక ఏ వస్తుప్రదర్శనశాలయందో పదిలపఱచిన ఆంధ్రచరిత్రపునర్నిర్మాణమున కెంతయో సాహాయ్యముగ నుండును.

ఇంతవఱకు మన పూర్వచరిత్రపునర్నిర్మాణమునం దుపయుక్తమగు ప్రధానసాధనము లెవ్వియో యథాశక్తి వివరించితిని. ఇక నీ సాధనముల నాధారపఱచుకొని యాంధ్రదేశమున చరిత్రపరిశోధన యెంతమాత్రము నడచినదో సంగ్రహముగ సూచించి విరమించెదను. చరిత్రపరిశోధన యాంధ్రదేశమున షుమారు నూఱేండ్లక్రిందట . ప్రారంభింపబడినది. కీర్తికాయులు కావలి వెంకటబొఱ్ఱయ్య, రామస్వాముల సహాయమున సర్వేయరుజనరలు కర్నలు కాలిన్ మెకంజీ దొరగా రీయాంధ్రచరిత్రమహాలయమునకు శంకుస్థాపన గావించిరి. బుక్కపట్టణము రాఘవాచార్యులవారు ప్లాను తయారుగావించిరి. వీరేశలింగముపంతులుగారు రచనాపద్ధతుల నేర్పఱచిరి; వీరభద్రరాయ లక్ష్మణరాయాదులు నిర్మాణకార్యమును ప్రారంభించిరి; సోమశేఖరశర్మగారు శాస్త్రసమ్మతమైన శిల్పమార్గమున కార్యసాగురీతిని కట్టుబాట్లు గావించిరి. పునర్నిర్మాణకార్య మవిచ్ఛిన్నముగ సాగుచున్నది. ఆంధ్రదేశము నాలుగు చెఱగులనుండి కళావిశారదులైన చరిత్రకారులు సంసిద్ధులైయున్నను, వీరి నందఱ సమకూర్చి కార్యము కొనసాగింపజాలు నాయకు లెవ్వరును గానరారు. సర్కారువారికి మనమీద సవతితల్లిప్రేమ. ఆంధ్రవిశ్వవిద్యాలయము నేతిబీరకాయ. ధనవంతులకు జాతీయ పురోవృద్ధిపై దృష్టి పాఱదు. ఇక నీ కార్యము నడచుటెట్లు?



# కంపెనీప్రభుత్వంనాటి ఆంధ్రదేశపు రెవిన్యూవిధానాలు

= శ్రీ అజ్జరపు వెంకటరమణరావు =

కొత్తగా దేశంలో అధికారంలోకి వచ్చిన ఇంగ్లీషు వర్తకసంఘంవారి ఆధిపత్యాన్ని ఆంధ్రదేశపు జమీందారులు అంగీకరించినా రెవిన్యూపరిపాలన యావత్తూ వీరి చేతుల్లోనే వుండిపోయింది. అది తమ స్వాధీనం చేసికొని యీ ప్రజలతోగాని, పరిస్థితులతోగాని పరిచయం లేని పరాయిప్రభుత్వం తమంతటతామే వ్యవహారాలను సమర్థతతో నిర్వహించుకొనే సావకాశాలులేక, తాత్కాలికంగా ఆనాడములలో వున్న విధానాలనే అనుసరించడం వుత్తమం అనుకొంది.

రాజమండ్రి పరగణామటుకు ఇదివరకు నైజాముప్రభుత్వంలో వున్నతోద్యోగి అయిన హుస్సేనుఆలీఖానుకు క్రీ. శ. ౧౭౬౬ నుంచి ౧౭౬౯ వరకు కౌలు యిచ్చారు. ౧౭౬౯ నుంచి కంపెనీవర్తక కేంద్రాలలోని వర్తకసంఘసభ్యులనూ, వారి సలహాదారులనూ యీ రెవెన్యూవిషయాలనుకూడా చూడవలసిందని వారి ప్రభుత్వం నియమించారు. ౧౭౬౯లో మచిలీపట్నంఓడరేవులోని తమ వర్తకకేంద్రం అధికారంకింద కొండపల్లి, ఏలూరు, రాజమండ్రి పరగణాలను అప్పగించారు. ఈలోపుగా వారి ప్రభుత్వం నియమించిన సర్క్యూట్ కమిటీసభ్యులు ౧౭౭౩ నుంచి ౧౭౭౭ వరకూ తెలుగుదేశం యావత్తూ పర్యటనంచేసి పంటలనుగురించి, ప్రజలనుగురించి, పరిశ్రమలు, వర్తకం, జమీందారులు, వారి సిబ్బందీ, వారి రెవెన్యూపరిపాలనావిధానాలు, వారి హవేలీలు, హక్కులు, వారి ఆధ్వర్యం పుట్టుపూర్వోత్తరాలు, వారు వసూలుచేసే సొమ్ముల మొత్తాలు, టికి ప్రాతిపదికమయిన సూత్రాలు—యీ యావద్విషయాలనుగురించీ తమకు సాధ్యమయినన్ని విషయాలను సేకరించి ప్రచురించారు.

ఈసర్క్యూట్ కమిటీసభ్యులు అందిచ్చిన పరిస్థితుల జాబితా కేవలం జమీందారులు, గ్రామకరణాలు, తదితరగ్రామీణులు యిచ్చిన సముజాయిషీనాధారంచేసికొన్నదేగనుక అందులో మనవారికేవిధంగానైనా ప్రమాదం వస్తుందని తోచే ఏవిషయాలయినా వుంటే వాటిని మరుగుపరచి తక్కిన విషయాలనే వారికి తెలియజేశారు. అందులో జమీందారుల పూర్వోత్తరాలు ఏమిటి? వీరెవరు ? వీరి అధికారం యొక్క తత్వమేమిటి ? వీరీనాడు చలాయించే అధికారానికి పునాదులయిన హక్కులు ఏనాటివి ? అనే విషయాలనుగురించి యీకమిటీ జమీందారులు యిచ్చిన అభిప్రాయాలమీదనే తన అభిప్రాయాలను చెప్పుకోవలసివచ్చిన పరిస్థితులుగనుక, విదేశప్రభుత్వానికి ఎంతవరకూ యీపరగణాల సంగతులు అర్థమయినాయి, అవడానికి తగిన సావకాశాలు ఏమివున్నాయి అన్నవిషయం మనం గ్రహించాలి.

మన దేశంలో తురుష్కప్రభుత్వాల ఆధిపత్యం ఉచ్ఛదశలోవున్న కాలంలోనయినా జమీందారులే రెవెన్యూఉద్యోగులు. వీరు మోతుబరీ కలిగి, తమ చుట్టుపక్కలలో పలుకుబడి వున్న ఘరానామనుష్యులు

గనుక పరిసరాలలో వున్న భూముల సాగుబడీ, పాడి పంటలూ చూస్తూ, పంటలమొత్తాన్ని, విలువను ఏటేటా సరిచూస్తూ, హెచ్చుతగ్గులను సర్దిస్తూ పన్నులలో రైతులకు యథాతథంగా తగిన పరిష్కారానికి సాయంచేస్తూ, వారిలో వచ్చే తగాదాలను తీరుస్తూ, వారికి అవసరమయినపుడు సేద్యానికి కావలసిన సొమ్ము బాకీయిప్పిస్తూ, వారిచ్చిన పన్నులను ప్రభుత్వానికి వారి తరపున చెల్లిస్తూ ప్రభుత్వం పన్నులలో యిచ్చే కొంతభాగాన్ని, యిళ్లపన్నులమీద వచ్చే ఆదాయంలో కొంత భాగాన్నీ పుచ్చుకుంటూ, యివిగాక పన్నులు లేని మాన్యాలను అనుభవిస్తూవుండేవారు. వీరి కీమాన్యాలు గాక, యీ పై సుంకాలలోనుంచే కమీషను నూటికి పదిపాలు ముట్టేది. వీరు ప్రభుత్వాధికారంసాహాయంతో ప్రభుత్వంతరఫున పనిచేసే రెవెన్యూఉద్యోగులేగాని భూమిలో అధికారం కలిగి రైతులమీద సర్వాధికారం వహింపగలిగే భూస్వాములుమటుకు కారు. రైతుకు భూమిలో సహజంగా వుండే హక్కు అతనిదే. కులక్రమాగతంగా పన్నులు వసూలుచేసే యీవుద్యోగం చేస్తోన్నంతమాత్రంలో వారికి రైతాంగంమీద ఏవిధమయిన యితరఅధికారమూ లేదు.

కాని ఇంగ్లాండుదేశంలోని భూముల సాగుబడి, భూస్వాముల అధికారం, భూమిలో హక్కులేక భూస్వాములు ఏనాడు పొమ్మంటే ఆనాడు పోవలసివచ్చే రైతుజనం పరిస్థితులతోటి పరిచయం ఉన్న పరాయిప్రభుత్వంవారికీదేశంలో భూస్వాముల కున్న పలుకుబడీ, పెద్దతనం వున్న మన జమీందారులను చూడగానే మన దేశపు భూమిపరిస్థితులు తమ దేశంలోలాంటివే అని పొరపాటుపడింది. ఈపొరబాట్లే, యీ అనాలోచితపు నిరాధారపు నమ్మకలే మన దేశపు రెవెన్యూవిధానానికి పునాదులయి విపరీతమయిన విపత్తును తెచ్చిపెట్టాయి.

“తెలంగాణపు జమీందారులు ఇంగ్లాండుదేశంలోని ప్రభువులవలెనే తమ భూములమీద అన్నివిధాలయిన హక్కులూ కలిగిన స్వతంత్రప్రభువులు. మన దేశంలో వున్న భూస్వాములలాగే వీరూ అధికారంలో వున్న ప్రభుత్వానికి కొంత సుంకం కట్టి, స్వతంత్రంతో జీవిస్తున్నారు” అని వీరినిగురించి కొత్తగా వచ్చిన వర్తకసంఘంవారింటికి వ్రాశారు. మచిలీపట్నంఓడరేవులో స్థిరపడి, అటూ యిటూ వున్న పరగణాల రెవిన్యూవిధానాలను సరిచూడవలసిన వర్తకసంఘాధ్యక్షుడికీ, 'సలహాదార్లకూ యీవిధానం అంతే అర్థమయింది. “ఈ జమీందారులంటే మన ఫ్యూడలుభూస్వాములవంటి పెద్దలు అంటే సరిపోతుంది. ఈ రాజులు ప్రభుత్వానికి కొంత కప్పం కట్టి యుద్ధసమయంలో సైన్యాలను పంపడం తప్ప యిరికే విధంగానూ రాజ్యాధికారానికి బాధ్యులు గారు” అనే యీ వర్తకసంఘసభ్యుల కానాడు నమ్మకం.

భూమిమీదా, సముద్రంమీదుగానూ జరిగే వ్యాపారంపై విధించే వర్తకసుంకాలు, పొగాకు, తమలపాకులు, గంజాయి, సారా, గూడాకు, భంగు, నల్లమందు, చెక్కలు మొదలయిన దినుసులపయిన సాలీనా విధించే పన్నులు, ఎగుమతి దిగుమతిపన్నులు యిన్నింటిలోనూ జమీందారులకు భాగా లుండేవి.

ఇక రెవెన్యూవిధానం ప్రకారం పంటలో ఆరవవంతు మటుకే రైతుకు మిగిలేది. జమీందారులు వారికిష్టమయినవారికి, వారికి యిష్టంవచ్చిన విధంగా భూములను కవులూకదపాల కిస్తున్నారు. ధనరూపకంగా శిస్తు చెల్లించాలని నిర్ణయించినా పంట బాగా పండితే పంటనే యిమ్మని నిర్బంధించేవారు. పంట పోతే శిస్తు యిచ్చేదాకా నూటికి నెలకు నాలుగు, లేక అయిదు రూపాయిలు వడ్డీ చెల్లించమనేవారు. మంచి భూములు తమకిష్టమయినవారికి యిచ్చి పేద రైతులను తమ కుటుంబాలతో, పశువులతో, పనిముట్లతో సాయంచేయమని నిర్బంధించేవారు. రైతులకు యింతమోపయిన భూమిపన్నే గాక, యింకా ధాన్యంమీద, వుప్పుమీద, పశువులమీదా ప్రతి నాలుగయిదు మైళ్లకు సుంకాలు చెల్లించుకోవలసి వచ్చేది. చౌకీలు లెఖ్ఖలేకుండా పెరిగిపోయినాయి; దానధర్మాలకని ఒక కొత్తరకం పన్ను వసూలుచేయడం

ఆరంభించారు. వీటితో ప్రజాసామాన్యజీవితం మరీ దుర్భరమయిపోయింది. ఇన్నిగాక, జమీందారులకు మామూళ్లు అని వేరే వసూలుచేయించేవారు. రైతులకు యీనిర్బంధాలను గురించి మొరపెట్టుకుంటే వినే ప్రభుత్వం లేదు; ఇదివరకు ప్రభుత్వాలవలె యీ జమీందారులు తిరగబడిననాడు వారిని శిక్షించి అధి కారంలో వుంచగలిగిన ప్రభుత్వం కాదు కంపెనీ. అందుచేత యీరైతుల దురవస్థకు ఆనాడు విమోచన ఏమీ కనిపించలేదు.

గ్రామోద్యోగులు రెవెన్యూ విధానంలోని అన్యాయాలను అడ్డుకొని, ఆ పరిస్థితుల నభివృద్ధిచేయ డంలేదు గాని, అధికారంపోయిన పరిస్థితులలో తమకున్న పలుకుబడిని ఉపయోగించుకొని, స్వలాభం కోసం ఎన్ని పాడుపనులయినా చేయడానికి వెనుకంజ వేయడం లేదు. కొంతమంది ఎన్నో భూములను కలిపి వేసికొని చిన్న చిన్న జమీందార్లు అయిపోయారు. గ్రామలెక్కలు వారిదగ్గరనే వున్నాయి. వారే రెవెన్యూ వసూలుదారులు. ఇంక వారికి సాధ్యంకానివి యే మున్నాయి? ఇదివరకు ప్రభుత్వాధికారం బలవత్తర మయిన రోజుల్లో ప్రభువులు దేవాలయాలకనీ, సత్రములకనీ, బాటసారుల పోషణార్థమనీ కొన్ని గ్రామాలనూ, బ్రాహ్మణులకు కొన్ని అగ్రహారాలనూ కొన్ని పన్నులు లేకుండానూ, కొన్ని తక్కువ పన్నులకూ దానపట్టాలు వ్రాసి యిచ్చారు. వీరితోపాటే గ్రామోద్యోగులకూ, కరణాలకూ, గ్రామనౌకర్లకూ, గ్రామావసరాలకు పనికివచ్చే కొంతమంది పాటక జనానికీ కొన్ని యీనాములను యిచ్చారు. వీటన్నిటి సంఖ్యా యీకాలంలో హద్దుపద్దులు లేకుండా అమాం తంగా పెరిగిపోవడం ప్రారంభించింది.

ఈ పరిస్థితులకు పరిష్కారంగా సర్క్యూట్ కమిటీ కొన్ని సూచనలను చేసింది: (i) ఈరెవెన్యూ విధానాన్ని తణిఖీచేయడానికి కొన్ని హవేలీ భూముల లోనూ, జమీందారీలలోనూ తెనుగు రెవెన్యూ నౌకరులపైన ఇంగ్లీషు సూపరువైజరులను నియమించ మంది. (ii) అంచనామీద శిస్తులు నిర్ణయించేస్తుంటే రైతులకు మోసం తగులుతుంది గనుక ఆవిధానం ఆపాలంది. (iii) సర్వేవిధానం అమలుపరచి, పంటలో కొంత భాగాన్ని అయినా, లేక దాని విలువనయినా నిర్ణయించి ప్రభుత్వం పుచ్చుకోవాలంది. (iv) భూము లను ఏటేటా వేలంవేసే విధానాన్ని మానుకోవాలని సలహాయిచ్చింది. (v) నాలుగయిదు పరగణాలు కలిపి ఒక్కొక్క తెనుగు మేనేజరుకు ఒప్పగించి, యీ మేనేజర్లను ఇంగ్లీషు సూపర్వైజర్లవద్ద తాబేదారులు గా ఉంచాలంది. (vi) రైతులు యివ్వవలసిన పన్ను, పంటలూ, వారికీ ప్రభుత్వానికీ రావలసిన భాగాలూ కౌలులోనే స్పష్టీకరించాలంది. (vii) అన్యాయంగా, ఆధారం లేకుండా అమలుజరుగుతోన్న అనేక రక మయిన వర్తకసుంకాలను రద్దుచేయాలంది. (viii) ఇవన్నీ అయిన తరువాత న్యాయమయిన సూత్రాల ప్రకారం ఒక శాశ్వతపన్నువిధానం అమలు జరపాలని అంది.

శాశ్వత పన్ను చట్టం అమలుజరపాలంటేగాని, యితర మార్పులను చేయాలని తలుచుకుంటేగాని ఏ విధంగానూ సరియయిన సంగతులు మనకు తెలియక పోవడం గొప్ప యిబ్బంది అని యింటివద్ద వారి ప్రభుత్వంవా రన్నారు. ఈజమీందారులను అధికారం లోనుంచి తొలగించి, వారి సిబ్బందిలను మానిపించి, వారి కోటలను కూల్చి, వారి నధీనంలోకి తెచ్చుకో వాలన్నారు సర్క్యూట్ కమిటీ. ఇది సాధ్యంకాదని అధికారంలో వున్న వర్తక సంఘసభ్యులు అన్నారు. అప్పుడు బంగాళాదేశంలోలాగే యిక్కడా క్రీ. శ. ౧౭౮౬ నుంచి రెవెన్యూబోర్డు నొకటి స్థాపించి రెవెన్యూ సంబంధమయిన యావద్విషయాలకూ బాధ్యత వహించమన్నారు.

క్రీ.శ. ౧౭౮౭లో ఓరమ్ (Oram) అనే ఇంగ్లీషు సూపరువైజరు యీనాటి రెవెన్యూ విధానంలో వున్న లోపాలనూ, వాటికి తను సూచించే పరిష్కారాలనూ తన ప్రభుత్వానికి తెలియజేశాడు. ఒక కంపెనీ ఉద్యోగిని తెనుగురెవెన్యూ ఉద్యోగులమీద అజమాయి

షీకి పంపా లన్నాడు. భూమి కొలతలు, పంట మక్తాలూ, ప్రభుత్వభాగం, సైన్యభాగం, భూముల శిస్తురిమిషనులు యీవిషయాలన్నీ ఇదివరకు కౌనంగో లాగే యిప్పటి సూపరువైజర్లు చూచుకోవా లన్నాడు. శిస్తులనుమటుకు యథావిధిగా యిదివరకులాగే వర్తక కేంద్రాలలోని సంఘాధ్యక్షులకే వెల్లిస్తే బాగుంటుందని తన అభిప్రాయం అన్నాడు.

క్రీ. శ. ౧౭౯౪ సం. దాకా యీవర్తకసభ్యుల సలహాసంఘాలు ప్రభుత్వాధికారంతో పరిచయం లేకుండానే గడపగలిగినా, అప్పటినుంచీ ప్రభుత్వాధికారంకిందకి చేరుకున్నాయి. లార్డు హోబర్టు గవర్నరు అవడంతోటే యీ వర్తకసంఘాధ్యక్ష పదవులకూ, వారి సలహాదారులకూ అధికారం చలాయించమన్న కాలానికి స్వస్తిచెప్పించాడు. కాని జమీందారుల అధికారంమటుకు ఏమీ వాసితగ్గలేదు. వారి సిబ్బందీ దళాల సంఖ్య పలచబడలేదు. ఈ ఖర్చులకు యిచ్చుకోవలసిన పన్నుల భారంతో ప్రజలు ఘూర్ణిల్లిపోతున్నారు. ఇంతవరకు అధికారంలో వున్న వర్తక సంఘాధ్యక్షులకే రెవెన్యూపరిపాలన పేరిట యీజమీందారుల కలవాటయిన ఘోరప్రవర్తనవిషయమే తెలియదు. వారికి వర్తకవ్యాపారవిషయాలలోని లావాదేవీలుతప్ప రెవిన్యూపరిపాలనగురించిన సంగతులేవీ అర్థంకావు. అందుచేత రెవిన్యూవిధానం ఏవిధంగా వుండాలి అనే సమస్యను తేల్చవలసివచ్చింది. క్రీ. శ. ౧౭౭౮ సం.లో సర్ థామస్ రంబోల్డు జమీందారులనందరినీ తనతో సంప్రతించి తమతమ పేష్కషు విషయం పరిష్కారంచేసికోవడానికి మదరాసు రమ్మని కబురుపంపాడు. అంతవరకూ ప్రయాణం చేయడానికి బత్తెఖర్చులకు డబ్బులేదని జమీందారులు ఆందోళనచేస్తే వినేవా రెవరున్నారు! ౧౭౮౩ నుంచి ౧౭౮౮ వరకు రంబోల్డు వీరందరితోటీ వారివారి భూముల శిస్తులు నిర్ణయించాడు. మామూలుజమాబందీ పైన నూటికి ౧౨౦ పాళ్లు అదనం యీపద్ధతిప్రకారం రైతుకు కట్టాడు; వారిపన్నులు చెల్లించుకోలేక పోయారు, బకాయీలుపడడం ప్రారంభించినాయి.

౧౭౮౩ లో సర్క్యూట్ కమిటీ తన నివేదికను తయారుచేసి, ప్రభుత్వాని కప్పగించింది. క్రీ. శ. ౧౭౮౩ నుంచి ౧౭౮౬ దాకా సంవత్సరంవారీశిస్తులు ఏర్పాటుఅయినాయి. ఈమార్పు మంచికోసమే వచ్చినట్లనిపించింది. బకాయీలుతీరడం ఆరంభమయింది. ఈసారి క్రీ. శ. ౧౭౮౬ నుంచి ౧౭౮౯ వరకూ కవులు కదపాలను నిర్ణయించారు. ఇవి అవగానే యింకోసారి ౧౭౮౯ నుంచి ౧౭౯౪ వరకూ యింకోఅయిదేళ్లకు కలిపి ఒక్క సారిగా భూమిశిస్తులను వ్రాయించారు.

ఇక హవేలీభూముల పన్నువిధానం పరిశీలిస్తే, వాటి దుస్థితి మరీ అన్యాయంగా వుంది. రంబోల్డు చికాకోలు, మచిలీపట్నం హవేలీలకు క్ర. శ. ౧౭౭౭ నుంచి ౧౭౮౭ వరకూ పదిఏండ్లదాకా స్థిరమయిన శిస్తువిధానం ఏర్పరిచాడు. పంటలో చెరిపాలు ప్రభుత్వమూ, ప్రజలూ పంచుకొంటున్నారు. ప్రభుత్వానికీ ప్రజలకూ కూడా యీవిధానంవల్ల ఎన్నో రకాలయిన అనర్థాలు సంభవించాయి. ఈ అవస్థలను తొలగించాలంటే యింకా ఎంతోమంది ఉద్యోగులు కావాలి. ఈఖర్చులకు ప్రభుత్వం అంగీకరించదు.

ఇంతేకాకుండా దేశభాష లర్థంకాని యింగ్లీషు ఉద్యోగులను యీ రెవిన్యూవిధానాల పరిష్కారం కోసం నియమించడం ఏమిటని సర్ ఛార్లెస్ వైట్ వంటి ఇంగ్లీషుప్రభుత్వాధికారులే ప్రశ్నించారు. అతి దుస్తరమయిన బాధ్యతలను అప్పగించి, బతకడానికి చాలని జీతా లిస్తే, అదనంగా రాబడి వచ్చే అవకాశాలు వున్నప్పుడు వాటిని వుపయోగించుకోవడంకోసమే యీవుద్యోగులు తొందరపడవలసి వస్తుంది. అంతటితో ప్రభుత్వపు పరపతి పోయి, పరిపాలన అన్యాయంగా జరిగిపోతుంది అని యీ తక్కువజీతాల ప్రమాదాన్ని గురించి ఇతడు మాట్లాడాడు. కారన్‌వాలిస్ ప్రభువుకూడా యీ సంగతిని బాగా గ్రహించినవాడు. "మీ కీదేశంలో బాధ్యతాయుతమయిన పరిపాలన సాగాలంటే, మీరిచ్చే జీతాలను హెచ్చుచేయించాలి; తిండికి చాలని జీతాలు

యిచ్చి, వారిని పీడిస్తే రెవిన్యూవుద్యోగులు లీయగ చాట్లను ఆగలేక, స్వయంగా పీలయిన ప్రదర్శ్లా అన్యాయపు ఆర్జన సాగిస్తారు. ఇది మన ప్రభుత్వ విధానానికి తీరని అపచారం, మన శకపాలనకు అమోఘమయిన అవమానం అని వ్రాశాడు. అయితేనేమి, ఈ ప్రమాదకరమైన సాంఘిక దురవస్థకు నాడుకాదు కదా యీనాటికయినా విమోచన లేకపోవడమే రెవిన్యూ పరిపాలనా విధానంలోని లోపం.

ఆనాడు అమలులో ఉన్న రెవిన్యూవిధానం చాలా అసంతృప్తికరంగా ఉంటున్న విషయం అంతా ఏకగ్రీవంగా ఆమోదించారు. రెవెన్యూ బోర్డు వర్తక సంఘుసభ్యుల సంఘూ లిక అనవసరం గనక స్వస్తిచెప్పడం మంచిదని చెప్పింది. ఉత్తరసర్కారులను కలెక్టర్ల అధికారాని అప్పగించడం నయం అంది. జమీందారులను, సిబ్బందీని హతమార్చి వారిని రెక్కలుకట్టిన పక్షులలాగా చేస్తేనే గాని, దేశంలో శాంతికి అవకాశమే లేదంది. వారిని తక్షణం కోటలన్నిటినీ ఖాళీచేసి బ్రిటిషువారి అధీనంచేయాలని కోరాలంది. ఈకలెక్టర్లను నియమించినా, తమ అధికారానికి ఏవిధమయిన అడ్డంకులూ ఏర్పడవని కంపెనీకి తెలియజేయడం మంచిదని అంది.

క్రీ. శ. ౧౭౯౮ లో మదరాసు ప్రభుత్వం ఒక అధికారప్రకటన చేసింది. ప్రతిజిల్లాలోని జమీందారులూ, ప్రజలూ కొత్తగా తమ రెవెన్యూ విధానాలను సవరించడానికి వచ్చిన యీ కలెక్టర్లకు యావద్విషయాలనూ చెప్పవలసిందని అందులో ప్రకటించారు. జమీందారులూ, ప్రజలూ యిందుకు ఒప్పుకొన్నారు. ఈవిధానం క్రీ. శ. ౧౮౦౨ లో శాశ్వతపన్ను విధానం అమలుజరిగేదాకా సాగింది.

రాయలసీమమటుకు క్రీ. శ. ౧౮౦౦ లోనే కంపెనీప్రభుత్వాధికారంకిందికి చేరుకొంది. ఆనాటి రాయలసీమ ఆర్థిక రాజకీయ దురవస్థకు దేశచరిత్రలోగాని, ప్రపంచచరిత్రలోగాని సాటి లేదని చరిత్రకారులన్నారు. అరాజకం అంత త్వరలో అంతమొందించగలమన్న విశ్వాసం కంపెనీ ప్రభుత్వానికైనా లేనేలేదు. బళ్లారి, గుత్తి, తాడిపత్రి, యాడికి, చిన్నపల్లి, రాయదుర్గం, కోడికొండ, పెనుకొండ, హరపనహళ్లి, కూడ్లిగి, ఆదోని, కడప మొదలయిన పరగణాలుగా దేశం అంతా చీలికలయివుంది. ఇందులో ౧౨ పరగణాలకు మన్రోనే స్వయంగా అధికారం వహించుచున్నారు. తక్కిన పది చిన్న పరగణాలూ అతని అజమాయిషీలోనే ఉన్న విల్లియం థాకరే, కొక్రేన్ (William Thackery,Cochrane) అనే యింకో యిద్దరు రెవెన్యూ ఉద్యోగుల అధీనంలో ఉంచబడినాయి.

సర్ థామస్ మన్రో యీ రాయలసీమకు సర్వాధిపత్యం ప్రభుత్వపు తొలికాలంలో వహించడం తప్పనిసరిఅయింది. అతను అధికారంలోకి రాగానే ప్రప్రథమంగా రెవిన్యూవిధానంలో రైతువారీ [illegible] నవలంబించి, రైతుల నందరినీ పిలిపించి, వారికి కౌలుకదపాలను వ్రాయించి యిప్పించినాడు. అక్కడ రాజ్యాధికారం నశించిన రోజుల్లో, అరాజకపు ఆందోళనలో, అధికారస్థానంలో మొలకలెత్తిన పాళెగార్లు, గ్రామాధికారులు ఉత్తర సర్కారులలోని జమీందారులవంటి అధికారవర్గాలు. ఈరైతువారీ విధానాన్నీ, ప్రభుత్వానికీ రైతుకూ యాదృచ్ఛికంగా ఏర్పడిన సన్నిహిత ప్రతిపత్తినీ ఏవగించుకొని తమ ప్రాధాన్యానికి అంతరాయం కలిగించి తమకి నాధారంచేసుకోకుండా, తమ కిదివరకే రైతుజనంమీద ఉన్న ఆధిపత్యాన్ని పోగొట్టి తమ నధఃకరించడమే కాకుండా రైతుల కిదివరకు పరిపాటిగాని ఒకవిధమయిన స్వాతంత్ర్యం యీ రెవెన్యూ పరిపాలనా విధానంతో ప్రారంభించడం యీ అధికారవర్గాల కెంతమాత్రం యిష్టంలేక కొత్తగా వచ్చిన రైతువారీ పన్నువిధానాన్ని ప్రతిఘటించడం ప్రారంభించారు. కాని మన్రోమటుకు యీ ప్రతికూలాందోళనను అతి దారుణమయిన అధికారప్రవర్తనతో అణగార్చినాడు. వారి కోటలను కూల్చి, ఎదురుతిరిగినవారిని బందీ చేయించి, అనేకవిధాల అవమానించడం జరిగింది.

రాయలసీమలోని రెవిన్యూవిధానంలో రైతువారీవిధానాన్ని అమలుజరపడానికి మన్రో చేసే యీ దురంత సాహసాన్ని ప్రభుత్వం తీవ్రంగా గర్హించింది. కాని యిదంతా ప్రభుత్వాధికారప్రతిష్ఠకోసం, శాశ్వతత్వం కోసమే చేశానని మన్రో సమాధానం చెప్పాడు. అదిగాక, తరువాత యీపరగణాలనుంచి వసూలుచేయబడిన రెవిన్యూవసూలుమొత్తాలే యీవిధానంలోని లాభదృష్టిని ప్రభుత్వాని కర్థంచేశాయి. ప్రజలు తిండిలేక మలమల మాడిపోవలసివచ్చినా, పంటలు పండకపోయినా, వర్షాలే లేక, యీతిబాధలే తటస్థించినా పన్నులు తగ్గిస్తే రైతులకు సేద్యంలో వుండే అభిమానం తగ్గిపోతుందని విచిత్రంగా వాదించిన రెవెన్యూ అధికారి మన్రో తరువాత యీ రైతువారీవిధానాన్ని గురించీ, దాన్ని ప్రాశస్త్యాన్నీ ఉగ్గడిస్తూ చెప్పిన కబుర్లు చూస్తే మన కాశ్చర్యం కలిగించకపోదు! అయితేనేమి, మన్రో రాయలసీమలో ప్రతిష్ఠాపనచేసిన యీ రైతువారీపన్నువిధానంవల్ల మన తెనుగురైతుల ఆర్థికోద్ధరణకోసం, వారి విమోచనకోసమే తాపత్రయ పడినట్లుగా భావించే చరిత్రకారులుకూడా వున్నారు.

రెవిన్యూవిధానం సరిగా జరగాలంటే, మొత్తం భూమివైశాల్యం, అందులో రకరకాల భూముల పరిమితులు వగైరా జాబితా అవసరం గనుక మన్రో మొదట భూమిసర్వేవిధానం ఆరంభంచేయించాడు. ఈ సర్వేఫలితంగా మొత్తం సాగుఅవగలిగే భూమివిస్తీర్ణత, భూమిలో పండే పంటనుబట్టీ, చెల్లించే శిస్తునుబట్టీ ఏర్పడిన అంతరాలు, ఎంతవిత్తుకు ఏరకంభూమిలో ఎంత సాగుబడికి సావకాశం వుంటుంది, బంజరు భూములు ఎన్ని, పాడుపడిన బీడుభూములు ఎన్ని— యీవివరాలన్నీ యీసర్వేవల్ల స్పష్టీకరించాక పన్నుల సంగతి ఆలోచించడం ప్రారంభించారు. పంటలో ప్రభుత్వానికి రావలసిన భాగంయొక్క విలువను కొన్ని సంవత్సరాలనుంచి అమలులో వున్న ధరల అంచనా నాధారంచేసుకొని, ధనరూపేణా నిర్ణయించి చెల్లించవలసిన దన్నారు. ఎక్కువ పన్నులు యిచ్చుకోవలసిన బాధ్యతగాని, యితర రెవెన్యూ వుద్యోగుల మోసాలకు ఆహుతికావలసిన అవసరంగాని లేకుండా, ఈ రైతువారీపద్ధతి నవలంబించిననాటినుండీ, భూమిలో అధికంగా ఉత్పత్తి అయ్యే ఫలసాయాన్నంతటినీ రైతే అనుభవింపగలిగే సావకాశం ప్రప్రథమంగా సృష్టించామన్నారు. అయితే యీ రైతువారీరెవెన్యూ విధానంలో ఒకసారి నిర్ణయింపబడిన పన్నులు, మార్పులేకుండా, అలాగే వుండిపోలేదు. రైతుపరిస్థితులూ, భూమియొక్క సారం అధి

క్రమేణా పన్నులను హెచ్చుచేయడం రైతువారీవిధానంలో పరిపాటి. కాని యీ హెచ్చించడంమటుకు మితిమీరికాకుండా, కొన్ని హద్దులలోనే ఆపబడుతుందని ప్రభుత్వం ప్రకటించారు.

ఈ రైతువారీ విధానంప్రకారం ఏటేటా కోతకాలంముందు కలెక్టర్లూ, అతని వుద్యోగులూ గ్రామాలకు పోయి, రైతులనందరినీ ఒకచోటికి పిలిపించి, పండిన పంటప్రకారం పన్నులునిర్ణయించడం వారివిధి. పంటనుగురించిన భోగట్టా మొదట అయిన తరువాత, అప్పుడు ప్రభుత్వానికి చెల్లించవలసిన మొత్తాన్నిగురించిన నిర్ణయం జరగాలి. పంటలు బాగా పండి ఏవిధమైన క్షామకారణాలూ లేకపోతే, యథాప్రకారం సర్వే కొలతల ననుసరించి, నిర్ణయింపబడిన రేటుప్రకారమే వారు పన్ను చెల్లించవలసివుంటుంది. అలా కాక, యీతిబాధ లేమయినా వుండి, వర్షాలు పోయిగాని, పంటలు పోయిగాని, యితరకారణాలవల్లగాని రైతుపరిస్థితులు పాడుగా వుంటే పన్ను కొంత తగ్గించికట్టడానికి సావకాశమేకాకుండా రైతు విత్తనాలు, యితర వ్యవసాయసామగ్రులూ కొనుక్కోడానికి తగిన ధనం బాకీయివ్వడానికి సాయం జరిగేది. ఈ రకమయిన అప్పులనే తకావీ అనడం మామూలు.

ఈ రైతువారీపద్ధతిని పన్నులు నిర్ణయించడం ప్రారంభం అయినప్పటినుంచీ "రైతుకు తను పొలంలో నాగలితో దున్నకముందే, విత్తులు చల్లకమునుపే,

తన భవిష్యత్తులో ప్రభుత్వాని కివ్వవలసిన పన్ను విషయం పూర్తిగా తేలిక అయినదన్న విషయం తెలుసును గనుక, భూమిలో ఫలసాయం అభివృద్ధిపొంది అధికంగా లాభాలువచ్చినా, ప్రభుత్వంకూడా వాటా కావాలని అంటుం దన్న భయం పోయింది. అతని పట్టాలో అతని భూమివివరాలే కాకుండా, యివ్వవలసిన పన్నుకూడా స్పష్టీకరింపబడడంవల్ల గ్రామాధికారులు అదనంగా వసూలుచేయడానికి ప్రయత్నిస్తే, ఆందోళన చేసి ప్రభుత్వానికి యీ అన్యాయాన్ని తెలియజేసుకోడానికి తగిన సావకాశా లున్నాయి. ఆ విధంగా రైతుయొక్క హక్కులను భద్రంగా కాపాడడమేకాకుండా, అవసరమయితే ప్రభుత్వం యింకో చోట అప్పు తెచ్చుకోవలసిన అవసరం లేకుండా, రైతులనే పన్నులను ఎక్కువకట్టమని అడగవచ్చు; యీ పన్ను శాశ్వతంగా స్థిరపరచకపోవడంలో వున్న సులువే యిది" అని రాయలసీమలో ప్రవేశపెట్టిన రైతువారీ విధానాన్నిగురించి మాట్లాడుతూ మన్రో అన్నాడు.

సిద్ధాంతరీత్యా యింత ఆనందకరమయిన రెవెన్యూ విధానమునే మన్రో రాయలసీమలో అమలు జరిపించాలని ఆరంభించినా ఆ నాటి రాయలసీమ పరిస్థితులు హృదయవిదారకమయిన పంథాలో నడిచాయి. క్రీ. శ. ౧౮౦౧-౧౮౦౩ లలో వర్షాలే లేక పంటలు పోయి, దేశం అంతా దుర్భిక్షంతో వేగిపోయింది. మన్రో అంతటివాడే యీ దురవస్థకు, యీ అవాంతరానికి మార్గం అన్వేషించడానికి అవకాశాలు లేక అలమటించిపోయాడు. ఎంతో కాలం పట్టలేదు. ఒక్కసారిగా విపరీతమయిన కరువు, కాటకం ప్రబలిపోయింది; ప్రజలు యీగల్లా చనిపోయారు. ఆహార పదార్థాలు- బియ్యం, ధాన్యం, జొన్నలు యిదివరకు ధరలకు నూటికి మూడువందలరెట్లు, నాలుగువందల రెట్లు పెరిగిపోయినాయి. ప్రజలు గుంపులుగుంపులుగా హైదరాబాదు, మైసూరు సంస్థానాలకు వలసపోయారు. మన్రో యీ పరిస్థితులలో తానీ వుపద్రవాన్ని అణచి ప్రజల కేవిధంగానయినా తిండి దొరకగలిగే సావకాశా లుంటే బాగుంటుందని ఆలోచించి, దక్షిణదేశంలోని ధాన్యం, బియ్యం తుంగభద్రనుంచి బయటికి ఎగుమతికాకుండా ఆపాలని ఆజ్ఞాపించాడు. రాయలసీమలోకి దిగుమతి అయ్యే తినుబడి పదార్థాల మీద విధించే వర్తకసుంకాలను రద్దుచేయించాడు; ప్రభుత్వానికి రెవిన్యూవిధానం సులభంగానే వుందని అనుకొని ప్రవేశపెట్టినా పంటలే లేకపోవడంవల్ల, పన్నులు వచ్చే మార్గం కనబడకపోవడమే కాకుండా ప్రజలను పోషించి, వారికి ధనసాయం చేసి మళ్లా భూముల సాగుబడికి పంపిస్తే మళ్లీ ఏదయినా యీ బకాయిలుకూడా తీర్చగలుగుతారేమోనన్న ఆశ, ఆందోళన ఆరంభమయినాయి. ఇది రాయలసీమలోని కంపెనీప్రభుత్వపు తొలిరెవెన్యూపరిపాలనారంభంలోని ఆర్థికదురవస్థ. ఇక సర్కారుప్రాంతాల విషయం గమనించిన తరువాత ఎన్ని మార్పులు వచ్చినా, అక్కడ క్షామం లేదుగనుక, ప్రజలు ఏదోవిధంగా తట్టుకోగలిగారని కొంతమంది ఆర్థికవేత్త లన్నారు.

కాని, నిష్పాక్షికపుదృష్టితో యీ రెండు దేశభాగాలలోను కంపెనీ ప్రభుత్వపు రెవెన్యూవిధానాలను సాకల్యంగా పరిశీలిస్తే, యీ కరువుల కారణంచేతనే కాకుండా తరువాతయినా, యీ నాడు ప్రాతిపదికంగా ఏర్పరిచిన రైతువారీవిధానం తీరని అపచారమే చేసిందని తరువాతి రెవెన్యూచరిత్రవల్ల మన కనిపించకపోదు. ఇక సర్కారులలో పరిస్థితులను పరీక్షిస్తూ, అక్కడి శాశ్వత పన్నువిధానం అమలులోకి రాగానే సంక్రమించిన యమయాతనమాట అటుంచి, పోనీ యింతవరకయినా సక్రమమయిన రెవెన్యూ పరిపాలనావిధానాల విషయం ఏమయినా ఆలోచించారా అని అంటే, అక్కడ మాత్రం ఏమి సంతోషకరమయిన మార్గాలను రెవెన్యూపరిపాలన సాగింది. క్రీ. శ. ౧౭౬౬ నుంచి క్రీ. శ. ౧౮౦౩ దాకా ఒకే విధమయిన రెవెన్యూ విధానం లేకుండానే, అనేకసార్లు ఒకమారు కంపెనీ అధికారులకు లాభకరంగా వుండే

లాగ, ఒకసారి కంపెనీ వుద్యోగుల పారితోషికాలకు, ప్రయివేటు ఆస్తిసంపాదనలకు అవకాశా లుండేలాగ, ఒకసారి యింటివద్ద ప్రభుత్వం నియమించిన పెద్దల అభిప్రాయానుసారంగానూ, యింకోసారి రెవెన్యూ బోర్డు యిష్టప్రకారం మార్పులు జరుగుతూ మెకాలే అన్నట్టు 'ప్రజలను తలితండ్రులలాగ చూడండి; కాని మాకు డబ్బు కొంచెం ఎక్కువ పంపుతూవుండండి. ప్రజలమీద సానుభూతి కలిగి వారి కష్టసుఖాలను పంచుకోండి; కాని మాకు యింకా కొంత డబ్బు ఎక్కువగా వసూలుచేసి పంపండి. పాల ముంచినా, నీట ముంచినా మీదే భారం. పాలలో ముంచినా, నీటిలో కూడా మునగనివ్వండి' అన్నవిధానంగా ఆంధ్రదేశంలో కంపెనీ ప్రభుత్వపు తొలిరెవెన్యూ పరిపాలన క్రీ. శ. ౧౮౦౩ దాకా రకరకాలుగా మారుతూ వచ్చింది.



# మీకు బాగా యిష్టమైన ఆహారములను మీకు అధికశక్తి నొసంగు నట్లు చేసుకోండి!










మనకు ప్రియమైన కొన్ని ఆహార పదార్థములు మన ఆరోగ్యమున కేమాత్రము మంచివికావన్న విషయం మీకసలు తెలుసా? అవి ఆకలిమాత్రము తీరుస్తవి — గాని మనము పనిపాట్లవల్ల కోల్పోవుచున్న శక్తినైనా తిర్గి యివ్వజాలవు. ఇది బాగా ఆలోచించవలసిన విషయమే సుమా; ఏమంటారు? మన ఆరోగ్యము, సంతోషము, పనితనము, యివి అన్నియు మన శక్తిమీద ఆధారపడి వున్నప్పుడు, మనం తినే ఆహారం పూర్తిగా బలాన్ని చేకూర్పలేకపోతే, మనం ఎప్పుడో ఒకప్పుడు మూల పడవలసిందేగా మరీ.

అన్ని పదార్థములు యేదో కొంతవరకు బలాన్ని చేకూర్పగలవు. కాని మనం నిత్యం తినే వాటిలో కొన్ని బలము యేమాత్రము యివ్వలేవనే చెప్పాలి. అటువంటప్పుడు యీ రకపు ఆహార పదార్థములను మంచి పుష్టినివ్వగల యితర పదార్థములతో కలపటంవలన బలము వృద్ధిచేసుకో వచ్చును. ఆహారమును విటమిన్లతోనిండిన డాల్డాతో వండినయెడల దీనికి బాగా తోడ్పడుతుంది. ప్రకృతి సిద్ధముగా బలమును, ఆరోగ్యమును, చేకూర్పగల శక్తి డాల్డా మీకు యివ్వగలదు. డాల్డాతో వండటం చాల మంచి పద్ధతి — మనకు క్షేమకరము.



ప్రతి గృహిణి ఏ ఆహార పదార్థములు శక్తి నిచ్చునవో తెలుసికొనవలెను. డాల్డా పాకశాస్త్రమను పుస్తకము (ఇంగ్లీషులో అచ్చువేయ బడినది) 150 ఇండియన్ వివిధ తినుబండారములు తయారుచేయు పద్ధతులతో కూడినది. మిక్కిలి వుపయోగకరమైన విషయములు గలవు. మీకు ఒక కాపీ వుండుట ముఖ్యావసరము. 4 అణాల బిళ్లలు *Dept.* C110 *P. O. Box No.* 353, *Bombay*, పంపుడు.




**విటమిన్లతోనిండిన డాల్డా బలమునకు**

THE HINDUSTAN VANASPATI MANUFACTURING CO., LTD.




అతిమృదువైనది!

సబ్బు వాడుటలో క్లుప్తం:
నురుగుతీసి రుద్దుకో—అంతేగాని
సబ్బుతో శరీరంపై అరగతియ్యకు.
సబ్బు పెట్టెను పొడిగా వుంచుము.

దీని లావణ్యమైన నురుగు చర్మమునకు చాలా మెత్తదనం యిస్తుంది. పరిశుభ్రంగా చేసి. సిల్కువలె చర్మాన్ని తయారుచేస్తుంది-చర్మం మోటుగా. పాలిపోయినట్లు చెయ్యదు.

మైసూరు శాండల్ సోప్

మైసూరు ప్రభుత్వం సరుకు

MSK-12

# జాతకసోదరులు



= శ్రీ రాళ్లపల్లి గోపాలకృష్ణమాచార్యులు =

కొన్నాళ్లమునుపు నా ఆప్తమిత్రులలో నొక యుత్తమ శ్లోత్రియుఁ డొనర్చించుచుండిన శాంతిక్రతువును చూచి ఆనందించు భాగ్య మబ్బుటచే నేనపు డొక గ్రామాంతరమునం దుంటిని. పారాయణములు, హరికథలు, పురాణప్రసంగములు, ఉపన్యాసములు, తత్త్వవిచారములు, కావ్యచర్చలు, సంగీతగోష్ఠులు మున్నగు రూపములతో నిరంతరము "రామో రామో రామఇతి" అనురీతి శ్రీరామకథ కర్ణరసాయనముగా నచట వినవచ్చుచుండెడిది. వేదవేదాంగపారంగతులగు శ్రోత్రియశేఖరులు, తర్కవేదాంత తంత్రవ్యాకరణాదిశాస్త్రములలో పేరుగాంచిన పండితప్రకాండులు, సంగీతసాహిత్యకవిత్వకళలలో నారితేరిన రసికవతంసులు, పురాణప్రబంధ హరికథా కాలక్షేప దక్షులగు భాగవతోత్తములు, సనాతనాచార ధర్మకర్మనిష్ఠాతులగు పరమైకాంతిపుంగవులు మొదలుగా ననేకులు పాల్గొనుచుండిన ఆ యాగము కన్నులపండువు సేయుటేకాక మనస్సులనయితము తనుపుచుండెను. జన్మము సార్థక మయ్యెనని తలఁచితిని.

ఆ సమావేశమునకు వచ్చినవారిలో నొక వ్యక్తి పలువురి దృష్టి నాకర్షింపఁజాలినది. ఛాందసతేజఃపుంజ ముట్టిపడు ముఖకాంతి, పొరుగుదూరమునుండియే పిశాచోచ్చాటనము సేయఁజాలిన ద్వాదశోర్ధ్వపుండ్రరేఖలు, నిక్కబొడుచుకొని నిలువున నాట్యమాడు పిల్లజుట్టు, మొలనుండి మోకాళ్లదాఁక దుర్భేద్యమగు పద్మవ్యూహమును పన్నిన పంచకచ్ఛల పింజకట్టుకలిగిన సచ్ఛ్రోత్రియపరమైకాంతి యతఁడు. ప్రాపంచికవాసనల కతీతమై ఋష్యశృంగుని యపరావతారమనఁదగినట్టిది అతని అమాయకప్రవర్తనము. అంగవస్త్రంపు మడుపు నుత్తమాంగమునకుఁ జుట్టి, నివీతంపు త్రాళ్లు పవిత్రమైన దక్షిణకర్ణమున వ్రేలవైచి, వివిక్తప్రదేశమున నిలుచుకొని, మడుగునీర్కావిధోవతికి జేనెఁడు వెడల్పున కుచ్చెళ్లు పట్టిపట్టి పింజలు పోసి, మొలలో చెక్కి రెండు చేతులతో నొక్కొక్కటిగా పింజమడుపులను విడదీసి తడితడి, విన్నాణముగా సవరించు యోగముద్రలో మగ్నుఁడై, సూర్యభగవానుఁడు పశ్చిమాశను చేరినది సయితము గమనించక తదేకనిష్ఠతో నున్న ఆ యోగిపుంగవుని వైఖరి కనులార చూచితీరవలెను. ఒక్కొక్కప్పుడు పట్టిన ముక్కు పట్టి, చెప్పిన పదమే పదిమార్లు చెప్పి, చేసిన ఆచమనమే మరలమరల చెంబులోని నీరు ముగియుదాఁక చేయుచున్న పద్ధతిని చూచినవారికి అతని ప్రాతస్సంధ్య సాయంసంధ్యతో సాయుజ్యము పొందునని తోఁచకమానదు. భోజనావసరమున విస్తరిముందు కూర్చుండి, పంక్తిలో నూరారుమంది భాగవతులు ఆఁకటి యాత్రముతో కాచుకొనియుండుట సయితము గమనించక, పదినిమిషములయినా పరిషేచనపు చుట్లు చుట్టుచు, అభినయపూర్వకముగ పరబ్రహ్మార్పణము చేయు కార్యమున తక్కు ప్రపంచమును మరచి తన్మయుఁడైయుండు నా మహనీయుని జూచువారికి ఆ నాఁడు నవ్వులతోనే కడుపు నిండఁగలదు. ఆంధ్రకవితాపితామహుఁడు ప్రవరుని నోట అనిపించిన "బుద్ధిజాడ్యజనితోన్మాదుల్‌గదా శ్రోత్రియుల్." అను వర్ణనమునకు చక్కని దృష్టాంత మబ్బెనని నవనాగరకు లనుకొనుట కవకాశ మిచ్చుచుండెడిది అతని యమాయికనైష్ఠికచర్య. సరివారు కన్నుగీటుచు నాడు ఛలోక్తులకు, నవనాగరకులు వ్రేలుచూపి చేయు నవ్వు టాలకు, బాలురు ప్రదర్శించు వెక్కిరింపుల వేళాకోళములకు, పూర్వసువాసినులు కావించు ముసిముసినగవుల మూతివిరుపులకు చలించని ఆ మహనీయుని నిత్యకర్మానుష్ఠానధోరణి వాస్తవముగ మెచ్చుకోఁదగినది.

ఒకనాఁ డామహాశయుఁడు నాకడకు వచ్చి తన ద్వితీయపుత్రుని కెవరో కన్యక నిచ్చుటకై పెత్తనము వచ్చినారని చెప్పి. కన్యావరులకు నక్షత్రానుకూల్య మున్నదేమో

పరిశీలించవలె నని కోరెను. ఆకన్యావరుల జాతకములను గుఱించి చూడఁగా, కొంతవఱకు గుణములు చాలినన్ని రాకుండుటేకాక, పరస్పర గ్రహదృష్టియోగములయినా వైవాహికజీవితమున కనుకూలించునవి కానరాలేదు. ఆకన్యా వరులకు వివాహము జరుపుట శ్రేయస్కరము కాదని నా యభిప్రాయ మతనికి సూచించితిని.

"కన్యకకు సౌమంగల్యయోగము లేదా?" అని అతఁడు ప్రశ్నించెను. బాగున్నదని చెప్పితిని.

"ఇంకేమి బాధ?" అని అతని ప్రశ్న.

వివాహమునకై తగిన కన్యకను వెదకువారిలో నూటికి తొంబది వంతులు—జ్యోతిషశాస్త్రములో శ్రద్ధ కల దనుకొను వారే—నేఁటి కాలములో సర్వసాధారణముగా వేయు ప్రశ్న యిది. అనఁగా, ప్రశంసలో నున్న కన్యకను పరిణయ మాడిన తరువాత వరుఁడు చిరంజీవిగా జీవించఁగలఁడా అని. ఈవిషయము గమనింపనక్కఱలేదని నా ఆశయము కాదు. కాని, ఈయోగ మొక్కటి యున్న దను కారణమున మాత్రమే తృప్తిపడి మనువులను నిర్ధరించుట అన్యాయమని నా మనవి. వైవాహికజీవితమున ముఖ్యముగా గణింపఁదగిన భక్తి, రక్తి, అనుకూల్యము పరస్పరముగ వధూవరుల కుం డునా లేదా అని గమనించనినాఁడు పసుపుపూఁత, కుంకుమ బొట్టు భద్రముగా నుండిననేమి, జీవితము భారమై, క్లేశభూయి ష్ఠమై మరణమే మేలనిపించదా? దాంపత్యజీవితమున పురుషా ర్థములలో ధర్మార్థకామములు సిద్ధించనినాఁడు, నిరర్థకమైన నూరేండ్ల సౌమంగల్యయోగము గల సువాసినికి మోక్షము - అనఁగా, కపాలమోక్షము — స్పృహణీయ మగునుగదా?

> "ఉడు ముండదె నూరేండ్లును,
> పడియుండదె పుడమి పాము పదినూరేండ్లున్,
> మడువున కొక్కెర యుండదె,
> కడునిల పురుషార్థపరుఁడు కావలె సుమతీ."

అనుట భద్రభూపాలుని నీతివాక్యము.

అన్యోన్యహృదయముల నర్థము చేసుకొనుటకు వలయు సహృదయత్వము చూపని, పరస్పరముగ అను కూల్యముతో జీవించు పద్ధతుల నలవరచుకొను నేర్పు నీయని, ఒకరిపై నొకరికి భక్తిరక్తులు కుదురు నవకాశము కలిగించని జాతకయోగము లుండు కన్యావరులను, సౌమంగల్యయోగము కన్యకు, దీర్ఘాయుర్యోగము వరునకు కల దనుకారణమున ముడివేయుటకన్న ఘోరపాతకము వేరొండు కానరాదు. కాని, వయోధర్మము ననుసరించి తమకువలె తరుణీమణు లకుసయితము ఆశలు, ఆదర్శములు, అభిరుచులు ఉండుట సహజ మనుకొను వివేకము ఇప్పటి సాంఘిక పరిస్థితుల లో అనేకులకు రాకుండుట శోచనీయమగు విషయము. తమ పరిచర్యకై భగవంతుఁడు సృజించి తమ కర్పించిన పరిచారికలు స్త్రీ లను జ్ఞానము ప్రాచీన సంప్రదాయపు పరమే కాంతుల కున్నది. తమ విలాసవిహారములకు పనికివచ్చుటకై ప్రకృతిమాత నిర్మించి సమర్పించిన క్రీడాపరికరములు తరుణీమణు లను భావము ఆధునిక నవనాగరిక విజ్ఞానసంప న్నులకు వచ్చినది. పురుషులనుగూర్చి స్త్రీలకుసయితము ఏవో ఇట్టివే కొన్ని అభిప్రాయము లుండకపో వను వివే కము పలువురకు కానరాదు. కాననే ప్రకృతకాలమున వివాహము లనేకములు ఉట్టినిగాని, స్వర్గమునుగాని ముట్టలేకున్నవి.

వసంతాదేవికాఁబోలు, ఏదో యొక గ్రంథములో మన వివాహములను గూర్చి యిట్లు వ్రాసినది—

*"Some of our matches are but safty matches which can ignite at the slightest rub."*

[మన వివాహములలో కొన్ని అగ్గిపుల్లలవంటివి. ఏ కొంచెము ఘర్షణ కలిగినా, అవి భగ్గుమనును.]

ఎంత చక్కని ప్రపంచానుభవమో ఆమెది!

జాతకపద్ధతుల ననుసరించి దాంపత్యానుకూల్యము విషయమున నాయూహలను కొన్నింటిని నే నామహనీయునికి నివేదించితిని. ఫలము నాకే తృప్తికరముగ నుండలేదు. చెప్పినంతదూరము చెప్పి చాలించుకొని, "వీరి దాంపత్యము బాగుండదు. కారణములు చర్చించుట అనవసరము." అని ఆప్రసంగమును ముగించితిని. కాని, నామిత్రుఁ డంతటితో నన్ను వదలునట్లు కానరాలేదు.

"ఏవరునితో వివాహము జరిగినా, ఈకన్యక అదృష్ట మింతేనా?" అని యతఁడు మరల నెమ్మదిగా ప్రశ్నించెను.

"అట్లు కాదు. కన్యక జాతకమున దోషము లేదు. వేరు వరునితో గ్రహయోగములు సరిపడినచో, వివాహము సుఖకరముగా నుండఁగలదు." అంటిని.

"తమకు తొందర ఇచ్చుచున్నాను. క్షమించవలెను." అని చెప్పుచు మెల్లగ వేరొక వరుని జాతక మిది యని చెప్పి యొక రాశికుండలిని నాచేతి కిచ్చి ఆ కన్యకతో ఆనుకూల్య మెట్లుండునో చూచిచెప్పుమని ప్రార్థించెను. అతఁ డిచ్చిన కుండలి యిది :

| | | | ల |
|---|---|---|---|
| రా<br>చ | నిరయనరాశి<br>కుండలి | | గు |
| | | | శు<br>కే |
| | | శ<br>బు | ర<br>కు |

వాస్తవస్థితిలో నా కీకేవలరాశికుండలినుండి యేమియు బోధపడదు. జన్మదినము, జన్మకాలము మున్నగు వివరములను తెలుసుకొని సాయనస్పష్టగ్రహభావములను తెలుపు కుండలిని సిద్ధముచేసుకొంటిని. ఈ వరుఁడు జనించుట 30-9-1895 వ దినమున :

వరునికి ఏఁబదిసంవత్సరముల ప్రాయము నిండుచున్నది. కన్యక 12 సంవత్సరముల పాలప్రాయముతో అతనికి మనుమరాలు కాఁదగిన వయస్సుతో నున్నది. ఈ జాతక మెవ్వరిదో, ఇంతవయస్సు చెల్లి ఇపు డీవివాహ మేలనో తెలుసుకొనఁగోరి వివరముల నడిగితిని. ప్రతిచెప్పుటకు సంకోచించినట్లుగా నతని ముఖవైఖరి చూపట్టినది. కొంతతడవు నీళ్లునమిలి, ముఖమున నేమేమో వికారములు పొడగట్టఁగా నా మహాశయుఁడు "ఆనుకూల్యము సరిపోయినచో అంతా విజ్ఞాపనచేయుదును." అనియెను.

ఇదేమి చిదంబరరహస్యమో, నా కేల యీ అధిక ప్రసంగ మనుకొంటిని. పొంతనములు చూడఁగా, 28 గుణములు వచ్చినవి. గ్రహయోగాదులు పరిశీలించఁగా, ఏదో కించిత్తుగా అనుకూల్యము చూపట్టినది. వయస్తారతమ్యమునకు తగినంతమాత్రము ఆనుకూల్యము రావచ్చునని నా యభిప్రాయమును సూచించితిని. ఏఁబదియేండ్ల వరునికి పండ్రెండేండ్ల వధువుతో ఏటి ఆనుకూల్యము ?

నామిత్రుని ముఖమున వికాసము కానవచ్చెను. కాతరదృష్టులతో నతఁ డొకమారు చుట్టును చూచి, ఇతరు లెవరును లేకుండుటను గమనించి, సవినయముగ, "ఈ — ఈ — జాతకము దా - దాసునిదే." అని సంప్రదాయ శుద్ధముగా జారఁబలికెను.

జ్యేష్ఠపుత్రుఁ డింటిలో భార్యతో కాపురముచేయుచున్నాఁడు. కళత్ర మెప్పుడు వచ్చునో యని మధ్యముఁ డాత్రముతో ఎదురుచూచుచున్నాఁడు. ఇంతలో పెండ్లి కెదుగనున్నాఁడు కనిష్ఠపుత్రుఁడు. ముగ్గురు కూఁతుండ్ర ముచ్చట లున్నవి. సంసారభారమును నిర్వహించు శక్తి కలిగి గృహిణి యింట నున్నది. ఇపు డీవయస్సున మరల వివాహమా ? రామరామ: కుమారునికి చేసుకోఁదగిన కన్యక నా తండ్రి తానే వివాహమాడఁగోరుట ! ఈ ద్వాదశోర్ధ్వ పుండ్రముల పరమేకాంతిలక్షణమేమి, ఈ "విషాదసారంగధరనాటక"మును సంసారరంగమున ప్రదర్శించు కుతూహలమేమి ?

"తలలు బోడులైన తలఁపులు బోడులా
విశ్వదాభిరామ వినర వేమ."

అను వేమనసూక్తి స్ఫురణకువచ్చినది. నాహృదయాంతరాళమున జనించిన అసహ్యాభావము నాముఖమున దాఁగినది కాదు. ఇది కనిపెట్టి ఆతఁడు—

"ఇంటిలో ఆఁడుదాని కారోగ్యము లేదు. ఖాళీ అయినా కాలేదు. సౌమంగల్యయోగము బాగున్న దంటిరి కనుక, ఈకన్యక పనికివచ్చును గదా అనుకొన్నాను." అని సమాధానమిచ్చుట కారంభించెను.

ఏదో పరధ్యానములో నుండి "ఎవ్వరికో?" అంటిని.

అంతలో నెవరో పిలువఁగా త్వరలో వత్తునని యా శ్రోత్రియుఁడు వెడలిపోయినాఁడు. నాకేమో కష్టమనిపించినది.

ఏమి యీ జాతకమందలి వైచిత్ర్య మని నాలో నేను గమనించుచుండఁగా, ఆ సమావేశమునకు వచ్చినవారిలో జాతకశాస్త్రముపై నభిమానము గల నా మిత్రుఁ డొక న్యాయవాది నాకడకు వచ్చి—

"ఎవరిది జాతకము ?" అని యడిగెను.

"ఒక మహాపురుషునిది." అంటిని. నా శ్రోత్రియ మిత్రుఁ డిచ్చిన కేవల రాశికుండలి నా సమీపమున నుండఁగా, ఆ న్యాయవాది దానిని గమనించిచూచి—

"ఏమి ? నా జాతకమే చూచుచున్నారే! అని ఆశ్చర్య మగుపరచెను. నేను భ్రాంతుఁడ నైతిని.

క్షణకాలము విమర్శింపఁగా నా మిత్రుని మాట యథార్థముగ కానవచ్చినది. మామూలుపద్ధతిచొప్పున కేవల రాశికుండలిని తయారుచేసినచో, ఆ న్యాయవాది జాతకమునకు, ఆ పరమైకాంతిజాతకమునకు ఏమాత్రమైనా భేదముండదు. లగ్నము, ఆధిపత్యము, గ్రహస్థితి, దృష్టి ఇత్యాదులన్నియు రెండింటికి సమానముగా నుండును. కాని, ఆ వ్యక్తుల గుణములలో, నడవడిలో, ధర్మములలో, ఆదర్శములలో హస్తిమశకాంతరతారతమ్య మున్నది. కేవల రాశికుండలిపద్ధతి అసంబద్ధ మనుట కిది చక్కని దృష్టాంత మగుటచే పాఠకమహాశయుల కిది యర్పించుట బాగని తలంచితిని.

ఈ జాతకసోదరులలో ప్రథముఁడు రాత్రి 10-38 గంటలకు జనించెను. ద్వితీయుఁడు ఆ రాత్రియే 11-38 గంటలకు పుట్టుట. ఒక గంటకాలమే అంతరము. ఈ క్రింద నున్నదే మా శ్రోత్రియమిత్రుని నిరయనజాతకకుండలి:—

| | | | |
|---|---|---|---|
| | | ఇ 25-42 | ల 2-48 |
| X 24-8<br>రా 19-3<br>చ 9-51 | (నిరయనము) | | గు 12-9 |
| | | | కే 19-3<br>శు 27-40 |
| | | బు 10-30<br>శ 13-48<br>వ 23-23 | ర 14-56<br>కు 18-22 |

న్యాయవాదిమిత్రుని లగ్నము మిథునరాశిలో 16°-11' అగును. చంద్రుఁడు కుంభరాశిలో 10°-21' లో నుండును. వేరేమియు భేదముండదు. లగ్నము రమారమి 14 భాగలు జరిగినది. చంద్రుఁడు అర్ధభాగమాత్రము ముందుకు నడచినాఁడు. శతభిషానక్షత్రమే ఇరువురిది. ప్రథమునిది మొదటిపాదపు కొన; ద్వితీయునిది రెండవ పాదపు మొదలు. సర్వసాధారణముగా చూచు ఉడుదశలో ఇరువురికీ రాహుదశయే. జన్మకాలమున దశాశేషమిది:—

| | ది | మా | సం |
|---|---|---|---|
| శ్రోత్రియునికి . | 13 | | 13 |
| న్యాయవాదికి . | 22 | | 13 |

ఇఁక, ఒకరి లగ్నము తులాంశ కాఁగా, రెండవయాతని లగ్నము కుంభాంశలో నున్నది. చంద్రుఁడు కుంభరాశిలో ధనురంశలో నొకరికి, మకరాంశలో మఱియొకరికి రాఁగలఁడు. నవాంశకుండలిలో సయితము వేరువ్యత్యాసము కానరాదు!

కాని, వీరి జీవితములు చాల భిన్నములయినవి. రాత్రికి పగటికి నున్నంత తారతమ్యము వాని కున్నది. స్థాలీపులాకన్యాయమున ముఖ్యమగు విషయములు కొన్ని మాత్రము వివరింతును.

వేదవిద్య నభ్యసించిన పరమఛాందసుఁడు నా శ్రోత్రియ మిత్రుఁడు ; ఆంగ్లవిద్య నేర్చిన నాగరకుఁడు నా న్యాయవాది మిత్రుఁడు. వైదికవృత్తి నాశ్రయించి శరీరయాత్ర నడపుచున్న సాత్వికుఁడు ప్రథముఁడు ; న్యాయవాదివృత్తి నవలంబించి కుటుంబపోషణము చేయుచున్న సాధుశీలుఁడు ద్వితీయుఁడు. సంధ్యావందనమైనా చక్కఁగ రాని పండ్రెండు సంవత్సరాల పసితనమున బొమ్మపెండ్లివంటి వివాహపు ముచ్చటను రుచిచూచినవాఁ డొకఁడు ; ఇరువదిరెండేండ్ల యుక్తవయస్సున విద్యాభ్యాసానంతరము వివాహమాడిన గృహస్థుఁడు మఱియొకఁడు. ఇరువదినాల్గవయేఁట పితృమారకము సిద్ధించిన దొకరికి ; సర్వతంత్రస్వతంత్రుఁడై "సహస్ర" చంద్రదర్శనశాంతి కెదురుచూచుచున్న సమర్థుఁడగు జనకుని సేవించు భాగ్య మబ్బినది మఱియొకరికి. ఇరువదియేడవ యేఁట నొకఁడు మాతను గోలుపోఁగా, రెండవయతని కాక్లేశము రెండేండ్లకుపూర్వమే వచ్చినది. పనులలో "బాద స్త" మొకనిది ; "చకచక" మఱియొకనిది.

వెదకిచూచినచో వీరి జీవితములలో ఏవో కొన్ని పోలికలుకానవచ్చును, కలిగిన కొడుకులు, కూఁతుం(డ్ర)సంఖ్య యిరువురికి సమానమే. భార్య కనారోగ్య మను కారణమున నడివయస్సులో వీరిరువురికిని దాంపత్యజీవితమున సుఖము లేని కొఱఁతయే: గ్రహచేష్టయో, పిశాచావేశమో, రోగ లక్షణమో తెలియక విసికి సుఖహానికి చింతించి, "ఇల్లు ఖాలీ అయినా కాలేదే?" అని దుఃఖించుచున్నాఁడు మావేదాంతి. ఏ వైద్యునికి చూపినా ఏరోగమో తెలియకపోఁగా, ఏ మందులతోకాని గుణము కానరానందున, భగవంతునిమీఁదనే భారమువైచి భార్యను బ్రతికించుకొని కృతార్థుఁడై ఆనందించుచున్నాఁడు మా న్యాయవాది. ప్రాఁతభార్యను ప్రక్కకు త్రోసి పసుపుచీరనవోఢ నొకదానిని సంపాదించుకొని దాంపత్యజీవితపు నూతన రుచులతోటి శృంగారరస మనుభవించుట కువ్విళ్లూరుచున్న రసికశిఖామణి ప్రథముఁడు. ఏండ్లకొలఁది పత్ని కనారోగ్య మగుటచే అలవరచుకొన్న నిర్బంధబ్రహ్మచర్య వ్రతమువలన మరచిపోయియుండిన దాంపత్యజీవితాశ మరల రేకెత్తిన శీలవంతుఁడు ద్వితీయుఁడు. నలువదినాల్గు సంవత్సరముల వయస్సున వీరిరువురికిని సంతానవిషయకమగు మనఃఖేదము కలిగినది. కాని దాని స్వరూపములో చాల తారతమ్య మున్నది. కుమారులలో నొకనికి మానసికవ్యాధి ఆకస్మికముగ సంభవించి కొంత కాలము బాధించుటచే, న్యాయవాదిమిత్రుఁడు చాల నొప్పి పడినాఁడు; ఆఁడుబిడ్డను అల్లుఁడు పరిత్యజించి రెండవ భార్యను సంపాదించుకొనుటచే శ్రోత్రియమిత్రునికి పెక్కు చిక్కులు దాపరించినవి. గ్రహచార మీవిధముగా వీరి జీవితములలో భిన్నమార్గములలో ప్రసరించినది.

| | | | |
|---|---|---|---|
| X 16-30<br>రా 11-25<br>చ 2-13 | | | ఇ 18-4<br>I 25-10 |
| | (సాయనము) | | |
| | పరమేకాంతి | | |
| | (మిథునలగ్నము) | | స 4-31 |
| | బు 2-52<br>శ 6-10<br>వ 17-45 | ర 7-18<br>కు 10-44 | కే 11-25<br>శు 20-2 (వ) |

| | | | |
|---|---|---|---|
| రా 11-25<br>చ 2-43 | X 3-29 | | ఇ 18- 4 |
| | (సాయనము) | | I 8-33 |
| | న్యాయవాది | | |
| | (కర్కాటక లగ్నము) | | స 4-31 |
| | బు 2-55<br>శ 6-10<br>వ 17-45 | ర 7-20<br>కు 10-45 | కే 11-25<br>శు20-3(వ) |

సాయనపద్ధతి ననుసరించి వీరి జాతకకుండలు లిట్లుండును.

ఈ యిరువురి జీవితములలోఁ గల భేదమును సాయన గ్రహభావము లెట్లు స్పష్టపరచుచున్నవో చూతము. గ్రంథ విస్తరభీతిచే, ముఖ్యముగ కళత్రభావము నొకదానిని మాత్రము పరిశీలింతముగాక.

మిథునలగ్నజాతకునికి లగ్నాధిపతి బుధుఁడు, సప్తమాధిపతి బృహస్పతి. శనిసంయోగముచే స్తబ్ధుఁడై లగ్నాధిపతి (బుధుఁడు) సంకుచితదృష్టిని సంపాదించుకొన్నాఁడు. స్తుతిపాత్రములుకాని గుణము లనేకము లిట్టి బుధుఁడు సూచించునఁట. ఈ బుధునితో కళత్రాధిపతియగు బృహస్పతి కేంద్రప్రాతికూల్యదృష్టిలో నున్నాఁడు. గురుబుధులకు వైరము దృష్టిలో నున్న చోట విద్యాబుద్ధులకు కొదవ లేదు కాని, వివేకము మట్టమని పాశ్చాత్యు లందురు. ఇట్టి గుణ ధర్మములు కల బుధుఁడు (లగ్నాధిపతి) గురువును (కళత్రాధిపతిని) ద్వేషించుచున్నాఁడు. కుజశనులవంటి క్రూర గ్రహముల కిట్టి యాధిపత్యములో విషమదృష్టి వచ్చియుండెనేని, సంసారము రచ్చకెక్కియుండెడిది. కాని, బుధగురువు లిరువురు సౌమ్యులుకదా? ఇల్లాలు జీవించి ఇంట నుండఁగా, ఇల్లు ఖాలీఅయినా కాలేదే యని చింతించుచున్నాఁడు జాతకుఁడు.

కళత్రకారకుఁ డగు శుక్రుఁడు లగ్నమందలి ఇంద్ర గ్రహముతో కేంద్రప్రాతికూల్యదృష్టి నందుచున్నాఁడు. కళ

త్రముమండి సుఖము లేదను భావము —— భావమో, భ్రాంతియో—— జాతకునికి వచ్చినది. మానసికవ్యాధియో, అనారోగ్యమో కారణమని అతనికి తోఁచవచ్చును. శుక్రునిపై శనికిఁ గల అర్ధకేంద్రదృష్టి ఈ ఊహ కవకాశమిచ్చు చున్నది. సంతాన ( పంచమ ) స్థానమున రవికుజు లున్నారు. వారిలో కుజుఁడు రోగస్థానాధిపతి. సంతానము మూలముగ నేవో కొన్ని క్లేశములు జీవితమున రావచ్చును. విషయసుఖస్థాన మగుటచే, తత్సంబంధమగు అనారోగ్యము నయినా ఇది సూచించవచ్చును. భర్తజాతకమం దున్న యీధర్మముల వలని ఫలములో భార్యకు సయితము కొంత భాగము రాకతప్పదుకదా? ఆ కారణమున కల్గిన మానసిక క్లేశము కళత్రమునం దనారోగ్యముగా జాతకునికి చూపట్ట వచ్చును. ఇంద్రవేధితుఁ డగు శుక్రునికిని, లగ్నాధిపతియగు బుధునికిని సరినడుమ కుజుఁ డుండుట గమనించితిమేని, ఇట్టి యూహ తప్పన లేము. మఱియు, శుక్రుఁడు నీచపడి నాల్గవయింట నున్నాఁడు, ఇంటనున్న గృహిణి కొరకాదను విపరీతపు బుద్ధి జాతకునికి కలిగినది. సుఖము లేదే యని జాతకుఁడు తహతహపడుచున్నాఁడు. సంపాదించుకోవలె నని ప్రయత్నము!

1945- వ సంవత్సరమునకు దేవమానదశాపద్ధతి ననుసరించి చలితశుక్రుఁడు తులారాశిలో (విషయసుఖ స్థానములో) నున్న జన్మకుజునిపై ఆవాహనమైనాఁడు. "నన్వస్తి పుంఖితశరో మదన స్సహాయః " అనిపించు దశ యిది. ఈదశ వచ్చినపుడు స్త్రీసుఖమును కోరకుండనుండఁ గల ఇంద్రియనిగ్రహశక్తి యే మహానుభావులగు యోగుల కోకాని సామాన్యులకు సాధ్యముకాదఁట! కాని, ప్రకృత మున్న భార్య పనికిరాదను నమ్మక మున్నది. కావుననే, నూతన తారుణ్యము మిసమిసలాడుచున్న పుత్రునికి నెమ్మదిగా ఎప్పుడయినా వివాహము చేయవచ్చునులే అను కొని, వానికి పెత్తనమువచ్చిన వధువు తన అక్కఱకే పనికి వచ్చును గదా యను బుద్ధి జాతకునికి వచ్చినది. లగ్నమం దుండె శుక్రుని వేధించుచున్న ఇంద్రుని మహిమ!

విశేష మేమనఁగా, ఆచిన్నదాని లగ్నము వృశ్చిక రాశిలో 14-వ భాగలో నుండఁగా, జాతకుని చలితకుజుఁ డీ వయస్సునకు నికరముగా ఆ భాగకే వచ్చినాఁడు! కుజునికి లాభాధిపత్య మున్నదిగదా? అందుకే ఈ ఉబలాట!

లగ్నమందున్న ఇంద్రుఁడు శుక్రుని విషమదృష్టికి లోనై, లగ్నాధిపతి యగు బుధునిపై సార్ధకేంద్ర ప్రాతికూల్యదృష్టిని ప్రసరించుచున్నాఁడు. ఇంద్రియవ్యామోహము, ప్రేమవిషయమున ద్రోహచింతనము, అశుద్ధమైనట్టి, లేక నిందార్హమగునట్టి విపరీతప్రవర్తన గలవారి సంబంధము ఈ మున్నగు గుణములలో కొన్ని ఏదోయొక విధముగా జీవితములో నియోగము తెచ్చిపెట్టఁగలదఁట! ధర్మస్థానాధిపతి శని. అతనితో సయిత మీశుక్రుఁడు చెడినాఁడు. ధర్మలోప మేదయినా కలిగినచో, అది స్త్రీల సంబంధ మందో, ( శుక్రుఁడు పంచమాధిపతి అగుటచే ) విషయసుఖ వ్యామోహమందో, సంతానవిషయమందో అన్వయించుకో వలసియుండునుగదా? వస్తుస్థితిలో, జాతకుఁడు మంచి సాత్త్వికస్వభావము గలిగి సనాతనాచార శుద్ధమగు సంప్రదాయమును చూపునట్టి పరమేకాంతి. పాపమని తోఁచెనేని, అట్టి కార్య మేదియు అతఁడు చేయునట్టివాఁడు కాదు. ఏఁబది సంవత్సరముల వయస్సులో కన్యకాత్వము తీరని కనుకందను వివాహమాడుట ఇప్పటి సాంఘికనైతిక పరిస్థితులలో అధర్మమని, అన్యాయ్యమని అతనికి స్ఫురించి యేయుండదు. అదే లగ్నములో నున్న ఇంద్రుని మాయ! వయసు చెల్లిన చ్యవనమహర్షి సుకన్యను వివాహమాడ లేదా? అశ్వినీదేవతల అనుగ్రహ మాకాలములో నుండఁగా, వాజీకరణయోగములు సమకూర్చు హక్కీము లిపు డుండనే యున్నారు. ప్రాచీనాచారదూరులగు నవనాగరకయువకులలో నెవనికో భార్యయగుటకంటె, సదాచారసంపన్నుఁడగు తన వంటి యోగ్యునికి ధర్మపత్నియగుట ఏ కన్యకకయినా ముక్తిమార్గప్రదర్శక మను నమ్మకము జాతకునికి వచ్చినచో అది ఇంద్రుని వరప్రసాదమే యగును. ఇట్టి యూహలలో ధర్మమునకు కాకుండినా ప్రాపంచిక వివేకమునకు మోస మున్నదని అతనికి స్ఫురించకయే పోవచ్చును.

*"Wedded she was some years, and to a man, of Fifty, and such husbands are in plenty: And yet, I think, instead of such a One, It were better to have two of five and twenty, especially, in countries near the Sun"* (*From Byron's Don Juan*)

[ఏఁబది సంవత్సరముల వయస్సుగలవానితో ఆమెకు కొన్నియేండ్లక్రింద వివాహమైనది. అట్టి భర్తలు అనేకు లున్నారు: కాని, నా అభిప్రాయ మిది. అట్టివాఁ డొకఁ డుండుటకంటె, ఇరువది అయిదేండ్లవా రిద్ద ఱుండుట మేలు, అందులో, ఎండదేశములలో ఇది ముఖ్యము.]

వైరాకవి వ్రాసిన పైపద్యమందలి భావము—ఎంత ధర్మభూమిలో పుట్టినవారయినా—ఇప్పటి పైరిక విప్లవదినములలో మనదేశపు కన్యలలో కొందరికైనా కలుగ వచ్చునని జాతకమహాశయునికి గోచరించియుండదు. పరాభి ప్రాయము సరకుచేయని అమాయికవర్తనుఁ డతఁడు.

అది యట్లుండె.

కర్కాటకలగ్నజాతకునికి లగ్నములో ఇంద్ర గ్రహము లేదు. పీడ వదలినది. లగ్నాధిపతి చంద్రుఁడు శుభక్షేత్రమగు మీనరాశిలో ధర్మస్థానము (నవమభావము)లో నున్నాఁడు. ఇంద్రశుక్రుల కేంద్రస్థితి యను ఎన్నది కాని, అట్టి ఇంద్రుఁడు లగ్నములో (స్వభావములో), అట్టి శుక్రుఁడు చతుర్థస్థానములో (గృహస్థానములో), చేరనుట గమనించితిమేని, లగ్నాధిపతియొక్క ధర్మస్థాన స్థితివలన శీలస్వభావములలో కలిగిన ఉత్తమశ్లోకత్వము పాఠకమహా శయులు సులభముగా నూహింపఁగలరు. ఇంద్రవేధ కల శుక్రుఁడు సూచించు గుణము లగ్నకేంద్రమున కంటక తృతీయ వ్యయస్థానములకు వ్యాపించుటచే, జాతకుని స్వభా వము నది స్పృశించకపోయినది. ఆ స్థానములు సూచించు ఇతరవ్యక్తులలోనో, పరిస్థితులలోనో కానవచ్చి జాతకునికి క్లేశము నిచ్చుచుండవచ్చును. పోనిండు.

సప్తమాధిపతి శని యైనాఁడు. బృహస్పతితో ఈ శనికి కేంద్రవేధ. ఈ బృహస్పతి షష్ఠ(రోగ)స్థానాధిపతి. భార్య ఆరోగ్యవతి కాదు. కళత్రకారకుఁడగు శుక్రుఁడు వ్యయస్థానమందలి ఇంద్రునితో విద్ధుఁడై కళత్రాధిపతికి (శనికి) అర్ధకేంద్రదృష్టిలో నున్నాఁడు. సుఖము దూర మైనది. కారణము ఇంద్రమాయ! ఏదో, ఎవనికినిఅర్థముకాని వ్యాధి అది. క్రమక్రమముగా భార్యకు దేహబలము క్షీణిం చినది. క్షయరోగ మని 'నాటు'వైద్యు లనిరి ; ఏదో వింత పేరు గల 'టి. బి.' అని ఇంగ్లీషుడాక్టర్లు పేరుపెట్టిరి. మందుమాకులు సేవించి చాలయినది. ఫలము కించిత్తయినా కానరాలేదు. భగవంతునిమీఁదనే భారముంచి అతని కటాక్ష మును నమ్ముకొన్నారు దంపతులు.

ఈ జాతకమున లగ్నాధిపతితో కళత్రాధిపతి (శని) కెంత చక్కని శుభమిత్రదృష్టి యున్నదో పరిశీలింపుఁడు! శ్రోత్రియమిత్రుని జాతకములోవలె కేంద్రదృష్టి కాక, త్రికోణదృష్టి. ఈ జాతకునికి భార్యపై నపారవిశ్వాసము. అది భక్తిఅన్నను తప్పుగాదు. పితృసహమబిందువు సింహ రాశిలో 70-25 లో గురువుచెంత నున్నది. పితృభాగ్యము జాతకునికి రమ్యముగా చూపబడుచున్నది. కాని శనితో (కళ త్రాధిపతితో) ఈయిందువునకు కేంద్రవేధ కలదు. ఏదో కొంత ఘర్షణము తప్పినది కాదు. పితృస్థానాధిపతి (దశ మాధిపతి) యగు కుజుఁడు రవితో చేరి గృహస్థానమం దున్నాఁడు. జాతకునికి మనశ్శాంతి ఎప్పుడైనా తగ్గ నేని ఇంటి కలతలే కారణము కావచ్చును. సాధారణముగా చిత్తశాంతిని కోలుపోవని ధీరుఁడు జాతకుఁడు. చంద్రు నితో శనిబుధులకు కల మైత్రివలని ఫల మిది.

"చెప్పులోని రాయి, చెవిలోని జోరీగ,
కంటిలోని నలుసు, కాలిముల్లు,
ఇంటిలోని పోరు ఇంతంత కాదురా"

అన్నాఁడుకదా, అనుభవశాలి వేమన్న?

ధర్మపత్నిపై జాతకునకుఁగల న్యాయ్యమగు విశ్వా సము అతని తండ్రిదృష్టిలో అశక్తతగనో, స్త్రీపరతంత్రత గనో కానరావచ్చును. లేదా, ఆమెయొజమాన్యమును సహించుటకు వలయు నోపికలేనివారు పెద్దలు కావచ్చును. ఏమైన నేమి, జాతకుని మనశ్శాంతి కిది భంగకారి. శని చంద్రుల మైత్రి దృఢమగుటచే, ఏవిఘ్నములకుఁగాని ప్రతి బంధకములకుఁగాని వెలలేదు. గృహస్థాశ్రమములో బ్రహ్మ చర్యము నలవరచుకొన్నాఁడు జాతకుఁడు. భార్య కారోగ్యము కాలేదే యను చింతయే కాని, తనకు సుఖము లేకపోయెనే అను దుఃఖ మతని కంటనేలేదు.

నాలుగైదు సంవత్సరములకు పూర్వ మొకనాఁడు నామిత్రునిభార్య జాతకమునుచూచి, మూఁడు సంవత్సరముల కాలములో దేవమానదశ బాగుపడుచుండిన కారణమున, ఆమె కారోగ్యము కలుగునని సూచించియుంటిని. అప్పు డామెదేహ స్థితి మిక్కిలి భయావహముగ నుండినది. కాని జాతకుఁడు ధైర్యము చెడలేదు. క్రమక్రమముగా జాతకుని భార్య ఆరోగ్యమును సంపాదించుకొన్నది. ఇంద్ర గ్రహము చారవశమున తులారాశి చేరి జన్మకాలిక బృహస్ప తికి మిత్రదృష్టికి రాఁగా, దేవగురు కటాక్షమున నామెకు పూర్ణారోగ్యము కలిగినది. ఇపు డామె తన యింటికిని, భర్తశీలమునకును కళతెచ్చినది. జాతకునికి చలితశుక్రుఁడు జన్మకుజ సంయోగమును పొందిన కాలముకదా యిది?

ఇంత చాలును. ఈరెండు జాతకములలో సాయన కుండలికిఁ గల విలువ పాఠకమహాశయులు గమనించఁగల రని నాయాశ.

# నిర్ణయము

•

## = శ్రీ చెఱుకుపల్లి జమదగ్నిశర్మ =

[పితృమరణదుఃఖము కడచనిన వెనుక శత్రుఘ్నుఁడు తనలో—]

గద్దెనెక్కుట కాలిపైఁ గాలువెట్టి-కూరుచుండి సుఖమ్ము చేకొనఁగఁగాదు
అల కిరీటమ్ముకంటె శతాధికమ్ము-బరువు ధర్మమ్ము నిర్వహింపంగనగును.

రాజురా జన కరము కరమ్ము గొనుచు-కడుపులోఁ జల్ల కదలక కాళ్లు సాఁపి
స్వీయసౌఖ్యమ్ముపొంటె నుర్వీజనాళి-యభిమతార్థంబు త్రోసివేయంగఁగాదు.

రాజన తండ్రియై ప్రజల రక్షణసేయవలెన్, సమస్తభూ
మీజనమాన్యుఁడై యిలను మెట్టిన దైవ మటన్న ఖ్యాతితో
రాజిలఁగావలెన్; దొసఁగు రాఁ జన దెన్నఁడు పాలనంబునన్;
రాజయినన్ సుఖమ్ము కనరాదుగదా తలక్రిందులైననున్.

దోషి నిర్దోషి నెఱిఁగి తద్దోషమునకుఁ-దగిన దండన విధియించు తరిని దొసఁగు
కెంతవానికి రావచ్చు నీకతాన-నృపున కంతాన యముని మన్నింపు నిజము.

అగుటన్ లోకమునందు నెవ్వఁడును రాజ్యాపేక్షఁ బోరాడఁగాఁ
దగ దెన్నండును, ధర్మభారవహనార్థం బెవ్వఁడే ముందుకున్
దగువాఁడై చనుదెంచుచో నయమె! స్వార్థం బెంచి యర్థార్థియై
జగమేల్ భారము నెత్తికెత్తికొనుటల్ సవ్యంబుగా దేనికిన్.

రాజే తానుగ ధర్మమున్ జెఱిచి సామ్రాజ్యమ్ము సాధించినన్
రా జెట్లో ప్రజ యట్లటన్న నుడి వ్యర్థంబౌనె! వెన్వెంట నీ
వ్యాజమ్ముం గొని యెల్లవారు ప్రభులై స్వార్థప్రతిస్పర్థియై
తేజోవంతమునైన ధర్మ మది నిస్తేజమ్ముగాఁ జేయరే!

రఘుకులమ్మున జ్యేష్ఠుండు రాజుగాఁగ-ధర్మముండంగ నేటికధర్మవృత్తి
నకట!-తల్లియౌఁగాక-నిశాటతన్వి-సకలగుణధాము రాముఁ గానకయి పంపె!

అన్న యెక్కంగనైన సింహాసనాన-తమ్ముఁ డొకఁ డెక్క నని యెట్లు ధర్మమగును?
ధర్మవిచ్ఛిత్తి సలుపుభూధవుఁడు గలుగ-నతని రాజ్యాన ధర్మ మేమగును ప్రజకు?

యోజనము చేయు కొలఁదిగ-రాజద్రోహమ్ము సలుప ప్రజలకు ధర్మం
బీజగతి ననుచుఁ దోఁచెడి-రాజుగ రామాధినేత రాఁగలవలెకున్.

# ప్రకృతిశాస్త్రసిద్ధాంతములు

## బ్రహ్మాండము

**'విద్యార్థి'**

### ౧. సూర్యుడు, ఇతర నక్షత్రములు

మనం చూచే సూర్యుడు నిజానికి ఒక నక్షత్ర మాత్రుడు. ఇక్కడికి ౯-౩౦ లక్షల మైళ్ల దూరాన ఉన్నాడు. ఇతర నక్షత్రాలు అనేకంకన్న చిన్నవాడు. మనకు ఎంతో దగ్గిర దనుకునే నక్షత్రము సూర్యునికన్న వేలరెట్లు దూరాన ఉన్నది. కనుకనే నక్షత్రాలు అంత చుక్కలుగాను, సూర్యుడు అంత ముద్దగాను కన్పిస్తున్నారు. మన భూమితో చూచుకుంటే సూర్యుడు ఎంతో పెద్దవాడు. ఈ పోలికలు గ్రహించవలెనంటే న్యూయార్కునుంచి సాన్‌ఫ్రాన్సిస్కోకు నాలుగు రోజులలోనే పోయి చేరగల వేగిరమైన ఎక్స్‌ప్రెస్‌రైలు ఉంటే అది అదేవేగంతో భూమధ్యరేఖను భూమి చుట్టూతా తిరగటానికి ౩౫ రోజులు పడుతుందికాని సూర్యునిమధ్యరేఖను సూర్యుని చుట్టూ తిరగను పది సంవత్సరాలు పడుతుంది. దీన్ని బట్టి సూర్యుని ఆకారం గ్రహించవచ్చును. రైలు ఆకాశంలోకి వెడలిపోయి దివారాత్రాలు అదే వేగంతో పోతూనే ఉంటే సూర్యుని చేరేవరకు ౩౫౦ సంవత్సరాల కాలము పట్టుతుంది.

ఎనిమిదిన్నరఅంగుళాల వ్యాసము పట్టి కాగితంతో బంతిలాగా చేసి అది సూర్యుడుఅనుకుంటే ఆ అంతరంలో భూమిఆకారము గుండుసూదితలను పోలిఉంటుంది. కాగితపు బంతికి ౭౫అడుగుల దూరాన గుండుసూదినిఉంచితే భూమికి, సూర్యునికిఉన్న దూరం ఏపాటిదో యీపోలికతో ఊహించుకోవచ్చును. అన్నివైపులా సూర్యుడు వేడిరూపముగాను, వెలుగురూపముగాను శక్తిప్రసారముచేస్తూఉన్నాడు. అయితే అందులో ఎన్నోవీసం భూమికి వచ్చి చేరుతున్నదో ఆలోచించండి. కోట్లసంవత్సరాలుగా సూర్యుడు యీశక్తిని పంపిస్తూ ఉన్నాడు. బహుశః ఇంకా కోట్లసంవ[illegible]బడి పంపుతూనే ఉంటాడు. ఈశక్తికి మూలం ఏమిటి? పదార్థములు కుంచుకోగా వేడి బయటపడుతుం దని సిద్ధిస్తున్నది కనుక సూర్యుడు చల్లపడి కుంచుకుంటూ ఉండటము యీ శక్తిప్రసారణకు ఒక హేతు వనవచ్చును. అయితే యీవిధంగా వెలికివచ్చే వేడి కొద్దిదే. మిగిలినదానిమాట యేమి? ఈశక్తికి కిరణ-కర్మ ఒకనిధానము కావచ్చునని శాస్త్రజ్ఞులు కొందరు తలుస్తున్నారు. ధాతువుల(మూలద్రవ్యముల)కణములు విరిసిపోగా వేడి పుట్టుతున్నది. దీనినే కిరణకర్మ అంటారు.

లోహమయమైన ఆవిర్ల నుంచి ప్రకాశమానమై మేఘములు ఏర్పడగా వాటివలన సూర్యుని బింబతలము మెరుస్తున్నది. భూమిమీద ఘనీభవించిఉండే ధాతువులన్ని సూర్యునిలో వాయురూపము దాల్చిఉంటవి. ఒకొక్కప్పుడు సూర్యబింబంఅంత వేడిగా ఉంటుంది. సూర్యునిపైన నల్లని మచ్చలు కానవస్తవి. వీటిని సూర్యాంకము లంటారు. ధగధగ మెరిసే వేడివేడిపొగమబ్బుల మండలాలలో ఉప్పెనగాడ్పులలాగా రభసగా సుళ్లు తిరిగే తుఫానులే యీసూర్యాంకములు. నిమిషానికి ఇవి ఆరు వేలమైళ్ల వేగాన కదిలిపోతూఉండునని అంచనా వేశారు. ౧౯౩౫లో ఫ్లారిడాను నాశంచేసిన ఉప్పెనగాలి నిమిషానికి రెండుమైళ్ల ఝరితో వీచిందంటే

ఆవేగపు రివ్వు ఊహించుకోవచ్చు. ఈసూర్యాంకము ఒకటి లండనును తాకితే అక్కడి నెల్సన్ స్తంభము ౩ వేలమైళ్లో దూరాన ఉన్న న్యూఫౌండ్‌లాండ్‌లోకి అరనిమిషంలో ఎగిరిపోయిపడుతుంది. పదకొండేళ్లకోసారి ఈసూర్యాంకముల సంఖ్య వర్థిల్లుతూ ఉంటుంది. ఆసమయంలో దిక్సూచిలోని సూది కొట్టుకుంటుంది. రేడియో, టెలిగ్రాఫ్ సందేశములకు ఆటంకం కలుగుతుంది. ఆకాశంలోని ఉత్తరాది జ్యోతి మరింతకాంతిగా వెలుగొందుతుంది.

సూర్యుడుసహా అన్ని నక్షత్రాలూ వాటివాటి వెలుగువల్లనే ప్రకాశిస్తున్నవికాని చంద్రుడివలె ఇతరంగా ప్రతిభానమయే వెలుగువలన కాదు. వెలుతురు సెకనుకు ౧౮౬ వేల మైళ్లచొప్పున ప్రయాణంచేసినా సూర్యకాంతి మనకు చేరేప్పటికి ౮ నిమిషాలు పడుతుంది. ఇంత గొప్పవేగము ఉన్నప్పటికీ, మనకు దగ్గిరసా ఉన్న నక్షత్రకాంతి మనకు చేరను నాలుగేళ్లపైచిలుకు పట్టుతుంది. కొన్ని నక్షత్రాలు ఎంత దూరాన ఉన్నవనగా అవి ఇవ్వాళ లుప్తమైపోయినప్పటికీ యీ భూలోకవాసులకు ఆ సంగతి తెలిసేప్పటికి వందలాది వేలాదిసంవత్సరాలు గడిచిపోతవి.

## ౨. నక్షత్రగణములు

నక్షత్రాల గుంపులను నక్షత్రగణములు అంటారు. ప్రాచీనులు ఆకాశం వీక్షించి పశువులు, మునులు, దేవతలు మొదలైనవారికి సూచకముగా నక్షత్రములు గణవిభాగమైయున్నవని ఊహపడినారు. వారా గణములకు పెట్టిన పేర్లు ఇప్పటికీ అనుసూత్యంగా వస్తూ వాడుకలో ఉన్నవి. సప్తర్షి మండలము, ఉత్తర ధ్రువ మండలము అని ఇప్పుడున్నూ పేర్కొంటున్నాము. ఇవి ఏడాదిపొడుగునా ఆకాశంలో కన్పిస్తూనే ఉంటవి. ఇవి ధ్రువనక్షత్రంచేరువనే ఉంటవి. నిజానికి ధ్రువనక్షత్రం వల్లనే ఉత్తరధ్రువ మండలము ఏర్పడుతున్నది.

## ౩. ధ్రువనక్షత్రము

ఆకాశంలో మెరిసే అన్ని నక్షత్రాలలోకీ ధ్రువ నక్షత్రం అనాదిగా నావికులకు, భూసంచారులకు మార్గదర్శినిగా ఉన్నందున ఎంతో ప్రసిద్ధమైనది. మిగిలిన నక్షత్రాలన్నీ దానిచుట్టూ తిరుగుతున్నట్లు ఉంటుంది. భూగోళపు ఇరుసుగీతకు అది ఇంచుమించు సూటిరుగా ఉన్నందున అలా అనిపిస్తుంది. మొదట ధ్రువనక్షత్రం ఏదో నిర్ధారించుకుంటే చాలా నక్షత్ర గణాలను తేలికగా తెలుసుకోవచ్చును. ఈ నక్షత్రమేదో పోల్చుకోవలెనంటే రాత్రివేళ ఆకాశం స్వచ్ఛంగా ఉన్నపుడు ఎప్పుడైనాసరే ఉత్తరభాగాన చూడండి—సప్తర్షి మండలం పోల్చుకో వచ్చు. ఈ మండలం కొడగిన్నెలాగా ఉంటుంది. నాలుగు చుక్కలు నల్చదరపుమూలలుగా గిన్నెవలె ఉండి, వరసగా ఉన్న మూడుచుక్కలు కొడలాగా ఉంటవి. ఎదురుబొదురుగా గిన్నె కొసనున్న రెండునక్షత్రాలను చూపుడు నక్షత్రా లంటారు. ఇవి సూటిగా ధ్రువ నక్షత్రాన్ని చూపుతవి గనుక వీటికి యీ పేరు వచ్చింది. ప్రకాశానికి ధ్రువనక్షత్రము యీ రెండు చూపుడు నక్షత్రాల కాంతికీ సమమౌతుంది. ఆ రెండు నక్షత్రాలమధ్యనున్న దూరానికి అయిదంతల దూరం ధ్రువనక్షత్రానికీ, సప్తర్షి మండలానికీ ఉంటుంది.

## ౪. ఉత్తర ధ్రువమండలము

నిజానికి ఉత్తరధ్రువమండలంలోనే ధ్రువ నక్షత్రంకూడా చేరుతుంది. వంపుతిరిగి, నాలుగు నక్షత్రాల రాశిని ఆనుకున్న గీతకు చివరన యిది ఉన్నది. ఈ మండలమూ కొడగిన్నెలాగానే ఉంటుంది. ఈ మండలాలు, యితర మండలాలు ధ్రువనక్షత్రం చుట్టూరా తిరుగుతూఉన్నవనిపిస్తుంది కనుకనే కాలభేదాన్నిబట్టి వీటి స్థానము మారుతూఉంటుంది. కాని నిజానికి యివి తిరుగుతున్న వనిపించటానికి హేతువు భూమి తిరగటమేను.

## ౫. నక్షత్రాల జన్మాదికము

ఆకారానికీ, కాంతికీ నక్షత్రాలలో చాలా భేదముంటుంది. కొన్ని నక్షత్రాలయందు మన యీ సూర్యుడే చాలా చిన్నగా కన్పిస్తాడు. వాటి వ్యాసము భూసూర్యుల కన్న దూరాన్ని మించిఉంటుంది.

పెద్దపెద్దనక్షత్రాలు భూమికి మరీ దూరాన ఉంటవి. కనుక అంతప్రకాశంగా ఉండవు. జ్యోతిశ్శాస్త్రజ్ఞులు నక్షత్రాలను వాటి కాంతి తేజస్సులనుబట్టి జాతులుగా వర్గీకరణం చేస్తారు. అందులో మొదలుగా లెక్కకువచ్చేవి ఎంతో ప్రకాశవంతంగా ఉండి, తేలికగా గుర్తుపట్టవీలవును.

గాలిలియో అనేఆయన టెలిస్కోపును కన్పెట్టేవరకూ ఖగోళశాస్త్రజ్ఞుల నక్షత్రపరీక్ష తగుమాత్రంగా చాలా పరిమితమైవుండేది. ఆకాశం ఎంతో స్వచ్ఛంగా ఉన్నదనుకున్న రాత్రి దూరదర్శినిసాయం లేకుండా రెండువేలనక్షత్రాలకన్న గుర్తుపటవీలయేది కాదు. ప్రాచీనకాలపు గొప్పజ్యోతిశ్శాస్త్రజ్ఞులలో ఒకడు టాలిమీ అంతవాడుకూడా వెయ్యినక్షత్రాల పెచిలుకుమాత్రమే జాబితా వ్రాయగలిగాడు. కాని గాలిలియోసిద్ధివలన అపారఫలితములు లభించినవి. సూర్యాంకములు స్పష్టముగా కాన్పించినవి. చంద్రమండలంలోని కొండలు, లోయలు కంటబడినవి. బృహస్పతి చుట్టూ ప్రదక్షిణం చేసే చంద్రులు కనిపించారు. మన సౌరమండలాన్ని ఇముడ్చుకున్న నక్షత్రలోక మెంత భారీదో, దాని సాధారణఆకారవిన్యాసం ఎలాటిదో మొదటిసారిగా సర్ విలియం హర్షెల్ వల్ల తెలియవచ్చినది. పాలపుంత మసకమసక వెలుగుపట్టైడవలె కన్పిస్తుంది. కాని నిజానికి సూర్యు   నక్షత్రాలు అంతకన్న ఎంతెంతో పెద్దవి పెక్కులుపెక్కులుగా పాలపుంతలో ఉన్నవి. పాలపుంతకు సమకోణంగా ఎన్నోనక్షత్రాలు లేవు. గిన్నెవంటి ఖగోళములో భూమి ఉన్నదని పాలపుంతనుగూర్చి సమాధానమైన వివరణ చెప్పుకోవచ్చును.

నక్షత్రాల యీడును బట్టి వాటి రంగుల్లో తేడాలు ఉండును. పలచని వాయువులనుండి పనికందులుగా ఏర్పడుతున్నవి. అవి పెద్దపెరగగా చిన్నవి చిన్నవై లోవేడిని కొంత వెలికి కక్కివేస్తవి. కాని చిన్నవవుతూ గట్టిపడగా వాటి తాపం హెచ్చి ఎర్రదనం పోయి తెల్లగానో, కొంచెం నీలంగానో తేలుతవి. కొంతకాలానికి ఒక స్థితి వచ్చేప్పటికి ఈ వేడిమి హెచ్చడము ఆగిపోతుంది. అప్పుడు అవి తిరిగి చల్లబడుతవి. అప్పటికున్న తెల్లరంగో, నీలనీలపు రంగో పోయి పసుపుపచ్చనో, లేక ఎరుపో అవుతవి. చివరకు అవి అంతర్ధానమౌతవి. కనబడే నక్షత్రాలకన్న నల్లగా కనబడకుండా ఉండేవి ఎక్కువగా ఉన్నవనే భావన కద్దు. అనేకనక్షత్రాలు జములువంటారు. అంటే ఒకేకేంద్రంగా రెండేసి నక్షత్రాలు తిరుగునంటారు. అటువంటి జంట ఒకటి, అరబ్బీలు దయ్యమనే ఆల్గోల్. ఇందులో రెండునక్షత్రా లున్నవి. వీటికాంతిలో తేడా ఉన్నది. అందువలన కొద్ది రోజుల్లోనే యీజంట ప్రకాశంగాను, మసకగాను కూడా ఉంటుంది. ౧౮, ౧౯ శతాబ్దాలలో అరబ్బీలు ఆకాశమును ఎంతో శ్రద్ధగా చదివినారు. మన ఖగోళ, గణితజ్ఞానమునకు వారికి మనం చాలా ఋణపడినాము.

## ౬. కొన్ని నక్షత్రాలు

సప్తర్షిమండలాగ్రంనుంచి అనగా, కొడగిన్నెను కొడచేరినచోటనుంచి పైగాఉన్న నక్షత్రానికిన్నీ, ఇంకా యీరెండుమండలాల వెడల్పుకు నాలుగింతలు ఆవలికిన్నీ ఒక గీత కల్పించుకుంటే ప్రథమజాతికి చెందిన బ్రహ్మహృదయమనే నక్షత్రం పసుపుపచ్చనిది కన్పిస్తుంది. ఇది సారథిమండలంలోనిది. సూర్యకాంతికన్న బ్రహ్మహృదయకాంతి ౧౩౦ యంతలు జనవరి ఫిబ్రవరిమాసాలలో అది నెత్తిన ఉంటుంది.

అనతిమారాన జంటనక్షత్రా లనేవి రెండున్నవి. వాటినే పునర్వసు, పునర్వసుద్వితీయ అంటాము. పునర్వసు పసుపు పచ్చనిది. సూర్యుని ఈడుది.

పునర్వసుద్వితీయ తెల్లనిది. జంటలోకి ఇది యీడుకు చిన్నది.

వేసవిలో ఆకాశంలో కల్లా పరమప్రకాశంగా ఉండేది అభిజిత్తు నక్షత్రము. ఇది తెల్లన. సూర్యుని కన్న ౫౦ రెట్లు వెలుగు నిస్తుంది. కాని భూమినుంచి సూర్యునికన్న చాలాదూరాన ఉన్నందున అంతగా వెలుగు అనిపించదు. సూర్యుడు అభిజిత్తు ముఖంగా కదులుతున్నాడు. శీతకాలంలో పరమప్రకాశమైనది లుబ్ధకనక్షత్రం. ఇది బహులుబ్ధకమండలంలోనిది. ఇది ఆ ఋతువులోని పరమప్రకాశవంతమైన మృగశిర మండలానిదని పూర్వులు భావించేవారు.

౭. సన్నమబ్బులు

పెద్ద టెలిస్కోపుతో ఆకాశవీక్షణ చేస్తే బిందువులు నక్షత్రాలే కాక, మేఘాలవంటి మేట్లు గోపురంగాను, కొన్ని ఏ ఆకార మనటానికీ వీలులేక చీకిరిగాను కన్పిస్తవి. వీటిని సన్నమబ్బు లంటారు. ఇవి వాయువులతో ఏర్పడినవి. ఇలాటివి వేలాదివందలకొద్దీ గుర్తుపెట్టారు. ఇవి ఎంతెంత దూరాల ఉన్నవో అంచనావేసి, అవి వేరేలోకాలు అని విశ్వసిస్తున్నారు. కొన్ని సన్నమబ్బులు నల్లగా ఉండి వాటి వెనకగా ఉన్న నక్షత్రాలను కమ్మివేస్తున్నవి. ఈ నల్లని సన్నమబ్బుల ప్రకృతి యిలాటిదని నిశ్చితంగా చెప్పటం అసంభవము.

౮. సౌరమండలం

సూర్యుని గురించి, నక్షత్రాలను గురించి ప్రాచీనులకు తెలిసినదానికీ, మన కిపుడు తెలిసినదానికీ ఎంతో తేడా ఉన్నది. బ్రహ్మాండానికి భూమి కేంద్రమని, ఆకాశం చాందినీవంటిదని, ఆకాశపథాల పరుగిడిపోయే అగ్నిరథం సూర్యబింబమనీ పూర్వం అనుకునేవారు. ఇతర లోకాలతో నక్షత్రాలను పోల్చితే భూమి చిన్నదనినీ, ఇదినీ, గ్రహాలనే మరి యేదున్నూ సూర్యునిచుట్టూ తిరుగుతున్నవనీ ఇపుడు మనకు తెలుసును. సూర్యుడు, ఇవి, వీటిచుట్టూ తిరిగే చిన్నవీ కలిసి సౌరమండలం ఏర్పడుతున్నది. నిజంగా సూర్యులే అయిన నక్షత్రాలకు వాటిచుట్టూ తిరుగాడే బింబాలు ఉండవచ్చును.

గ్రహాలు ఎనిమిది. వాటి ఆకారాన్ని బట్టి వరసగా వాటి పేర్లు యివి: బుధుడు, అంగారకుడు (కుజుడు), శుక్రుడు, భూమి, వరుణుడు, నెప్ట్యూన్, శని, బృహస్పతి (గురు). బుధుడు చిన్నవాడేకాక సూర్యునికి పరమసమీపాన ఉన్నాడు. అంటే ౩౬౦ లక్షల మైళ్ళ దూర మున్నాడు. నెప్ట్యూన్ అత్యంత దూరాన ఉన్నాడు. అంటే ౩౦౦౮౦ లక్షలమైళ్ళ దూర మున్నాడు. అన్నిట్లోకీ బృహస్పతి పెద్ద. భూమికన్న ౧౩౦౦ రెట్లు పెద్ద.

సౌరమండలాన్ని గురించి సర్ విలియం హర్షల్ పదచిత్ర మిచ్చాడు. సుంద్రని అయిదుమైళ్ళ పొడుగు పొలంలో మధ్యన రెండు అడుగుల వ్యాసం గల భూగోళపు బంతి ఉంచండి. ఇది సూర్యుడనుకోండి. అక్కడికి ౧౬౪ మైళ్ళదూరాన ఉండే ఆవగింజ బుధుణ్ని సూచిస్తుంది. కేంద్రానికి ౨౮౪ అడుగుల దూరాన బటానీగింజ భూమివలె ఉంటుంది. ౬౫౪ అడుగుల దూరాన పెద్ద గుండుసూది తలకాయ అంగారకుని పోలిఉంటుంది. వెయ్యి, ౧౨౦౦ అడుగుల దూరాన ఇసుక రేణువులు ఉపగ్రహాలను సూచిస్తవి. అరమైలు దూరాన ఓ మాదిరి నారింజకాయ బృహస్పతి అవుతుంది. ౪ మైలు దూరాన చిన్న నారింజ శనిగ్రహం వంటిది. మైలున్నరదూరాన దొండపండు వరుణుడవుతుంది. రెండున్నరమైళ్ళదూరాన రేగుపండు నెప్ట్యూనును పోలి ఉంటుంది.

చర్మచక్షువుకు అయిదుగ్రహాలే కన్పిస్తవి. బుధుడు సూర్యుని కెంత దగ్గరగా ఉన్నాడంటే ఎప్పుడోగాని మనకు కనబడడు. ఇంకా ఆపైన ఉన్న శుక్రుని చూచిఉంటారు. ఉషస్సమయాన తూర్పు ఆకాశానను, అస్తమయవేళ పడమరను అప్పుడప్పుడు కనపడే కాంతివంతమైన గ్రహం ఇదే. భూమికక్షకు వెలుపల అంగారకుని కక్ష ఉన్నది. దాని రంగు

దాని నేలనుబట్టి ఉంటుంది. ధ్రువసంబంధమైన మంచుగుట్టలువినా అదంతా ఎడారి. వీటిని టెలిస్కోపుతో చూడవచ్చును. వీటి వృద్ధిక్షయాలు అంగారక ఋతువులనుబట్టి ఉండును. పెద్ద టెలిస్కోపుతో ఆకాశం స్వచ్ఛంగా ఉన్న రాత్రి చూస్తే దానిపైన నూటిగీతలవంటి గీరలు కనవస్తవి. ధ్రువ హైమనగాలనుంచి వచ్చే కాలువలప్రక్కన ఉండే పచ్చిక లని, లేదా కాలువలని కొందరు వీటినిగురించి అభిప్రాయపడుతున్నారు. అంగారకునిమీది సహజమైన గాలిపాటు చాలా పల్చన. అక్కడ మామూలువేడి ఇక్కడికన్నను తక్కువ. అక్కడ ప్రాణసంచారం ఉన్నదో లేదో తెలియదు. మామూలుకంటికి కనిపించే సుదూరగ్రహం శనిది. దీనిచుట్టూరా అనేక పల్చని, చదునైన, గిరున తిరిగే చక్రాలుండును. ఇవి టెలిస్కోపుకుగాని కనపడవు. వీటిపైన సూర్య కాంతి పడి అద్భుతరమణీయంగా ఉంటున్నది. వరుణుడు భూమికన్న ఎంతో పెద్దగాని చాలాదూరాన ఉన్నందున వచ్చిపడే సూర్యకాంతి ఎంతో ఉండదు. అందుకని కష్టంమీదగాని కనపడదు. దానిఉనికి బయటపడిన తర్వాత దాని చలనం పరిశీలించి ఆకాశ మార్గాల దాని గతి గుణించారు. ఊహించిన స్థానంలో ఆ గ్రహంలేదని కొన్నాళ్లతర్వాత గ్రహించారు. తెలియని మరొక గ్రహం వలన యీభంగం కలిగిఉండునని అనుమానించారు. ఇద్దరు ఖగోళశాస్త్రజ్ఞులు ఎవరికివారు స్వతంత్రంగా పూనుకొని యీ అవక్రమహేతువైన గ్రహం ఎక్కడ ఉంటే ఇలా భంగం కలుగుతుందో విచారించారు. ఒకేసమయాన ఇద్దరూ పరిష్కారం తేల్చారు. తరువాత కొంతకాలానికి త్వరలోనే కొత్తది, అన్నిటికన్నా అత్యంతం కొసన ఉన్నది నెప్ట్యూన్ అనే గ్రహం ఆ ఖగోళశాస్త్రజ్ఞులు ఎక్కడ ఉండాలని చెప్పారో అక్కడే బయట పడింది.

## ౯. చంద్రులు

అనేకగ్రహాలకు వాటిచుట్టూ తిరిగే బింబాలు ఉన్నవి. భూమికి అలాటిది చంద్రబింబం ఉన్నదని మనకు తెలుసును. నెప్ట్యూన్‌కు ఒకటి, శనిగ్రహానికి పది బింబాలు ఉన్నవి. మనచంద్రబింబంలో గాలి వీచదు. సహజంగా ఆవరించే గాలిపాటులేదు. మన కేసి ఎప్పుడూ ఒకే ముఖమే దానిది తిరిగిఉంటుంది. ఆవలివైపు ఎవరూ చూడలేదు. పూర్ణచంద్రుడని, నెలవంకఅని, అమావాస్యవెళ్లిన పాడ్యమినాటి చంద్రుడని వేళనుబట్టి అంటాము. సూర్యునినుంచి వచ్చిపడ్డ వెలుగుచాటున చంద్రుడు ప్రకాశిస్తున్నాడు. కనుక సూర్యుని వెలుతురు పడే భాగమే కన్పిస్తున్నది.

చంద్రబింబంపైన కొన్ని భాగాలు చక్రాకారంగా అగ్నిగుండంలాంటి గోతు లున్నవి. వాటి మట్టం చదును. సామాన్యంగా గుండంమధ్యనుంచి లేచే గోపురంలాంటిగుట్ట లుంటవి. అగ్నిగుండాలనే వీటిని గూర్చి అనేకసిద్ధాంతాలు పుట్టినవి. కాని ఏదీ సమ్మతం కాలేదు. చంద్రబింబవ్యాసము ౨వేల మైళ్లు.

చంద్రబింబం భూమి కన్న చిన్నది. భూమివలె ఇంత ఘనీభవించినదికాదు. కనుక చంద్రబింబంలో పదార్థాల తూకం ఇక్కడికన్న తేలికగా ఉంటుంది.

## ౧౦. ఉల్కలు

రాత్రివేళ స్వచ్ఛమైన ఆకాశంలో అదాటున వెలుగుబారు లనేకం కనబడటం కద్దు. ఒక త్రుటి కాలం కనబడి అవి మాయమైపోతవి. ఇవి ఉల్కల వల్లను పుడుతవి. అవి రాలుడు చుక్కలు. రోజూ భూమిపైనున్న గాలిపాటులోకి ఇవి లక్షలాది వస్తూ ఉంటవనుకోవచ్చును. ఇవి అనేకం ఎంతో చిన్నవి. కొన్ని ఇసుకరేణువులంత చిన్నవి. ఎంతో వేగాన అంతరాళంలో అవి దూసుకువస్తూండగా గాలిరాపిడికి వేడెక్కి మెరుస్తవి. ఆరే వరకూ వెలుగుతవి. లేదా రాపిడివలన వేడిపుట్టనంతగా మందగించేవరకూ వెలుగు

- పార్థివ శ్రావణము

తవి. వీటిలో కొన్ని మన సౌరమండలానికి చెందినవే. ఏటేటా ఆగస్టుమాసంలో ఇవి కొల్లలుగా కన్పిస్తవి. మిగిలినవి ఈ మండలానికి ఆవలనుంచి వస్తవనవచ్చు ను. భూమికి చేరేలోగా విశీర్ణమైపోనంత పెద్ద ఉల్కలను రాలుడుచుక్కరాళ్లు అంటారు. ప్రదర్శనశాలలలో అనేకం ఇలాటివిచూచి ఇవి ఎలాటివో గ్రహించవచ్చును. అవి విశేషం ఇనుముతో కూడినవి. ఇంత వరకు తెలిసిన ౯౨ ధాతువులలోకీ ౩౦ వీటిలో కన్పిస్తున్నవి. పుట్లకొద్దీ బరువుతూగే అసాధారణమైనవి ఒకొక్కపుడు లభించినవి. నేలమీదను చుట్టూరా మైళ్లమేర మార్మోగిన మోతతో రాలుడుచుక్కరాళ్లు బద్దలైన సందర్భాలు ఉన్నవి. మీకు కుతూహలముంటే ౧౯౩౨ లో సెంట్ లూయిస్ మీద బద్దలైన రాలుడు చుక్కరాతి వైనంగూర్చి తెలుసుకోండి.

—'ది సైన్సుఆఫ్ ఎవరిడేలైఫ్'లోనుంచి.



ఆమె ప్రతి రోజూ సాయంత్రం పిల్లలతో చల్లగాలికి బయలుదేరుతుంది. ఆమెను ఆమె సంతానాన్నీ ప్రతీ రోజూ చూచే ఆవీధి వారు–"ఆనందం అంటే ఆమెదే" అంటారు.



ఔను, ఆమె ఆరోగ్యవతి. ఆమె పిల్లలూ ఆరోగ్యవంతులు. కుటుంబానికంతకూ తన ఆరోగ్యం ముఖ్యమని యెరుగును. కనుకనే ఆమె సర్వదా "లోధ్ర"ను నమ్ముతూ వుంటుంది.

"లోధ్ర" ఋతుదోషాల్ని దూరంచేసి ఆరోగ్య సౌందర్యాల్ని భద్రపరుస్తుంది కనుకనే "లోధ్ర" స్త్రీజల కల్పవల్లి అన్నారు.

"లోధ్ర" అంతటా దొరకును.




సరికుటీరం లిమిటెడ్, రాయపేట, మదరాసు.

# హరనాథ్ ఆయిల్ ఎక్స్‌పెల్లర్



ఆయిల్ Expellors ను చవుకగా బెజవాడ నుండిగాని లాహోరు నుండిగాని వలయు వారికి రెడీస్టాకునుండి సరఫరా చేయబడును.

ఇవిగాక మావద్ద అన్ని మిల్లు సామానులు Expellors సామానులు సరసమైన ధరలకు అమ్మబడును.

ప్రొప్రయిటరు :—చుండూరి సీతారామయ్య,

కుసుమ హరనాథ్ ఇంజనీరింగ్ కంపెనీ, బెజవాడ

# వెవెల్ ప్రసావన వీగిపోయింది

## జూ౯ 14-జూలై 14 ఉపక్రమణ ఉపసంహారాలు

### = శ్రీ వేలూరి సదానందం =

వెవెల్ ప్రసావన వీగిపోయింది. ఆ ప్రసావన కొండంతఆశ పెట్టింది. దాన్ని పురస్కరించుకొని ఉబలాటపరులు అనేకులు ఆశపడ్డారు. ఆశ లోకప్పుడు పేరాశ లనిపించినవి. చివరికి అడియాశ లైనవి. ప్రస్తావన ఆమూలము గర్హించినవారుకూడా చివరికి యీాడేరకపోతుందా అనుకున్నారు. ఇంతా అవుతుందని నాడే చెప్పామన్నవారున్నూ లేకపోలేదు. వైఫల్యం ఆ ప్రస్తావనముఖాన వ్రాసిపెట్టిఉన్నమాట నిజమేకాని వేవెల్ లాఘవంవలన కొంతవరకు ఆశాజనకంగా అపోహలు కలగకపోలేదు. కాని సిమ్లాసభ జూన్ ౨౫, ౨౬, ౨౭, ౨౯ తేదీలలో సమావేశమై కొంత విపరీతంగా జులై ౧౪ కి వాయిదాపడినపుడే యిక గాలిలో దీపమూ అనిపించింది. అనుకున్నట్లుగానే తిరిగి జులై ౧౪ న సమావేశమైనపుడు ఎక్కువ కాలహరణం లేకుండానే తేలిపోయింది.

సిమ్లాలో వైస్రాయి చేసిన సభ కడసారి జులై ౧౪ న ౧౧ గంటలకు సమావేశమైనది. వైస్రాయి జూన్ ౨౯ నుంచి జరిగిన సంగతులపైనం తెలిపాడు. క్రొత్త కార్యవర్గం ఏ విధంగా, ఎంతమందితో ఏర్పడవలెను అనే విషయమై సభవారు ఒప్పుదల అయి, ఆ పైన పార్టీలవారు పేర్లజాబితాలను తనకు అందించవలెనని వైస్రాయి ఉద్దేశించాడు. అవసరమనిపిస్తే తనకు తోచినపేర్లు చేర్చి బ్రిటిష్ ప్రభుత్వానికీ, తనకూ, సభవారికీ అంగీకారయోగ్యమైన కార్యనిర్వాహకవర్గాన్ని కాగితంమీాద ఏర్పరచ జూచేవాడు. ముందుగా పార్టీనాయకులతో తాను ఏరుకున్న పేర్ల జాబితానుగురించి చర్చించి ఫైసలాగా తెలియజేయాలనుకున్నాడు.

కాని దురదృష్టం అలా ఉండకట్టి కార్యవర్గం ఏవిధంగా, ఎంతమందితో ఏర్పడవలెను అనే విషయమై సభవారు ఏకీభవించలేకపోయినందున ముందరస్తిగా అంగీకృతమైన యేసూత్రానుసారముగానున్నూ కాక పరిష్కారోపాయము అన్వేషించుటకు వైస్రాయి సభవారి ఆమోదంతో పూనుకున్నాడు. పార్టీలవారిని పేర్ల జాబితాలు యివ్వమన్నాడు. పార్టీనాయకులకు, సభవారికి అంగీకారయోగ్యమైన సమన్వయము సాధించుటకు తనచేతనైనది చేస్తానన్నాడు.

యూరపియన్ గ్రూప్‌వారు తమకు ప్రమేయం లేని కేవలభారతీయమైన యీ విషయంలో తామెవరి పేర్లనూ సూచించమన్నారు. ఈ గ్రూపున్నూ, ముస్లింలీగున్నూ తప్ప మిగిలిన పార్టీలవారందరూ జాబితాలు పంపారు. సభాసాఫల్యానికి సాయాశక్తులా ప్రయత్నించేవరకూ సభ వీగిపోరాదని వైస్రాయి నిశ్చయించుకున్నవాడై ముస్లింలీగు పేర్ల జాబితా పంపకపోయినప్పటికీ తానే ముస్లింలీగుపేర్లు కొన్ని చేర్చి తాత్కాలికంగా ఒక జాబితా తయారుచేశాడు. సభవారు అంగీకరించిఉంటే బ్రిటిష్‌ప్రభుత్వంవారికిన్నీ అది అంగీకారయోగ్యమయేదని భావించాడు. వైస్రాయి వ్రాసిన జాబితా యేమో, అందెవరి పేర్లు ఉన్నవో లోకానికి తెలియదు. కాని అన్నిపార్టీలకూ సమంజసమైన విధాన, తూకంగా, కార్యకుశలమైన కార్యవర్గం తన జాబితాను పురస్కరించుకొని ఏర్పడే

దని వైస్రాయి విశ్వసించాడు. ఏపార్టీకోర్కెలనూ పూర్తిగా అంగీకరించటం వైస్రాయికి సంభవమనిపించలేదట. వైస్రాయి తన సూత్రమును జిన్నాగారికి వివరించిచెప్పగా అది ముస్లింలీగుకు అంగీకారం కాదని చెప్పివేశాడు జిన్నా. అంతటితో ఇంక చర్చసాగించడము వ్యర్థమనుకున్నాడు వైస్రాయి. ఈపరిస్థితిలో వైస్రాయి తన జాబితా సంపూర్ణంగా జిన్నాగారికి చూపించలేదు. 'ఇతరనాయకులకు ఆ జాబితా చూపించనక్కరలేదనుకున్నాడు. సభ భగ్నమైనదని వెల్లడించాడు.

సభ భగ్నమైనదని కించపడ్డాడు. సభ ఏర్పాటు చేయవలెననే సంకల్పం ప్రధానంగా తనదే; సభ సఫలమైతే ఆ ఘనత తనకే వచ్చేది; కనుక భగ్నమైనందుకు పూచీ తనదేనన్నాడు. అందుకు ఏ పార్టీలనుగాని నిందించనన్నాడు. ఈ మాట విని, ఖండన దూషణలకు దిగకుండా ప్రవర్తించమని పరమోదారంగా ఆహూతులకు మనవిచేశాడు. తాను చేసిన యీ ప్రయత్నానికి పర్యవసానంగా మతకులవిరసము మరీ చెడరాదన్నాడు. జపాన్‌తో యుద్ధము జరగవలసినదే; పరిపాలన సాగవలసినదే; యుద్ధోత్తరవికాససన్నాహము కావలసినదే; ఈ పనులు ఇప్పటి ప్రభుత్వము నిర్వహించవలసినదే నన్నాడు. అందుకు ఎలాటి ఆటంకమూ కలగనివ్వనన్నాడు. తాను విధించగల మిక్కుటమైన పాటవంతో యీ పనులు చేయించటం తన విధి అన్నాడు. ఇకముందు తాను చేయవలసిన పనినిగూర్చి ఆలోచించుకొనే నిమిత్తము కొంత తడవు కావలెనన్నాడు. జపాన్‌తో యుద్ధము సాగవలెను, శాంతి భద్రతలు నిలుపవలెను అని తిరిగీ రెట్టించిచెప్పినాడు. తనకు విశదంగా తోచేవరకూ కొత్త ఉపాయం సూచించడం అసంభవమన్నాడు. వైస్రాయి రెట్టించి చెప్పిన మాటలో ధ్వని ఉన్నది. అది సుగ్రాహ్యము. నిత్యం అస్థిరమనుకునే ప్రభుత్వంవల్ల నిర్వాహం కాదు కనుక తరచుగా యిలాటి రాజకీయ చర్చలకు పూనుకోవడం కుదరదన్నాడు. ఇంతలో బ్రిటిష్ ప్రభుత్వం ఏమైనా నిర్ణయిస్తే కొంతకాలంవరకూ ఆ నిర్ణయాలు చెల్లవలెనన్నాడు. సభవారి సాయానికి, ఓర్మికి, గ్రహింపుకు వారలకు ధన్యవాదాలు చెప్పి యీ వెనుబాటుకు కుంగకండన్నాడు. చివరకు కష్టాలు తరిస్తాము, భారత భవిష్యదున్నతినిగూర్చి శంకలేదని సభవారిని ఊరడించి, హెచ్చరించి, సాగనంపాడు.

తాత్కాలికప్రభుత్వమును కూర్చి ఏర్పరిచేవిషయమై సిమ్లాసభ నిష్ఫలమైనది. వేవెల్ ప్రస్తావనలోని వేరేఏర్పాట్లకన్నిటికీ యిదే ప్రాతిపదిక. అయితే యీ విధంగా విఫలమే అయినప్పటికీ దాన్ని అంటిపెట్టుకొని కొన్ని మంచిచెడ్డలు మిశ్రంగా సంక్రమిస్తున్నవి.

వైస్రాయి చూపిన కొన్నిపేర్లు ముస్లింలీగుకు అంగీకారంకావని జిన్నా చెప్పాడు. అంతతో వైస్రాయి పీటీఅయినాననుకున్నట్లు చెబుతున్నాడు.

వైస్రాయి వేవెలూ, ముస్లింలీగు అధ్యక్షుడు జిన్నా యీసందర్భములో వ్రాసుకున్న ఉత్తరప్రత్యుత్తరాలు వెలువడినవి. జిన్నా పత్రికాసమావేశంలో చేసిన ప్రకటనలు, వేరేచేసిన వివరణాలు, యీఉత్తరాలు, ఇందుకు సంబంధించి పంజాబ్ ప్రధాని మున్నగువారు చేసిన ప్రకటనలు—వీటన్నిటినీబట్టి ముస్లింలీగునైఖరి కొంత తెలుస్తున్నది.

వైస్రాయికి పేర్లజాబితాలను పంపిన పార్టీలలో కాంగ్రెస్‌తప్ప మిగిలినవన్నీ అల్పాల్పములు. కాంగ్రెస్ ఏపేర్లను సూచించినదో, వైస్రాయి ఏమి మార్చదలచాడో, రాష్ట్రపతి ఆజాదూ వైస్రాయి వేవెలూ ఉత్తరాలలో ఏమి వ్రాసుకున్నారో పత్రికలవారి ఊహారచనలనుబట్టితప్ప మరేవిధంగానూ తెలియదు. ఏహేతువుచేతనో ఆఉత్తరాలు ప్రచురణకాలేదు. అవి బయటపడితే సిమ్లాసభ భగ్నతకు ఎవరు బాధ్యులో నిజంగా తెలుస్తుంది, అప్పుడు చెప్తాగదా నని జిన్నాగారు ఒక ప్రకటనలో తెలిపారు.

సభ ముగిసి ఆహూతులందరూ తరలిపోయిన కొన్నాళ్లవరకూ సభాభగ్నతకు బాధ్యులెవరనే వివాదరభస కొంత తీవ్రంగానే సాగి స్వాభావికంగానే చల్లారినది.

జిన్నా గారు ఏకవాక్యతపాసగకుండా మాట్లాడారు. సభకు హాజరై, కొత్తకార్యవర్గసభ్యుల పేర్లను సూచించేవరకూ కథనడిచినపుడు వేవెల్ ప్రస్తావనాంశములను ఆయాపార్టీలవారు హర్షించినారనేది స్పష్టమే. సిమ్లాసభకుపూర్వమే వైస్రాయితో ముచ్చటించి శంకానివృత్తి చేసుకోబూని, ఆపైన సభలో వరసగా పాల్గొన్నందున ఎవరికీ ఆవిషయమై సందేహం కలగలేదు. కాని వేవెల్ ప్రస్తావన ముస్లింలీగుకు బోను అనిపించిందని జిన్నాగారనటం అసలు మొదటికే వచ్చినట్లయినది. కథ అడ్డంతిరిగేసరికి జిన్నాగారు అంతవరకూ ఒప్పుదల అయినది తోసేసి ముందువ్యవహారానికి ఎలాటి బంధాలున్నూ లేకుండాచేసుకున్నారు. నూటికి ముస్లిములు ౨౮ మందిన్నీ, సవర్ణహిందువులు ౫౨ మందిన్నీ ఉండగా వేవెల్ పథకంవలన ౫౨ మందితోను ౨౮ మందికి సామ్యంలభించినది. ఎక్కడి ౫౨, ఎక్కడి ౨౮! భారతదేశంలో ముస్లిములకు ఏనాడూ లభిస్తుందనుకోని మహావరము బ్రిటిష్‌ప్రభుత్వము ప్రసాదించింది. సిమ్లాసభలో పాల్గొన్నవారు కొందరు అయిష్టం తెలిపినా లేచిపోలేదు; కంఠగతంగానైనా ఒప్పుకున్నారు. కాంగ్రెసుకూడా ఒప్పుకున్నది.

బీరములు, గర్జనలు, గంభీరోక్తులు, పాకిస్థాన్ జపనము, బ్రిటిష్‌వారికేసి మెల్లచూపులు, కాంగ్రెస్ నింద, హైందవదూషణ—యీ ద్వేషాతిరేక ప్రచారణవల్లనే జిన్నా ప్రతీపుడు ముస్లిములకు జన్మదుర్లభమనిపించినది వరప్రసాదిగా గ్రహించినాడు. క్రమేపి దిగజారుతున్న బ్రిటిష్ సర్కారుగాని, కాంగ్రెసుగాని ఇదంతా కాదని తుడిచిపెట్టవు. లభించినదేదో దక్కినట్లే; ఇక యింతతో ముస్లిములు సవర్ణహిందువులతోడి సామ్యమునకే సంతోషించరు. కార్యవర్గంలో ఎందరు సభ్యులున్నప్పటికీ సగముమంది ముస్లిము లుండవలెను. ౨౮ డోకడాలు (నూటిలో భాగము) ౫౨ డోకడాలకు సమానమంటే చాలదు. ౨౮ డోకరాలు మిగిలిన ౭౨ డోకడాలతో తులతూగుననిపించాలి. ఇదీ జిన్నాగారి కొత్తకోరిక. ఇంతేకాదు. ఆ ౨౮ డోకరాల తరఫున ౫౨ (౭౨?) డోకరాలతోను సరిసమానంగా ప్రతినిధులను నియమించే సర్వాధికారమూ ముస్లింలీగుకే ఉండవలెను. అంటే ముస్లిములకు శేషభారతముతో సమానఛాయా కలిగి, ముస్లిములంటే ముస్లింలీగే నన్నట్లుగా వ్యవహారం జరగవలెను—ఇదీ ముస్లింలీగు నవాకాంక్ష. సిమ్లాసభవలన ముస్లింలీగుకు లాభమేగాని నష్టంలేదు. అయితే సభ భగ్నమైనందున కలిగే పర్యవసానాలు ముస్లింలీగుకు అపకారం కావచ్చును.

జిన్నాగారు తిరిగి పాకిస్థాన్ ఆవాహన చేస్తూన్నందున సిక్కుల తరఫున మాస్టర్ తారాసింగు సిక్‌స్థాన్ కావలెనంటున్నారు. పాకిస్థాన్ హెచ్చుగా పంజాబును బాధిస్తుంది. పంజాబులో సిక్కులు ముఖ్యులు; కనుక సిక్కుల అంగీకారం అవసరము. పాకిస్థాన్ ఏర్పడకతప్పకపోతే సిక్‌స్థాన్‌కూడా ఏర్పడి తీరవలెనని వీరి వాదము.

ఇంతతో అఖండభారతనినాదముకూడా పుంజుకుంటున్నది. సవర్ణహిందువులకు, ముస్లిములకు సాటువ కల్పించినట్టి, అనగా లోకవిరుద్ధముగా, మరెచటనైనా దూష్యమై ప్రాణగొడ్డముగా ఎంచబడే పద్ధతిని, నూటికి ౫౨ మంది ఉన్న హిందువుల బలగంతో నూటికి ౨౮ మంది ఉన్న ముస్లిముల బలగమును సరిసమానంచేసివేసినట్టి యీ వేవెల్ ప్రస్తావనాంశమునకు ఇపుడిపుడు రాజకీయలాభము మాయమైన తరుణమున ప్రతిరోధం పుడుతున్నది. నూటికి ౧౮ మంది నిమ్నజాతులవారు, అంటే హరిజనులు ఉన్నారు. ఇపుడు యీ జాతుల సంఘమువారు తమ్ము చాలా హ్రస్వపరచినారని భావిస్తూ తమకు ఇతర కులమతాలవారితోబాటు అధిక ప్రాతినిధ్యం కల్పించవలెననీ, కనీసం సంఖ్యనుబట్టియైనా దామాషా హెచ్చించవలెననీ అంటున్నారు.

అయితే ముస్లిములలోనే జిన్నా నూతనవాదము, "వర"తిరస్కారము విపర్యయహేతువులు అవు

తున్నవి. ఈ సిద్ధించిన సవర్ణహిందూ - ముసల్మాన్ సామ్యతను వదులుకోవడం ఇష్టంలేనివారి బలగం ఎక్కువవుతున్నది. జిన్నా కొత్తకోరికలు చెల్లేవి కావనే అభిప్రాయము రూఢం అవుతున్నది.

ముస్లిములకు ప్రతినిధి సంస్థలు అనేకం ఉన్నవి; ముస్లింలీగే ఏకైకసంస్థ అనటం తగదు; పోయిన ఎన్నికలప్పుడు ముస్లింలీగు మొత్తం ౧౧ రాష్ట్రాలలోను ౪౮౬ ముస్లింస్థానాలకు ౧౧౦ మాత్రం గెలుచుకోగలిగింది. ఆతర్వాత కూటతంత్రంవలన ప్రతినిధులను తిరుగదోడి బలపడింది. పాకిస్తాన్ పురస్కృతమూ, ద్వేషభూయిష్ఠమూ అయిన ప్రచారాతిరేకంచేతను, బ్రిటిష్ప్రభుత్వపు ఆసరావల్లను, జాతీయసంస్థల అవ్యవస్థితధోరణివల్లను ముస్లింలీగు బలపడినట్లు కన్పించిందే గాని అది ఆభాసమాత్రమేనని ముస్లిములు పలువు రంటున్నారు. ౧౯౪౩ లో ముస్లింలీగు సర్కారు హమ్మకుతో వాయవ్య, సింధు, వంగ, అస్సాం, పంజాబ్ రాష్ట్రాలలో రాజ్యంచేసింది. ౧౯౪౫ లో ఆ అండ పోగానే కూలిపోయింది. వాయవ్యంలో కాంగ్రెస్‌మంత్రివర్గం వచ్చింది. పంజాబులో యూనియనిస్టుమంత్రివర్గం ముస్లింలీగును తృణీకరించింది. బెంగాలులో ఓడిపోయింది. అస్సాంలోను, సింధులోను కాంగ్రెసుఆసరాతో నిలిచింది. నేడో రేపో ఆమద్దతు తొలగగానే నేలకూలుతుంది అని లీగుప్రతికక్షులు తెలుపుతున్నారు. బలాబలాలు ఎన్నికలవల్లనే గాని తెలియవు కనుక వెంటనే కేంద్ర, రాష్ట్రీయ శాసనసభలకు యెన్నికలు పెట్టవలసినదని ముస్లింలీగు కోరుతున్నది. ఈఆగస్టు ఒకటిరెండు తేదీలలో ౧౧ రాష్ట్రాల గవర్నర్లూ వైస్రాయిని కలుసుకొని ఆయా రాజకీయవిషయాలు ముచ్చటించారు. ఎంతత్వరగా ఎన్నికలు జరుగుననుకున్నా ౧౯౪౬ సాలు మధ్యకరకు జరిగే వీలుండదేమోననిపిస్తున్నది.

ఇక కాంగ్రెసు విషయము వర్ణించడానికిగాని, వ్యాఖ్యానించడానికిగాని ఎక్కువ పత్రికలలోని వ్రాతలే ఆధారమగుచున్నవి. లోగడ తెలిపినట్లు ఆజాద్-వేవెల్ ఉత్తరాలు ప్రచురణకాలేదు. గాంధీ-వేవెల్ ఉత్తరాలు ఏమన్నాఉంటే అవిన్నీ ప్రచురణకాలేదు. కాంగ్రెసు కార్యసంఘం ఏమన్నా తీర్మానం తేల్చివ్రాసిఉంటే అదిన్నీ ఏమీ వెల్లడి కాలేదు. కాంగ్రెసు జాతీయధ్యాసతో ప్రవర్తించడం స్వాభావికము. అందులో విశేషము లేదు. రాజకీయంగా వేవెల్ ప్రస్తావన స్వరాజ్యద్వారం కాగలదని భావించి రాజ్యాధికారం ప్రజలపరం కావలెననే ఉత్కంఠతో కాంగ్రెసు ప్రవర్తించింది. ముస్లిములకు సహజంగా లేనట్టి అధికారప్రాతినిధ్యము అధ్యారోపితంగా కలిగించడము కాంగ్రెసుకున్నూ హితవుకాదు. ఇలాటి 'వరము' ముస్లిములకు ఉపకారం కాకపోగా అసహజమైన యీ 'ఉబ్బు' ముస్లిములకే నిజబలం తెలియనీయక విభ్రాంతులను చేస్తుంది. ముందు స్వరాజ్యం వస్తే ఇపుడు ఎలాటి షరతులకు ఒప్పుకున్నా బాధలేదనే విభ్రాంతిలో పలువురు పడిపోతున్నారు. ఇలాటి 'దానములు', 'స్వీకారములు' యిచ్చేవారికిగాని, పుచ్చుకునేవారికిగాని, హర్షించేవారికిగాని ప్రతిష్ఠ తీసుకురావు. మత కులపరంగా ఎప్పటికపుడూ ఇలాగే ఉపశమనచేస్తూ రాగా తీరని దాహము మండుకువస్తున్నది. స్వరాజ్యం రాకపోగా ఇప్పట్లో బాధలు హెచ్చిపోయి ఆవచ్చే స్వరాజ్యము వచ్చేనాటికి అర్ధవిశీర్ణంగా రాగలదనే భీతు కలగడము సహజము. లోకంలో అన్నిరాజ్యాలలోను అధికులున్నారు, అల్పులున్నారు. అధికులపాలబడి అల్పులు నలిగిపోతారేమోననే జంకు కలగటం అసహజమనిపించుకోదు. కాని అల్పులు మిగిలిన అధికులతోపాటు రాజ్యశ్రేయస్సే తలుచుకునే యెడల సమాధానం తేలికగా కుదురుతుంది. అల్పుల నాగరికసంస్కృతీ, మత దేవతార్చన భాషాదివిషయాలలో ఎలాటి అపకారమూ జరగకుండా కాపుదలగా కొన్ని సంప్రదాయపు షరతులు పెట్టుకోవచ్చును. అది లోకవ్యవహారము.

కనుక కాంగ్రెసు యీ ఉపశమనఉపాయమును మార్చుకోవలెనని ప్రతికక్షులు చెప్పే మాటలో అర్థమున్నది. దుర్బలస్థితిలోనే యిలాటి ఉపాయాలంబన

చేస్తారు. ముస్లింలీగు, లీగు నాయకుడు జిన్నా కాంగ్రెసును హిందూసంస్థగా, శత్రుకోటిగా ఎంచుకుంటూన్నారు. ఇపుడేకాదు, వెనకనుంచీ అంతే. కాంగ్రెసు యింకా ఆభాసపు మంచితనానికిపోక, ఉన్న స్థితి ఉన్నట్లుగా గ్రహించి, ప్రవర్తించవలెననే వాదము కాంగ్రెసువారిలోకూడా బలపడుతున్నది. ముస్లిములలోకూడా లీగ్ వ్యతిరిక్తమైన జాతీయముస్లిం సంస్థలు అనేకం ఏకోన్ముఖంగా ప్రవర్తించి ముస్లిం ప్రజానీకపు జాతీయస్వభావాన్ని ప్రతిఫలింపజేయబూనుకుంటున్నవి. మౌలానాహుస్సేన్ అహమ్మద్ మదానీగారిని (జమైతుల్ ఉలేమా అధ్యక్షుడు) కాంగ్రెసు కార్యసంఘసభ్యునిగా నియమించటం ఈసందర్భంలో ముఖ్యమైనదే.

కాంగ్రెసు ప్రభుత్వంతో కలహించి విరోధించుటకు చాలా సబబున్నది. కాని దేశంశ్రేయస్సుకోరి కాంగ్రెసు వ్యాకులగతాన్ని మరచి ఉదారంగా ప్రవర్తించింది. దేశానికి లభించగల రాజ్యాధికారం యియత్తను వివేచించడంలోనేమి, తాత్కాలిక ప్రభుత్వరచనను యోచించడంలోనేమి కాంగ్రెసు చాలా గణ్యతగా మెలిగింది.

బ్రిటిష్‌ప్రభుత్వం యింతవరకూ బాసటగా నిలుస్తూవచ్చిన ముస్లింలీగును యీసమయంలో హీనపరచడం అవసరమైనది. అందువల్ల చాలా లాఘవంగా వైస్రాయి-అల్లాగని వాచా అనకుండా-ముస్లింలీగే సిమ్లాసభభగ్నతకు కారణమని ధ్వనింపజేశాడు. కాంగ్రెసు సూచించినపేర్లలో కాంగ్రెస్‌వారినే-అందులోను కాంగ్రెస్‌లోని ముస్లిములనే వైస్రాయి కొట్టివేశాడని వినికిడి. అయితే ఆసంగతి వైస్రాయి రాష్ట్రపతికి తెలుపలేదు. ఈసారి యీ'బద్నామ్' జిన్నామీదుగా పోనివ్వదలచి వైస్రాయి యిలాచేశాడనే వ్యాఖ్యానం వినవస్తున్నది. అయితే యీసందర్భంలో రాష్ట్రపతి ఆజాద్ చెప్పినమాట జ్ఞప్తికివస్తుంది. ఆఖరుకు కాంగ్రెసులోని ముస్లిముల పేర్లనుగూడా వదులుకొనుటకు ఇష్టపడ్డాననీ, కాంగ్రెసుకూ లీగుకూ చెందని యిద్దరుముస్లిములుండాలనీ రాష్ట్రపతి ఆజాద్ స్వంతపూచీమీద, అంటే కాంగ్రెసుకార్యసంఘప్రసక్తి లేకుండా జిన్నాగారికి సూచిస్తే ఆయనగారు అందుకుగూడా అంగీకరించలేదని ఆజాద్ వెల్లడించారు. ఇది జిన్నాగారు అంగీకరిస్తే కాంగ్రెస్‌కార్యసంఘంచేత ఒప్పించగల్గుదుననికూడా అన్నారట. ఈసూచనలో రాజకీయమైన గాఢాభిలాష ద్యోతకమౌతున్నది. స్వయముగా ముస్లిమై, కాంగ్రెస్‌కు తలమానికంగా ఉన్న ఆజాదే యిలా సూచించారంటే వారి ఉత్కంఠను గ్రహించవచ్చును. కాని జిన్నాగారు కోరేది ముస్లింలీగుకు సర్వసామ్యము, సర్వస్వామ్యమూను. కాంగ్రెస్ చేయవలసినంతా చేసింది. ఇంకా దిగితే ఆత్మహానము.

"వైస్రాయి ఏమన్నప్పటికీ ముస్లిములకు ముస్లింలీగే ఏకైకప్రతినిధి యని కాంగ్రెస్ ఒప్పందపడితే అంతా తేలిపోయేది కదా! అంతదూరం వెళ్లిన కాంగ్రెసు ఆ కాస్తగూడా ఒప్పుకుంటే యేమయేది? ఈ విధంగా కాంగ్రెసు, ముస్లింలీగు సంఘీభవించి రాజ్యాధికారం సాధించగలవుగదా! ఇంతతోనే కాంగ్రెసు జాతీయత పోతుందా" అని అనేకులు ప్రశ్నిస్తున్నారు.

ఒకవేళ ఇలాగున కాంగ్రెసు, ముస్లింలీగు ఏకీభవించి ప్రవర్తిస్తే బ్రిటిష్‌ప్రభుత్వం ఎలా ఫిరాయించేదో బ్రిటిష్‌వారి నడవడి తెలిసినవారికి వేరే చెప్పనక్కరలేదు. "కాంగ్రెసు, లీగు ఏకమై, ఆ రెండు సంస్థలకూ చెందని జనబాహుళ్యం వద్దంటూండగా శాసించనివ్వటానికి బ్రిటిష్ ప్రభుత్వం ఒప్పుకోదు. భారతదేశమంటే లీగు కాంగ్రెసులే కాదు. తద్భిన్నమైనవారియెడల బ్రిటిష్ సర్కారు నెరవేర్చవలసిన పూచీబాధ్యతలను ఉపేక్షించి ఊరుకోలేదు." అని యీ ధోరణిలో వేవెల్ జవాబుచెప్పిఉండేవాడనేది దురూహ్యం కాదు. కాంగ్రెసు ముస్లిముల పేర్లను తీసివేసి, వైస్రాయి లీగుకాంగ్రెసులకు చెందని ముస్లిమును సూచించాడనటంలోనే యిది తెల్లమౌతున్నది. ముస్లింలీగే ముస్లిములకు ఏకైకప్రతినిధిసంస్థ అని కాంగ్రెసు అంగీకరించినా బ్రిటిష్ ప్రభుత్వం అంగీక

రించదు; అంగీకరించలేదు. అంగీకరించకపోతే మానె-కాంగ్రెసు-లీగు ఐక్యత కుదిరితే అదెంత గొప్ప విషయం, ఇంక స్వరాజ్యం వచ్చినట్లే అని అనేవారున్నారు. ముస్లింలీగు ఎలాటిదో, కాంగ్రెసు ఎలాటిదో, రెండుసంస్థల ధ్యాస యేమో, కార్యగతి యేమో, పూర్వంనుంచీ వస్తున్న వైషమ్య హేతువులేమో, ముస్లింలీగున్నూ, లీగు అధ్యక్షుడు జిన్నాయున్నూ కాంగ్రెసును హిందూసంస్థగాను, శత్రువుగాను ఎలా చూచుకుంటూవస్తున్నారో తెలిసినవారెవరూ యీ విధంగా ఆలపించరు. ఈ ఆలాపనలు వినగా వినగా "తివిరి యిసుమున తైలంబు తీయవచ్చు" నన్న పద్యం జ్ఞాపకంవస్తున్నది.

కాంగ్రెసు యిలా చేస్తే ఏమవుతుంది? ఇన్నేళ్లుగానూ జిన్నాగారు కాంగ్రెసును యీ స్థితికి కుంచించి హ్రస్వపరచవలెననే పట్టుదలతో ప్రచారం చేస్తూవచ్చారు. వెనక కాంగ్రెసు-లీగు మంతనాలమాట వచ్చినపుడు కాంగ్రెసు తరపున వచ్చే ప్రతినిధులందరూ హిందువులే కావలెనుగాని, ముస్లిములు రాకూడదని ఆయన ఉద్ఘాటించాడు. ఎప్పుడైతే కాంగ్రెసు ముస్లిములకు ప్రతినిధిగా వ్యవహరించకుండుటకు అంగీకరిస్తుందో అప్పుడే జిన్నాగారి వాంఛ ఫలించి, దేశంలోని హిందువులకు కాంగ్రెసు, ముస్లిములకు లీగు ప్రతినిధిసంస్థ లని వెల్లడవుతుంది. అధికృతంగా వ్యవహరించవలసిన తరుణంలో కాంగ్రెస్ హిందూప్రతినిధులను నియమించడముతో సంతసించి, అయినా ఫరవాలేదు నా జాతీయత భంగపడలేదు, ముస్లిములకు హిందువులు ప్రతినిధులుగా వ్యవహరించరాదా యేమిటి, ఐక్యతకు తాత్పర్యం అదేనని చెప్పుకొని స్వవచోమాధుర్యానికి మోహపడవచ్చును గాక కాంగ్రెసు అఖిలభారత జాతీయసంస్థగా నశించిపోతుంది. అడపాదడపా బ్రిటిష్‌ప్రభుత్వమూ, నిరంతరమూ జిన్నాగారూ ఇందుకే గమకిస్తూ వచ్చారు. కాంగ్రెస్‌వారిలోనే కొందరు స్వరాజ్యప్రాప్తికై ఎంతకైనా దిగవచ్చుననే మహామతులు ఉద్భవించినారు. ఇది త్యాగ మనిపించుకోదు. ఈ మార్గాన స్వరాజ్యం వస్తుందన్న ప్రశ్నయే పెద్దతప్పు. స్వరాజ్యం యిలా రాదు. రాకపోగా, వర్తమానస్థితి దారుణంగా పరిణమించి స్వరాజ్య ప్రవర్తకశక్తులు దుర్బలమై కొంచెపడి విలాయతీ సర్కారుభద్రతకు సాయపడుతున్నది.

కాంగ్రెసును, లీగును బ్రిటిష్‌ప్రభుత్వం కదిల్చి ఒక ఊపు ఊపిచూడాలనుకున్నారు. వారి కిప్పట్లో కాంగ్రెస్‌వైఖరి అనుకూలంగా ఉంది. లీగును అపఖ్యాతిపాలు చేయదలచారు. నిజంగా బ్రిటిష్‌ప్రభుత్వమే ఫైసలాయతీ చేయదలచుకుంటే ఈజిప్టులో ఆలెన్బీలాగా ఇక్కడ వేవెల్ జిన్నాను, ముస్లింలీగును శాసించి వినిపించేవాడు. కాని అలనాడు క్రిప్సుయాత్రలాగానే యిపుడు వేవెల్‌ప్రస్తావనకూడా నిశ్చయార్థం లేక వీగిపోయినద్ది. బ్రిటిష్‌ప్రభుత్వంవారు అంతవరకే, ప్రస్తావనవరకే తలుచుకున్నారు. ఫైసలాయతీని వారు ఉద్దేశించలేదు. కొంతకాలంవరకూ వారిపై ఎలాటి నెపమూ ఉండదు. ఇంతలో ఎన్నికలు అయిపోతవి. సందర్భానుసారం అపుడు విచారించుకోవచ్చును. జూన్ ౧౪ రాత్రి వైస్రాయి వినిపించినదానికీ, జూలై ౧౪ నడవడికీ వారడి చాలా ఉన్నది. అది అనాలోచితంకాదు.

ఎన్నికలలో కన్సర్వేటివ్‌పార్టీ ఓడిపోయింది. లేబర్‌పార్టీ పెద్దగా గెలిచింది. రేపో మాపో కొత్త ప్రభుత్వం కుదురుకున్నాక త్వరలోనే తిరిగీ భారత విషయము తట్టక తప్పదు. కన్సర్వేటివ్‌ప్రభుత్వం కన్న లేబర్‌ప్రభుత్వం ఎక్కువ హుందాగాను, భారీగాను పూనుకుంటుం దనుకోవడంలో విశేషం లేదు. అది స్వాభావికమేను.

ఇంతకూ భారతరాజకీయస్థితి సర్కారువారు ఏమి చేస్తారు అన్నదానిపైన ఆధారపడిఉండే దుర్గతిపట్టింది. ప్రజలకు తాహతు లేకపోవడము, ఉన్న కుంభితశక్తి స్వరాజ్య సాధనకై ఏకతానంగా ప్రసరించకపోవడము ఇందుకు హేతువులు. జాతివీరశూరులు యింకా బందీఖానాల్లో ఉన్నారు. కాంగ్రెసుకార్యసంఘ సభ్యులు, దేశనాయకులు విడుదలై తదనుగతంగా కొంత మెడతిప్పుకునే వీలు కలిగిందనేమాట తప్ప దుస్థితి అలాగే ఉన్నది. గవర్నర్ల సమావేశానంతరం తత్పరిణామంగాను, కొత్త బ్రిటిష్‌ప్రభుత్వపు నూతన విధానానుసారంగాను పరిస్థితులు బాగుపడగలవని ఆశించటానికి తార్కాణ లేకపోలేదు. (౨-౮-౪౫)

# కలగూరగంప

## క్రీడాభిరామము - అధ్యా.

శ్రీ క్రీడాభిరామములో (౨౬-వ పుట)లో నీ క్రింది పద్యము గలదు:—

"కోయిల పంచమస్వరము
క్రోల్చినభంగిని విద్దిహూచి రా
మాయణ మాఱుకాండలును
నచ్యుతజాగరవేళ బాడె నా
రాయవితంతురత్న మను
రాగముతోడ "నమశ్శివాయ శాం
తాయ సమస్తదోషహర
ణాయ" సమానమె దానికెవ్వరుణ్ ?"

పై పద్యము లక్ష్మణ వఝ్ఝల యింటిపట్టుగ్గన లోనిది. ఇందు సూచింపబడిన రామాయణ మాఱు కాండలును నధ్యాత్మరామాయణమని చెప్పదగియున్నది. అధ్యాత్మరామాయణమున తొలికీర్తనయందలి పదములే యిందును కొననగుచున్నవి. మరియు నా కీర్తన యందలి తొలిపదమగు "నమశ్శివాయ" యనునదియే పై పద్యమునందుగూడ నెత్తుగడ. అధ్యాత్మరామాయణ ప్రథమ కీర్తన యిది :

ధన్యాసి : ఆదితాళము

"పల్లవి—నమశ్శివాయ తే నమోభవాయ

అనుపల్లవి - సమానాధికరహితాయశాంతాయ స్వప్రకాశాయ - ప్రమోదపూర్ణాయభక్తౌఘపాలనాయ.

తరుణేందుశేఖరాయ పరమపురుషాయ భవహర ణాయ శ్రీకాళహస్తీశ్వరాయ"

ఇందును నాఱుకాండలే కలవు. క్రీడాభిరామములోని పద్యము ఆగ్రంథములోనిదే యగుచో శ్రీనాథుని కాలమునకు, అనగా ౧౫-వ శతాబ్దమునకే ఈకీర్తనలు ప్రఖ్యాతములై యున్నవని యెన్నవగును. దీనిని రచించిన మునిపల్లె సుబ్రహ్మణ్యకవి అధునాతనుడని తెలియుచున్నది. కాని, యధ్యాత్మరామాయణమందలి సంస్కృతాంధ్రరచనను, కీర్తనయందలి కట్టుబాట్లను గమనించినచో ఇది ప్రాచీనమనియే యూహింపదగియున్నది. తాళ్లపాక అన్నమయ్య గారి సంకీర్తన లక్షణములందలి లక్షణముల కధ్యాత్మరామాయణములోని కీర్తనలు సరిపోవుచున్నవి.

సంగీతసాహిత్యవేత్త లధ్యాత్మరామాయణమునకు గల ఉత్తమసాహితీస్థానమును నిరూపించినయెడల తెలుగున పదవాఙ్మయమునకు గల ప్రశస్తి తేటపడ గలదు. పదవాఙ్మయముననే పడియుండి యున్నత సాహితీశ్రేణికి జెందదగిన పెక్కుకీర్తనలవలె నిదియు నేటికిని తెలుగునాటియింతుల నాల్కలయందు నాట్యమాడుటయే దీని ప్రాచీనతకు గుఱుతు.

నిడుదవోలు వెంకటరావు.

## మౌనవ్రతము

మౌనమును మనవారు వ్రతములలో ఉత్తమ వ్రతముగా పరిగణించినారు, మన ప్రాచీన

మహర్షులు, యోగులు దీనిని తప్పనిసరివిధిగా అనుష్ఠించి చూపినారు. గాంధీజీ అన్నపానముల విషయములో నయినను రవంత పట్టుదల వీడునేమోకాని మౌనమును మాత్రము సల్లువిడవని పట్టుదలతో సక్రమముగా సాగించుకొనివచ్చుచున్నాడు. దీనిలో ఎంతసుగుణమో నిక్షిప్తమయియుండనియెడల ఆయనకు దీని నింతటి శ్రద్ధాసక్తు లెందుకువచ్చును? అతివిస్తర మెందుకు? 'మౌనం సర్వార్థసాధక'మ్మని ఆభాణకమే వచ్చినది. దీని గుణగణములను గురించి శాంతిఆశ్రమవాసులయిన ఓంకారస్వామిగారు రచించిన ఒక రచననుండి ఉద్ధృతములైన ఈ క్రింది కొలదిపంక్తులను పరికించి దీని విశిష్టలక్షణమును గ్రహించునది:

"బుద్ధిని తప్పుత్రోవకు మరల్చుటకును, జీవుల నధోగతిపాలు చేయుటకును 'మాయ'యొక్క ముఖ్యాయుధమైనటువంటి దశేంద్రియములను వశీకరించుకొనుట మహత్తరమైన కార్యము. ఈ దశేంద్రియములలో ముఖ్యమైనది 'వాక్కు'. దీనిచేతనే మంచియైనను చెడ్డయైనను మనకు లభించును. ఈ వాక్కు మనవశములో లేనిసమయముననే మన కోపము కొలదిగా ఎదుటివానిని తప్పొప్పులను పాటించకుండ దూషణ చేయుచున్నది. దీనివల్ల సకలకార్యములును పాడగుచున్నవి. ఈ'వాక్కు' పరిశుద్ధముగ, మాధుర్యముగ నున్నప్పుడే ఎదుటివాడు దాసానుదాసుడై సమ్మోహితు డగుచున్నాడు. "వాగ్భూషణమే సుభూషణము", "నోరు మంచియయిన ఊరు మంచి" అన్నట్లు మన నోటిని, మన 'వాక్కును' మనవశములో ఉంచుకొనగలుగుట ఎంతో భాగ్యము. ముఖ్యముగా కోపము వచ్చినప్పుడు, ఎక్కువ సంతోషముగా నున్నప్పుడు ఈనోరు విచ్చలవిడిగా ప్రేలుచుండును. అందుచేత అకస్మాత్తుగా ఏరెండుమూడు దినములలోనో దీనిని వశపరచుకొనగల మనుకొనుట వెర్రితనము. కాన దీనిని వశపరచుకొనుటకు దేహపరిశ్రమ చేయు విధముగనే 'మౌన'మును సాధన చేయవలెను.



దేశభక్త కొండా వెంకటప్పయ్య పంతులుగారికి మద్రాసు కార్పొరేషన్ వారి సన్మానము.

నోటినుండి ఏమాటకూడ పైకి వెడలగక్కకుండ దినమున కొక అరగంటయో, పావుగంటయో ఏ కొంతస్థలమునకూర్చొని యుండవలెను. ఇదియే మౌనము. ఇటువంటి సమయాలలో బుద్ధినికూడ ఏవిధమైన విషయవాంఛలపైగాని పోనీరాదు. పరిగెత్తిపోవు మనస్సును పట్టుకొనిధ్యానమందే యుంచవలెను. ఇట్టి మౌనమునేగదా గాం

ధీజీ అవలంబించి "మహాత్ము" డైనాడు. దీనినేగదా పెద్ద పెద్ద మహర్షులు, యోగులు, సన్యాసులు అవలంబించి మాయను దాటగల్గుచున్నారు. ఇది ఒక్కదినములో, ఒక్క వారములో, ఒక్క నెలలో, లేక ఒక్క సంవత్సరములో వచ్చెడి విద్యగాదు. కొన్ని సంవత్సరాలు సాధనచేసినను కొంతమంది దీని ఫలము నాశింపజాలకున్నారు. కారణము వారు పేరునకు మౌనముగ నుందురు గాని వారి బుద్ధి చంచలమైయుండును. అందుచేత బుద్ధినిగూడ బంధించి మౌనముగ నుండుటయే 'మౌనము'.

బొత్తిగా మాట్లాడకుండ కూర్చొనియుండుట "కారణమౌనము". ఏ పనియుచేయకుండ, కదలకుండ, ఎదుటివారితో ఏదైన మాట్లాడవలసినప్పుడు ఏదో కాగితముమీద వ్రాసియో, సంజ్ఞలచేత చేయూపియో తెలుపుట మొదలగునవి ఏవియు లేకుండుట "కష్ట మౌనము". కష్టమౌనము చాల కష్టమైనను త్వరలో ఫలితమగుపడును.

మౌనములో ఉండునప్పుడు "ఊహూ... ఆహా!" అనునవికూడ మానవలెను. ఇవి అనునప్పుడు తెలియకయే మననోటినుండి మాటలు వచ్చివేయును. అందుచేత మాట్లాడుటకంటె ఇది మరియుచెడ్డది. దీనివల్ల ఎక్కువశక్తి వినియోగపడును. ప్రతిరోజు మనము పనిచేసి కష్టపడుచున్నాము. మన దేహమునకు విశ్రాంతి కావలసిఉంటూనేయున్నది. అట్లాగే మనము తెలివిగా ఉండగనే మన నోటికికూడ కొంచెము విశ్రాంతి నివ్వవలెనుగదా! ఎక్కువసేపు మౌనమవలంబించుట కవకాశము లేని రోజులలో దినానికి ఒక అరగంటయో, పావుగంటయో మౌనముగనుండి ఆకాలమందు భగవంతునిపై ధ్యానము, జపము, తపము, మంత్రోపాసన మొదలగునవి చేయవచ్చును.

ఈమౌనము ఉదయమో, సాయంకాలమో, లేక అథవా నిద్రపోవుటకుముందో ఒక్క అరగంట అయినను చాలు. దినమునుచేయుట కవకాశమున్నచో



మంచిది. "పెద్దపెద్ద పరుగులకంటె" వారమున కొక సారి చేసినను చాలు. ఆఖరుకు ఇట్లుచేయుటకుకూడ వీలులేకపోయినచో దినచర్యలలో ఇతరులతో మాట్లాడునప్పుడు పెద్దపెద్ద లెక్చర్లు, అనవసరపుమాటలు, వాదనలు, తర్కవితర్కాలు తగ్గించి ఎంత మాట్లాడనవసరమో అంతటితోనే సరిపుచ్చవలెను. మన యునికి మనకు సరిపడనిచో ఏకాంతప్రదేశమునకు ఏపార్కుకో, ఏబీచికో, జనసంచారము తక్కువగ నుండు స్థలమునకు పోవలెను. లేదా, ఏదేవాలయములోనైన కూర్చొనవచ్చును.

ఈ మౌనము మొట్టమొదట ప్రారంభదశలో తక్కువకాలములో ప్రారంభించి తదుపరి క్రమముగా అభివృద్ధిచేయుట మంచిది. కొంచెము కష్టమని తోచినప్పుడు జపము, ధ్యానము, వేదాధ్యయనము, గీత మొదలగువానిని లోలోనపఠించుట మొదలగునవి చేయ

వచ్చును. ఒకవేళ అది చేయుట కష్టమని తోచినచో మౌనమును ఆపివేయుటయే మంచిది. దీనిని క్రమముగా అభివృద్ధిచేసినందువలన లాభములనేకము లున్నవి. కాని ఒకేసారి పట్టుగా కూర్చొనునది కష్టసాధ్యము; కష్టతమము. కొన్ని మౌనమునకు వారముదినములలో ఏదో ఒకదినము ఎంచుకొని అందులో ఒకగంటయో, రెండు మూడుగంటలలో మౌనముగా నుండుట మంచిది. సెలవుదినాలలోను, తీరికయున్నప్పుడును మౌనములో నుండుట మంచిది. దినమునకు రెండుగంటలతో మొదలు పెట్టి క్రమేణ అభివృద్ధిచేయుచు పోయినచో కొన్ని నెలలతర్వాత ఆవ్యక్తిలో నెంతో ఆనందము, కళ, ఉత్సాహము, ధైర్యము కన్పించును. లిఖితజపము కూడ ఈమౌనములో చేయవచ్చును. మౌనములో నుండునప్పుడు తలపులను బాహ్యేతరముగా త్రిప్ప వలెను. దురుద్దేశాలను ఆపుచేసి మనస్సును భగవంతునిపై కేంద్రీకరించవలెను.

'మౌనములో' కష్టమని తోచినప్పుడు కథల పుస్తకాలు, నవలలు, పత్రికలువగైరాలు చదివినచో మన మనస్సు ప్రాపంచిక బంధాలపైకి పోవును. అట్టిమౌనమును తుదకు హిమాలయపర్వతములదగ్గర చేసినను ఎన్నాళ్లు చేసినను ఫలము లభించదు.

ఏమాత్రము మైమరచినను చెడ్డత్రోవలోపడి మాయాసాగరమున జొచ్చి కుడితిలోని ఎలుకమాదిరిగా గింజుకోవలెను. అందుచేత మనస్సును వశమునందుంచుకొని ఏకతానత్వమున నిలుపుట చాల అవసరము. దానికి ఈ మౌనము ఒక పరమోపాయము. మనో నిశ్చలత, సత్యము, ధైర్యము మొదలైన అనేక సుగుణములు ఈ మౌనమువల్ల అలవడగలవు.

కనుకనే ఇది వ్రతములలోకెల్ల ఉత్తమ వ్రతమైనది.

గుత్తి నాగేశ్వరరావు.



ఆనాటి కనకవాడ – నేటి బెజవాడ.



# విమర్శనము



## ఆంధ్రజ్యోతి

సచిత్రమాసపత్రిక. సంపాదకుడు: చక్రపాణి గారు. కార్యస్థానము: ౪౩, ఆచారప్పన్ వీధి, జి. టి., మద్రాసు. డెమ్మీ ఎనిమిది పుటల సైజు. సుమారు ౮౦ పుటలు. సంవత్సర చందా ౫ రూపాయలు. విడిపత్రిక ౬ అణాలు.

ఇదివరలో వారపత్రికగానుండిన ఆంధ్రజ్యోతి రెండు సంవత్సరములుగా అజ్ఞాతవాసముచేసి తిరిగి ఇప్పుడు మొన్న జూలై ప్రారంభమునుండి మాసపత్రికగా పునర్నిర్మాణము చేయబడినది. దీని ఆదర్శ ఉద్దేశ్యములను గురించి సంపాదకులు మనస్ఫూర్తిగా ఇట్లు వ్రాసియున్నారు: "ఈ ఆంధ్రజ్యోతి ఆంధ్రులకు కొత్తగా మార్గం చూపిస్తుందనిగానీ, కనీసం పెద్ద వెలుగు నిస్తుందనిగానీ మేము చెప్పలేము. కాని పెద్దలు నడిచే మార్గాలనూ, నాయకులు వేసే దోవలనూ మాత్రం ఇది చూపించగలదు. ఇదే మేము ఆంధ్రులకు చేయగలిగిన సేవ."

జూలైలో వెలువడిన మొదటి సంచికనుబట్టిచూడగా ఈ పత్రికలో కథలు, కబుర్లు, విజ్ఞాన వినోదములు, విమర్శలేశములు మొదలైన లఘురచనలకే ఎక్కువ ప్రాముఖ్యముండగలదన్నట్లు ఊహింపనయియున్నది. కాని అందులోనే ఒక శిష్టప్రమాణమును నెలకొల్పి, ఉత్తమ స్థాయిలో నిర్వహించి, పైన చెప్పిన ఆదర్శోద్దేశ్యముల కనుగుణముగా ఈ పత్రిక కలకాలము కర్తవ్య నిర్వహణచేయగలదను సూచనలు ఈ తొలిసంచికలో రూఢమూలములై యున్నవి.

---

## ఆముక్తమాల్యదపర్యాలోకనము

రచయిత: వెల్లండ ప్రభాకరరావుగారు. ప్రకాశకులు: సాధనసమితి, సికింద్రాబాదు. వెలరూపాయ.

రాయలవారి ఆముక్తమాల్యద ఉద్దండపండితులకే అయఃపిండము. దాని వస్తుతత్వపర్యాలోకన మనగా మాటలతో పనికాదు. అది అనేకవాదవివాదలకును, గహనమైన సిద్ధాంతరాద్ధాంతములకును ఆకరమయినది. వానినెల్ల తడవుటకు పెద్ద పోకడ పోవలెను. ప్రస్తుతగ్రంథము అంత పెద్ద సమీక్షకాదుగాని, ఇది సాహిత్యోత్సాహులయిన నవవిద్యార్థులకు ఆ ప్రకృష్ట ప్రబంధమును గురించి పరిచయలేశము గలిగించుటకు మాత్రము బాగుగా తోడ్పడవచ్చును. ఉత్సాహోద్రేకములకొలది ఒక వర్ధిష్ణురచయిత వ్రాసిన ఈపర్యాలోకన గ్రంథము నింతకన్న విపులముగా విమర్శించి నెరసులను నెమకుట పాడిగాదు. కాని ఈసాహిత్యోత్సాహమును సమగ్రముగా పెంపొందించుకొని యీ రచయిత మున్ముందు ఇతోధికసంపన్నమైన రచనలను తప్పక సృష్టింపగలడని మాత్రము గట్టిగా చెప్పనయియున్నది.

## (గ్రంథస్వీకారము)

### నయాగరా

రచయితలు: రామదాస్, ఆంజనేయులు, సుబ్రహ్మణ్యంగార్లు. ధర రూపాయి. ప్రకాశకులు: నవ్యకళాపరిషత్తు, నరసరావుపేట.

---

### కమలాభాస్కరము

అద్దేపల్లి నాగభాస్కరరావు, కమలాదేవిగార్ల కల్యాణమహోత్సవ బహూకృతిగా రచింపబడిన చిన్న పద్య సంగీతనాటిక. రచయిత: శ్రీ సత్యనారాయణరావుగారు (శ్రీ వాత్సవ).

---

### శృంగారతరంగమాల

రచయిత: ఆమంచ మాణిక్యశర్మగారు. ప్రాప్తిస్థానము సం।దః ముద్రాశాల, కరూ, వెల ౧౦ అణాలు. ౧౯౩౯ ప్రచురణ.

Printed and Published by S. Sambhu Prasad, at the Andhra Patrika Press,
No. 7, Thambu Chetty St., G. T., Madras. Editor—S. Sambhu Prasad.







చక్కని రుచి, ఘుమ ఘుమలాడే
సువాసన, నేత్ర పర్వంగావుండే
రంగు, తక్కువధర, వీటి అన్నింటి

నిబట్టి లిప్టన్స్ టీ గర్ల్

మిగతా వాటిని తలదన్ని అత్యా
ధిక గౌరవాన్ని తెచ్చుకున్నది.

# లిప్టన్స్ టీగర్ల్

మృదు మధురమైన ఇండియన్ డస్ట్ టీ

LTK 846




నిర్బంధాలతో నిండిన యుద్ధకాలపు రైళ్ళ రాకపోకల
యేర్పాట్లలో, ప్రయాణం ఆనందదాయకం ఔటకు
మారుగా అవస్థలమయం ఔతున్నది.
యుద్ధానికిపూర్వంకన్నా రైలుచార్జీలు ఇప్పుడు చాలా హెచ్చు.
బుకింగ్ ఆఫీసులు, ప్లాట్ ఫారములు, ముఖ్యంగా రైలుపెట్టెలు
ఎంతో కిటకిటలాడుతూ అసౌకర్యంగా వుంటున్నాయి.
ప్రయాణాలలో ఆహారపదార్థాలను సంపాదించడం మహాకష్టం.
నిజంగా—యెంతో అవసరమైతేనేగాని ప్రయాణం
చేయడం అనేది యీ రోజులలో అనాలోచితమే.
కాని అవశ్యం ప్రయాణం చేయవలసినవారు
మాత్రం—ప్రతి స్టేషనులోనూ సుస్వాగతమిస్తూవుండే 'తోపుడు బండివాలా' ను చూడగలరు.
వేడి గాడ్పులలో చలువ, చలిలో వెచ్చదనాన్ని కలుగజేస్తూ
వుండే టీపానీయము సర్వదా లభ్యంఔతుంది. అది చాక.
మీరు రైలులోనైనా మరెక్కడనైనాసరే-అసౌకర్యంగా,
అలసటగా, చికాకుగావున్నప్పుడు
టీ, మీకు సంతోషాన్ని, వుషారుని
యిస్తుందని మీరు గ్రహించగలరు.



ఒత్తిడిసమయాలలో ఇండియన్ టీ వేపుమరలండి

ఇండియన్ టీ-మార్కెట్ ఎక్స్పాన్షన్ బోర్డుచే ప్రకటితము.

IK-238 TC